# ఆత్మీయం

## (నవల)

స్వాతి
సచిత్ర మాసపత్రిక
జులై, 2015 సంచిక
అనుబంధ నవలగా
ప్రచురింపబడింది
ముఖచిత్రం: స్వాతి సౌజన్యంతో.

**వెల:రు. 80**


**:రచయిత చిరునామా:**

**పి.ఎస్.నారాయణ**

**8-3-168/20/బి/7,**

సిద్ధార్థనగర్ నార్త్, ఏజీ కాలనీ దగ్గర,

హైదరాబాద్-**500 038**

ఫోన్ నం: **040-23713835/9948319407/9959808862**

Email; potturi_snarayana@yahoo.co.in

గమనిక

ఈ నవలలోని పాత్రలు, సంఘటనలు–
అన్నీ కల్పితాలు, ఎవర్నీ ఉద్దేశించినవి కావు.
ఎక్కడయినా పోలికలు, సామ్యాలూ
కనిపించినా అవి యాదృచ్ఛికమే.

–రచయిత

# ఆత్మీయం

ఆరోజు మధ్యాహ్నం రిజిస్టర్డ్ పోస్ట్‌లో వచ్చిన ఉత్తరం చక్రవర్తిని ఎంతగానో ఉద్విగ్నతకు లోనుచేసింది. 'భూలోక స్వర్గం' అంటూ వాళ్ళ తాతయ్య బ్రతికున్నంత కాలం చెప్పిన సాయీరాంపురంలో అతడికి ఉపాధ్యాయుడిగా ఉద్యోగం రావటం ఓ అద్భుతంలా తోచింది. ఆ ఊళ్ళోవున్న ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో లెక్కల టీచర్‌గా నియమిస్తూ వచ్చిన ఉత్తర్వులు అవి. వారం రోజుల్లో వెళ్ళి జేరాలి.

తండ్రితో ఆవిషయం చెబితే, "అదో గొడ్డు పల్లెటూరు కదరా... ఇంకెక్కడైనా మంచి ఊరులో వస్తుందేమో ప్రయత్నించరాదు!" అంటూ కొడుకు ఆనందం మీద బిందెడు నీళ్ళు కుమ్మరించాడు.

"నువ్వు ఆ ఊరును చూసి ఎన్నేళ్ళయింది, నాన్నా!"

"నువ్వు పుట్టిన కొద్ది నెలల వరకూ ఆ గ్రామంలోనే ఉన్నాం!"

"అంటే ఇరవై మూడేళ్ళు దాటినయి అన్నమాటే కదా!"

"అవును!"

చక్రవర్తి తాతయ్య సాయీరాంపురం ప్రాథమిక పాఠశాలలో ప్రధాన ఉపాధ్యాయుడిగా పనిచేశాడు. అప్పుడు ఆయన, ఆయన సంతానం అంతా ఆ ఊళ్ళోనే వుండేవారు. ఆయన పెద్దకొడుకు కొడుకే చక్రవర్తి. తండ్రి మొదట్లో పక్కనే ఉన్న పొగాకు కంపెనీలో కొద్దికాలం పనిచేసినా, తరువాత ప్రభుత్వోద్యోగం రావటంతో గుంటూరుకు మారాడు. అక్కడ కొన్నాళ్ళు, ఆపైన నాగార్జున సాగరు, ప్రస్తుతం హైదరాబాదు.

"పాతికేళ్ళలో దేశం ఎంతగా మారిపోయిందో నీకు తెలియదా?" అన్నాడు నవ్వుతూ చక్రవర్తి తండ్రితో.

"అంటే వెళ్ళి ఆ ఉద్యోగంలో జేరటానికే నిర్ణయించుకున్నావన్నమాట!"

"తాతయ్య బ్రతికున్నంతకాలం ఆ ఊరు చుట్టూ పచ్చటి పొలాలతో ఎంత అందంగా వుండేదో, అక్కడ మనిల్లు ఎలా కళకళలాడుతుండేదో చెప్పిన సంగతుల్ని నేను మర్చిపోలేకపోతున్నాను, నాన్నా!"

తండ్రి నవ్వేసి ఊరుకున్నాడు.

"తాతయ్య చెప్పింది వినటమే కాని నేనయితే ఎప్పుడూ ఆ ఊరు వెళ్ళలేదు, చూడలేదు. కనుక ఒక పని చేస్తాను! వెళ్ళటమయితే వెళ్ళి ఆ ఉద్యోగంలో జేరి ఆయన చెప్పిన మన ఊరు, మనిల్లు ఎంత అద్భుతమైనవో చూస్తాను... తాతయ్య మాటలు నిజమే అయితే అక్కడే ఉండిపోతాను... లేదా అక్కడనుంచి బదిలీ చేయించుకుని వచ్చేయటమో, కుదరకపోతే మరో ఉద్యోగం చూచుకోవటమో చేస్తాను!" చక్రవర్తి మనస్ఫూర్తిగాను, నిజాయితీతోనూ చెప్పాడు.

"మీ అమ్మకు చెప్పు ఏమంటుందో!"

చక్రవర్తికి తెలుసు తండ్రిని ఒప్పించగలిగితే. తల్లిని ఒప్పించటం ఏమంత కష్టం కాదని.

"నీ ఇష్టంరా... ఉద్యోగరీత్యా ఎవరు ఎక్కడ తేలతారో ఎవరికి తెలుసు... నేను పెళ్ళి చేసుకుని మీ నాన్న చేయి పట్టుకుని సాయీరాంపురంలో కాలు పెట్టాను... ఆ రోజున ఆ ఊళ్లో ఉండాల్సివస్తుందనీ అనుకోలేదు, ఇప్పుడు ఇక్కడ హైదరాబాద్‌కు జేరి ఓ స్వంత ఇల్లు కట్టుకుంటామనీ అనుకోలేదు... ఎవరి గమ్యం ఎటో ఎవరూ చెప్పలేరు కదా... కానీ, నువ్వు వివాహం చేసుకుని ఎక్కడకు ఊరేగినా మాకు దిగులు ఉండదు!" కొడుకు వెళ్ళటానికి అంగీకారమో, అనంగీకారమో తెలియనంత గుంభనగా అన్నది.

"నువ్వేమీ దిగులు పడవద్దమ్మా! నాతోపాటే ఆ గ్రామంలో ఉండటానికి ఇష్టపడే అమ్మాయిని చూడు... నువ్వు ఓకే అంటే నేనూ ఓకేనే!" అన్నాడు చక్రవర్తి తల్లి భుజంమీద చేయివేసి ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంటూ.

సరిగ్గా నాలుగు రోజులకు బస్సెక్కి కూర్చుంటే బోసినోటితో నవ్వుతూ తాతయ్య కళ్ళముందు కదిలాడు.

ఆ ఊరు గుర్తుకు వచ్చినప్పుడల్లా ఆయనకు కళ్ళమ్మట నీళ్లు గిర్రున తిరిగేవి. ఆయన మాటల్లోనే చెప్పాలంటే– 'ఆ ఊరే నేను... నేనే ఆ ఊరు– ఆ ఊరులో నివసించే ప్రతివ్యక్తి పేరుపేరునా నాకు తెలుసు– ఆ ఊరుకు మించి నాకు మరొకటి తెలియదు. మాకు మంగళగిరి మూడు కిలోమీటర్ల దూరంలో వున్నది. నరశింహస్వామి గుళ్ళో దసరాకు, ముక్కోటికి మీ బామ్మా నేనూ పిల్లల్ని తీసుకుని గూడు బండి కట్టించుకుని వెళ్ళి దర్శనం చేసుకుని వచ్చేవాళ్ళం... నేను పానకాలస్వామి కొండకు ఎన్నిసార్లు ఎక్కానో లెక్కేలేదు!'

'వెయ్యి గడప అంటుంటివి, భూలోక స్వర్గమంటుంటివి... పొంతన ఏదీ?' ఒకసారి ఆయన్ను తను హైస్కూల్లో చదువుకుండే రోజుల్లోనే నిలదీశాడు.

ఆ ప్రశ్నకు ఆయన లోతుకుపోయిన బుగ్గలమీద చేయి వేసుకుని పకపకా నవ్వాడు. 'స్వర్గమంటే ఏమిట్రా?'

'అన్ని ఆనందాలూ మనకు లభించే ప్రదేశం అని!'

'నేను అంగీకరించను... డబ్బు పారేస్తే ఛండాలపు సుఖాలన్నీ పొందినంత మాత్రాన అది స్వర్గం ఎలా అవుతుంది. మనిషికీ మనిషికీ నడుమ ఆత్మీయత, ఆప్యాయత ఉండాలిరా... ఆలాంటి వాళ్ళ నడుమ బ్రతకటం, పచ్చని చెట్లక్రింద తిరగటం, కడుపుకు తిండి కోసం వెనక్కు తిరిగి చూసుకోవాల్సిన అవసరం లేకపోవటమే స్వర్గమంటే... అక్కడ మేం ఎప్పుడైనా కూరలు కొనుక్కున్నామా... మా వాకిట్లో పందిరిమీదకు కాకరపాదు, దొండపాదు, సొరపాదు పాకివుండేవి... వాటి కాయల్ని నేను నలుగురికీ పంపిస్తే మా ఇంటికి ఎన్ని రకాల కూరలు వచ్చేవో తెలుసా... నాకు

రెండెకరాల చెక్కే... అయితేనేం రాజాలా బ్రతికాం నేనూ, మీ బామ్మా, మా పిల్లలూ ఆ పంట తింటూ,ఉపాధ్యాయుడిగా గౌరవప్రదమైన ఉద్యోగం చేసుకుంటూ...'

కళ్ళు పెద్దవి చేసుకుని తాతయ్యనే చూస్తూ ఉండిపోయాడు తను.

'ఆ ఊళ్ళో నేను రోడ్డుమీద నడుస్తుంటే కూర్చున్న మనిషి కనిపించేవాడు కాదు... అంత గౌరవమిచ్చేవాళ్ళు... ఇక మనిల్లంటావా... నాలుగు వందల గజాల స్థలంలో పెంకు నేసిన విశాలమైన మండువా ఇల్లు. కుడివైపు కిటికీ పక్కగా పందిరినంతా ఆవరించుకుని తెల్లగా నక్షత్రాల్లా మెరుస్తుండే సన్నజాజులు... ఈశాన్య దిక్కున పెద్ద పళ్ళెం నడుమ బావి... నాలుగు బారల చాంతాడుకు అందే అమృతంలాంటి నీరు... నైరుతీ దిక్కున ఎర్రగా పండిన కాయలతో బాదం చెట్టు... మీ బామ్మ దాని ఆకులతో కుట్టిన తాజా ఇస్తళ్ళలో అందరికీ రోజూ వేడివేడి అన్నం వడ్డించేది... ఓ పక్కగా గొడ్లసావిడి... అందులో రెండు బర్రెలు, ఒక ఆవు... వాటి దూడలు...

ఇక మీ బామ్మ దినచర్య అంటావా... పొద్దున లేస్తూనే వాకిట కళ్ళాపి చల్లి ముగ్గేసేది... అది ముగ్గు వేయకుండా ఎవరైనా గడప దాటారో... అసలే బక్కపీచు... త్రాచులా అంతెత్తున లేచి బుసలు కొట్టేది!' నవ్వేవాడు బోసినోరంతా తెరిచి ఆయన.

బామ్మ ముసిముసి నవ్వులతో, 'గరుత్మంతులవారు ఇంట తిరుగుతుంటే ఎంత త్రాచయినా, బుస సంగతి వదిలేసేయ్... తలెత్త గలుగుతుందా అని!' అంటూ కల్వంలో రెండు తమలపాకులు వేసి, వక్కపలుకు, సున్నమూ కలిపి దంచుతుండేది. అది బాగా మెత్తబడిం తరువాత పళ్ళులేని ఇద్దరూ రెండు ఉండలు చేసుకుని బుగ్గన పెట్టుకునేవారు.

'మనవడా! సంక్రాంతి పండక్కు చూడాలిరా మనిల్లు!" బామ్మ అందుకునేది. 'మంగళగిరి తిరుణాళ్ళలో ప్రతిసంవత్సరం ఒకటి రెండు బొమ్మలు కొనాల్సిందే, మనవరాళ్ళకు, మనవళ్ళకూ పండ్లు పోసి బొమ్మలు పెట్టాల్సిందే... ఈ పట్నాలలో ఇప్పుడెవరు పెడుతున్నారు కాని, అప్పుడు మన సాయీరాంపురంలోని ముత్తయిదువులంతా కనుము వెళ్ళిందాకా రోజూ సాయంత్రం పూట మనింటికి

రావాల్సిందే, పంతులుగారి ఇల్లాలు చేతులమీదగా పండూ తాంబూలం తీసుకు వెళ్ళవలసిందే!' బామ్మ ముసిముసి నవ్వులతో చెబుతుంటే వింటుండే వాడు తను.

'మనం గుంటూరుకు మారినప్పుడే ఆ ఇల్లు మనది కాకుండా పోయింది... ఏం చేస్తాం ఖర్మ... నా కెంతగా నచ్చినా, నా పిల్లలకు నచ్చొద్దూ... వాళ్ళ దృష్టిలో అది గొడ్డు పల్లెటూరే... ఇంగ్లీషు చదువులు తలకెక్కించుకుంటున్న వాళ్ళకు ఏముందక్కడ పేడకంపు తప్ప– అంటూ ఎగతాళి చేయటానికి మించి!'

విజయవాడలో ఎక్కిన గుంటూరు ఎర్రబస్సు సాయిరాంపురం బస్టాండులో కాలుపెట్టేటప్పటికి ఎనిమిది గంటలవుతోంది. మంగళగిరి దాటిన పదినిముషాలకు వచ్చిన ఆ ఊరును చూస్తూనే పెట్టె, సంచీని తీసుకుని తలుపు దగ్గరకు వచ్చాడు చక్రవర్తి. సాయిరామపురం మెయిన్ రోడ్డునుంచి కిలోమీటరు దూరంలో లోపలకు ఉంటుందని తాతయ్య చెప్పిన గుర్తు.

కానీ బస్సు దిగితే ఊళ్ళో దిగినట్లే వున్నది. నాలుగు దార్ల విశాలమైన రోడ్డు అది. మధ్యలో డివైడరు. బస్సు ఆగిన చోట రోడ్డుకు అటూ ఇటూ ఇంకా తెరవని కొట్లు... తెరిచివున్న టీ దుకాణాల చుట్టూ మూగివున్న జనం...

బస్సు ఆగగానే దిగి, "సాయిరాంపురానికి దారి ఎటు?" అని అడిగాడో ఖద్దరు చొక్కా తొడుక్కున్న లావుపాటి మనిషిని. ఆయన అప్పుడే ఎవరితోనో మాట్లాడి సెల్‌ను ఆఫ్ చేశాడు. ఆయన వెనగ్గా ఓ ఐదారుగురు అనుయాయుల్లా ఉన్నారు నడుస్తున్నారు.

ఆయన అడుగు ముందుకు వేస్తున్నవాడల్లా ఆగి విచిత్రంగా చక్రవర్తి వంక చూస్తూ, "ఇదే సాయిరాంపురం... మీరెక్కడికి వెళ్ళాలి?" అన్నాడు.

"ఈ ఊళ్ళో వున్న ప్రభుత్వ పాఠశాలకు వెళ్ళాలి!"

"మా స్కూలుకు వచ్చిన కొత్త పంతులుగారా... ఓ పనిచేయండి... ఈ రోడ్డంట సరాసరి కిలోమీటరు దూరం పోతే మీకో పాడుబడ్డ బిల్డింగ్ కనబడుతుంది

ఉప్పుచవుడు రాలుస్తూ... మీరు ఎవరినీ అడగక్కర్లా, దాన్ని చూస్తూనే గుర్తు పట్టేస్తారు... ఇక్కడ షేర్డ్ ఆటో ఎక్కితే సరిగ్గా స్కూలు ముందు దింపుతాడు ఆరు రూపాయలు తీసుకుని!"

స్కూలెక్కడ అని అడగగానే తనను కొత్తగా వచ్చిన టీచరుగా గుర్తించాడంటే ఈ ఊరులో ప్రముఖుడే అయివుండవచ్చుగాని, అతడి మాట తీరుకు చక్రవర్తి మనస్సు చివుక్కుమన్నది.

తన తాతయ్య పనిచేసింది ఎలిమెంటరీ స్కూలే అయినా తనిప్పుడు ఉద్యోగంలో జేరుతున్నది హైస్కూలులో. తాతయ్య ఈ ఊరు వదిలిన తరువాత కట్టిన ఆ స్కూలే అలా ఉంటే, ఆయన పనిచేసిన ఎలిమెంటరీ స్కూలు ఇంకెంత అధ్వాన్నంగా ఉన్నదో?

తాతయ్య మాటలే గుర్తుకు వస్తున్నయి. 'బస్సు దిగిన చోట పెద్ద చింతచెట్టు ఉండేదిరా... ఎండాకాలం వచ్చిందీ అంటే ఆ చెట్టుక్రింద రెండు పెద్ద కుండలతో మజ్జిగ పెట్టుకుని లక్షమ్మవ్వ కూర్చుండేది... బస్సు ఎక్కటానికి వచ్చే వాళ్ళకు, బస్సు దిగిన వాళ్ళకు కరివేపాకు వేసిన చల్లటి మజ్జిగను అల్యూమినం గ్లాసుల్లో పోసి ఇస్తుండేది!'

'బాగా డబ్బున్న ఆవిడా ఆమె, తాతా?'

'చల్లటి మజ్జిగ ఇవ్వటానికి డబ్బుండాలిటరా... ఏడింటినుంచి ఎనిమిదింటి దాకా ఊళ్లో అందరిళ్ళకూ వెళ్ళి పోయించుకు వచ్చేది... తరువాత ఆవిడ భర్త కావిడితో కుండల్ని తెచ్చి ఆ చెట్టుక్రింద పెట్టి పొలానికి వెళ్ళేవాడు... అదేమో మొగుడికి, పిల్లలకు అన్నం ఉడకేసి ఎండెక్కే సమయానికి వచ్చి పీటేసుకుని ఆ కుండల దగ్గర, మజ్జిగ అయిపోయేటంత వరకూ కూర్చుండేది!' ఆ మాటలు చెబుతున్నప్పుడు ఆయన కళ్ళు మెరిసేవి.

బస్సు ఆగిన చోట ఆయన చెప్పినట్లుగా పెద్ద చింతచెట్టే కాదు ఏ చెట్టూ లేదు. అటూ ఇటూ పెద్దపెద్ద ఇళ్ళు, షాపులు, చిన్నచిన్న బడ్డీకొట్లు...

చక్రవర్తి ముందుకు అడుగులు వేస్తున్నాడు తారు రోడ్డుమీద. ఆటోలు తిరుగుతున్నయి. వెనుక నలుగురు, డ్రైవరు పక్కన రెండువైపులా ఇద్దరు. వాటిమీద ఎక్కబుద్ధి కాలేదు, భుజాన తగిలించుకున్న సంచీ, చేతిలో పెట్టె బరువుగావున్నా.

స్కూలుకు వెళ్ళి, అది తెరిచినా తెరవకపోయినా అక్కడే వరండాలో కూర్చుంటే సరి. తొమ్మిదిన్నరకు జాయినింగ్ రిపోర్ట్ ఇవ్వమన్నది తల్లి ఆ సమయం బాగుండటంతో.

ఇంట్లో ఎవ్వరికీ తనీ ఉద్యోగంలో జేరటం అంతగా ఇష్టంలేదు. అమెరికాలో వున్న అన్నయ్య అయితే తిట్టాడుకూడా– "మారుతున్న రోజులతోపాటు మనమూ మారాలిరా... కూపస్థమండూకంలా బ్రతుకుతానంటే ఎలా?" అంటూ. చిన్నన్నయ్య అయితే మాట్లాడలేదు. వినేసి ఊరుకున్నాడు. అనంతపురంలో ఉన్న అక్కయ్యకు ఇంకా చెప్పలేదు.

అసలు తను బీఎడ్‌లో జేరుతున్నప్పుడే పెద్దన్నయ్య సన్నగా చివాట్లు పెట్టాడు. కానీ తాత మాటల ప్రభావంతో స్కూలు టీచర్‌గానే ఉద్యోగం చేసి నలుగురు మెప్పు పొందాలని, విద్యార్థుల్ని అత్యున్నత స్థాయిలో తీర్చిదిద్దాలనేది తన కోరిక... వీలయితే తరువాత ఎమ్మే చేసి, పిహెచ్‌డీ సంపాదించి ఎక్కడైనా లెక్చరర్‌గా జేరవచ్చు... ఎంతో గౌరవప్రదంగా బ్రతికిన తన కిష్టమయిన తాతయ్య ఆత్మకు తృప్తిని, ఆనందాన్ని కలిగించటమే తన ధ్యేయం.

మరో మలుపు తిరుగుతుండగానే బస్టాండులో కనబడిన ఖద్దరు చొక్కా మనిషి చెప్పిన పాడుబడ్డ బిల్డింగ్ కనబడనే కనబడింది. ఆ పైన పిల్లల గోల అదే స్కూలు అని బెబుతోంది. ఆయన చెప్పినదాంట్లో అతిశయోక్తి ఏమీలేదు.

విరిగిపోయిన ఆ స్కూలు గేటు దాటి లోపల కాలుపెట్టాడు చక్రవర్తి. నాలుగు వైపులా వరుసగా గదులు... మధ్యలో ఖాళీ స్థలం... బయటకు గోడలు ఉప్పుచవుడు రాలుస్తూ కనబడుతున్నా లోపల శుభ్రంగానే వున్నది.

హెడ్మాస్టరు గారి గదిముందు నిలబడి తలుపు పక్కగా వున్న 'కె.పూర్ణచంద్రరావు, ఎమ్ఏ, బిఇడి, ప్రధానోపాధ్యాయులు' అన్న చిన్న బోర్డును చూస్తూ లోపల

కాలుపెట్టబోతుండగా లోపలనుంచి ఓ స్త్రీ కంఠం చాలా కరుకుగా వినబడింది.

"ఎవరైనా సరే నా స్వవిషయంలో కల్పించుకుంటే ముక్కు పచ్చడి చేస్తాను!"

ఆ మాటలకు ఉలిక్కిపడ్డట్లుగా ఎత్తిన కాలును దించి ఓ అడుగు వెనక్కు వేశాడు చక్రవర్తి– ఆ సమయంలో తను లోపలకు వెళ్ళటం సబబా అన్నట్లుగా.

హెడ్మాస్టరు వాకిటి దగ్గరనిల్చున్న చక్రవర్తిని, అతడి చేతిలోని పెట్టెను, భుజానికున్న సంచీని కొద్దిక్షణాలపాటు 'ఎవరా అనుకుంటూ' చూస్తూ ఉండిపోయాడు.

లోపలనుండి ఆ స్త్రీ మాటలు ఆగిపోవటంతో, చక్రవర్తి ఓ అడుగు ముందుకు వేసి, గోడవారగా పెట్టెను, సంచీను పెట్టి, "నమస్కారమండీ! నా పేరు చక్రవర్తి... మీ స్కూల్లో... " అంటూనే వున్నాడు ఆయన గలగలా నవ్వుతూ, "భేష్ భేష్... మీరు మా స్కూలుకు కొత్తగా వచ్చిన లెక్కల మాస్టారు... అవునా... స్వాగతం!" అన్నాడు.

అక్కడ ఆయనకు ఎదురుగా గోడవార కుర్చీలో కూర్చొని వున్న ఆమె సన్నగా పొడుగ్గా వున్నది. చామనచాయ అయినా చూడచక్కని ఆకర్షణీయమైన ముఖమూ, పెద్దపెద్దకళ్ళు...

"థాంక్సండీ!"

"శుభాశీస్సులు... మీరు ఎప్పటికయినా మా స్కూలుకు చక్రవర్తి అవుతారనే అనిపిస్తోంది మిమ్మల్ని చూస్తుంటే! భేష్... చాలా సంతోషం!" అన్నాడు ఆయన మరోసారి పెద్దగా నవ్వి. "అవునూ, ప్రస్తుతం మీరు ఏ ఊరుకు చక్రవర్తులు?"

ఆయన భావం అర్థమవ్వటంతో, "హైదరాబాద్‌నుండి వస్తున్నానండి! ఇదే ప్రథమ పోస్టింగు!" అన్నాడు వినయంగా.

"అయితే తప్పకుండా నాలాంటి అనుభవజ్ఞుల ట్రైనింగ్ మీకు కావాల్సిందే... ఆసీనులుకాండి... అంత మహానగరంలో పెరిగి ఈ పల్లెటూరులో ఇమడగలుగుతారా అనే నా సందేహాన్ని ముందు తీర్చండి, స్వామీ!"

“ఎంత గొప్ప ఫలాల్నిచ్చే చెట్టుకయినా మూలాలు మట్టిలోనేగదండి వుండేది... కాంక్రీట్ జంగిల్ కంటే పచ్చటి పొలాలతో నిండిన పల్లెటూరే ఈ వృత్తికి దృఢమైన పునాదిని వేసి ఎక్కువ ఆనందాన్ని కలిగిస్తుందనే నమ్మకంతో కాలుపెడుతున్నాను... చూద్దాం!” చక్రవర్తి చిరునవ్వుతో చెప్పాడు.

గోడవారన కూర్చున్న ఆ అమ్మాయి చప్పట్లు కొడుతూ లేచి చక్రవర్తి పక్కగా వచ్చి నిలబడి, “భేష్! స్వామీ ఆ మాటమీద మీకు కాపీరైటేం లేదుగదా అని కాపీకొట్టాను!” అని హెడ్మాస్టర్‌తో అంటూనే, ముఖం తిప్పి, “నన్ను అపార్థం చేసుకోబోకండి! మీ ఉద్దేశ్యం చాలా బాగున్నది... నా హృదయపూర్వక అభినందనలు!” అన్నది.

ఆ అమ్మాయి నవ్వుతూ మాట్లాడుతుంటే తెల్లని పలువరుస ఆమెకు మరింత అందాన్ని చేకూరుస్తోంది.

“భేష్! మా భ్రమర మెచ్చుకున్నదంటే మీకింకా తిరుగేలేదు... అవునూ– ఈమెగారిని మీకు పరిచయం చేయలేదుగదా... మన స్కూలులో పిల్లలకు రాజభాషను బోధిస్తుంది... తేనెటీగ కుట్టినట్లే మాట్లాడుతుందిగాని, మనిషి చాలా మంచిది, మనసంతా మధురమైన తేనెతోనే నిండివుంటుంది!” ఆయన మరోసారి పెద్దగా నవ్వాడు. “ఏమమ్మా! క్లాసులేదా... పంగనామాలా?”

చక్రవర్తి ఆ కొద్దిసేపటిలోనే గమనించాడు ఆయనకు ‘భేష్’ అనేది ఊతపదమని,

“రెండూకాదుగాని... ముందు వారి దగ్గరనుండి జాయినింగ్ రిపోర్టు తీసుకుని మీరు అందరికీ చెప్పేవేదం వారికీ చెబితే చరితార్థులవుతారు!” కిసుక్కున నవ్వింది.

టైం చూచుకుంటే తల్లి చెప్పిన మంచి సమయం ఐదు నిముషాల్లోకి వచ్చింది.

“ఇదుగో భ్రమరా! జాయినింగ్ రిపోర్టు తీసుకోగానే వీరిని తీసుకు వెళ్ళి వారు ఏలవలసిన రాజ్యాలేవో ఒకసారి చూపించి వస్తావా?”

“ముందు రాజుగారు... వెనగ్గా వారు... ఎంత చక్రవర్తులయినా మీకు సామంతులేగదా... ఆ పని మీరు చేస్తేనే హుందాగానూ, వారిని గౌరవించినట్లుగానూ

ఉంటుంది!”

“కొత్తా పాతా లేకుండా ప్రతిదానికీ ఎగతాళే?” ముఖం ముడుచుకుంటూ అన్నారు ఆయన.

“చక్రవర్తిగారూ! ఆయనకు ఆ కోపం ముక్కుమీదే గాని గుండెల్లో ఏమీ వుండదు... ఒట్టి బోళా మనిషి... ఆయనంత గొప్ప ఇంగ్లీషు టీచరు ఈ జిల్లాలోనే మరొకరు ఉండరనేది సత్యం!” అన్నది ఆయన్ను శాంత పరుస్తున్నట్లుగా.

ఆయన నవ్వుతూ, “ఇంకా ఆలస్యం దేనికి, భ్రమర చెప్పినట్లుగా జాయినింగ్ రిపోర్ట్ ఇస్తే మనం వెళ్ళి స్కూలులో ఓ రౌండ్ కొట్టివద్దాం... అలాగే మిగతా టీచర్లందరినీ పరిచయం చేస్తాను!” అన్నాడు.

చక్రవర్తి తల్లి చెప్పిన సమయానికే జాయినింగ్ రిపోర్టు ఇచ్చాడు.

“భ్రమరా! మాతోపాటు నువ్వు గూడా రాగూడదూ!” అన్నాడు కుర్చీలోనుంచి లేస్తూ.

“నేనెందుకులేండి... టీచర్లకు రెస్ట్‌రూం అంటూ ఒకటి ఏడిస్తే అక్కడే పడివుండేదాన్ని... పదోతరగతి హిందీ పుస్తకం ఈ సంవత్సరం మారిందికదా... ఇవ్వాళ క్లాసులో చెప్పబోయే పాఠానికి ప్రిపేరు అయి పిల్లలకు చక్కగా పాఠాలు చెప్పి మీకున్నంత పేరు తెచ్చుకోవాలని... ఇక్కడే కూర్చొని నా ఏడుపేదో నన్ను ఏడవనీయండి!”

ఆయన నవ్వుతూ ఆ గదిలోనుంచి బయట కాలుపెడుతుంటే చక్రవర్తి అనుసరించాడు.

“మీరు వివాహితులా?”

“ఇప్పుడు తల్లీదండ్రుల అనుమతితోనే ఈ ఊరు రాగలిగాను... అది కూడా అయితే మూడోవారి అనుమతి లభించటం కష్టమయ్యేదేమో!” అన్నాడు నవ్వుతూ చక్రవర్తి.

"భేష్! అయితే చేయి కాల్చుకోవటమే నన్నమాట... మీకో చిన్న ఇల్లు కూడా చూడాలి... అవునూ- పెళ్ళికాని డ్రాయింగ్ మాస్టారు చిదంబరం ఒక్కడే రెండు గదుల కొంపలో కాలం వెళ్ళబుచ్చుతున్నాడు... నీకు గది దొరికేటంతవరకూ ఆయనేమైనా ఆశ్రయం కల్పిస్తాడేమో కనుక్కుందాం... నీకేం అభ్యంతరం లేదుకదా?"

"అంతకంటే ఆనందమేమున్నదండీ... అలాగే!"

"భేష్! ఇంకేం లంచ్‌లో మాట్లాడదాంలే!"

పూర్ణచంద్రరావుగారికి ఇంకో సంవత్సరమే సర్వీసు ఉన్నదట. ఆయన మాట తీరు మంచివాడనే కాకుండా సరదా మనిషి అని కూడా చెబుతోంది. స్కూల్లో ఇరవైమందిదాకా టీచర్లు ఉన్నారు. అన్ని క్లాసులూ కలిపి ఆరువందల మంది విద్యార్థులుంటారు.

"హోటలు లాంటిదేదైబా వుంటే చేతులు కాల్చుకోవటం మొదలు పెట్టేటంత వరకూ కడుపుకింత తిండికి ఇబ్బంది లేకుండా ఉంటుందని అనుకుంటున్నాను!" చక్రవర్తి ఆయనతో అన్నాడు.

"ఇది పల్లెటూరు కాదు, పట్నమూ కాదు... బ్రహ్మచారులకు గది దొరకటమే గగనం... ఇక హోటలంటావా, బస్సు దిగిన చోటే ఓ హోటలుందిగాని శుభ్రంగా వుండదు, నువ్వక్కడ కూర్చొని తినలేవు... నేనీ మధ్యనే విన్నాను, శారదాంబగారని ఒకామె నీలాంటి వాళ్ళకు ఇద్దరుముగ్గురికి వంటచేసి క్యారియర్ పంపుతున్నదని... జవాన్ను పంపి వివరాలు కనుక్కుందాంలే!"

ఆయన ఆలోచన బాగున్నది. అదే సానుకూలమయితే తనకో బెడద తీరుతుంది. మధ్యాహ్నం భోజన విరామ సమయంలో చిదంబరంగారికి చక్రవర్తి సమస్య కూడా చెప్పారు. ఆయన పెద్దగా ఆలోచించలేదు. "మూడు గదుల ఇల్లు... చిన్న కొంప దొరక్క వెయ్యి రూపాయలు అద్దె ఇస్తూ ఆ ఇంట పడివున్నాను... షేర్ చేద్దాం!" అన్నాడు సంతోషంగా.

గ్రామం అనబడే సాయిరాంపురంలోనే ఇంటికి వెయ్యి రూపాయలదాకా అద్దె వున్నదంటే ఇప్పుడిది ఎంతగా మారిపోయిందో?

చిదంబరం వందుకు తింటున్నాడు. తనూ ప్రయత్నించవచ్చు అలవాటు లేకపోయినా. అభ్యాసం కూసు విద్య అన్నారుగదా. నలభీముడు కూడా ముందు తప్పటడుగులు వేయకుండానే అంత గొప్ప పేరు తెచ్చుకుని ఉంటాడా.

"మంచిదండి... ఆనందం... నాకో సమస్య తీర్చారు... ఆభ్యంతరం లేకపోతే వంటలో కూడా షేర్ చేస్తాను!"

"ముందు ఇల్లు చూడండి... నచ్చితే చీరలు కట్టుకుండే ఆలోచన అప్పుడు ఆలోచించవచ్చు!"

టీచర్లందరికీ పరిచయం చేసి, తన గదిలోకి తిరిగి వచ్చేటప్పటికి ఓ గంట పట్టింది. ఇంకా భ్రమర హెడ్మాస్టర్ గదిలోనే కూర్చుని వున్నది.

"భేష్! అదీ నిజాయితీ అంటే... తీసుకుంటున్న జీతానికి కష్టపడి పిల్లలకు చదువు చెప్పటం ఓ దైవకార్యమమ్మా!"

చక్రవర్తికి చటుక్కున తాతయ్య మాటలు గుర్తుకు వచ్చినయి. ఆయన ఈ ఊళ్లో పనిచేసిన వైనం చెప్పాలని నోటిదాకా వచ్చిందిగాని, పరోక్షంగా ఆయన పేరు ప్రఖ్యాతల్ని తెలుసుకొని అప్పుడు గర్వంగా తనెవరో చెప్పాలనుకున్నాడు... అలాగే తమ పాత ఇంటిని గురించి గూడా రహస్యంగా ఆచూకీ తీసి దాని వైభోగాన్ని చూడాలనుకున్నాడు!

అసలు ముప్ఫయ్ సంవత్సరాల క్రితం ఎలిమెంటరీ స్కూలు టీచరుగా పనిచేసిన ఆయన ఇప్పుడు ఎంతమందికి గుర్తున్నాడో తెలుసుకోవాలి ముందు!

"భ్రమరా! మాస్టారికి స్కూలంతా చూపించి వచ్చాను... టెన్త్ పరీక్షల్లో మన స్కూలు పిల్లల విజేతల శాతం పెరగటానికి ఏం చేస్తే బాగుంటుందో మీ ఇద్దరూ ఆలోచించండి!" అన్నాడు నవ్వుతూ. "కొత్తగా ఉద్యోగంలో జేరినవాళ్ళకు కొత్తకొత్త ఆలోచనలు ఉండటం సహజం కదా!"

“పెద్దాయన యావంతా టెన్త్‌క్లాస్ పిల్లల ఉత్తీర్ణతలో ఎర్ర గీత దాటాలని... ఎంత ప్రయత్నించినా నలభైతొమ్మిది శాతం దాటి చావటం లేదు... పాపం రిటయిరవ్వబోతున్న ఈ సంవత్సరంలోనన్నా దాన్ని యాభై ఒకటి చేసి ఘనమైన వీడ్కోలు ఇవ్వాలని స్టాఫ్‌లో చాలమందిమి ఇప్పటికే సర్వవిధాలా ప్రయత్నిస్తున్నాం... ఇక మార్కులు స్కోర్ చేయగలిగిన మీ సబ్జెక్ట్‌లో మీరూ కాస్త చొరవచూపిస్తే అదేమంత కష్టమని నేను అనుకోను!” అన్నది చక్రవర్తిని చూస్తూ. “చూద్దాం... ఎంతవరకూ విజయం సాధిస్తామో... ఇద్దరికీ మొదటి ఉద్యోగమే ఇది!” అన్నది నవ్వుతూ.

పళ్లు తళతళా మెరుస్తుంటే ముత్యాలు రాలుతున్నయ్యా అనిపించింది.

“అమ్మమ్మ! నువ్వు చెప్పింది భేషుగ్గానే ఉన్నదిగాని, ఎప్పుడూ పాతనీటికంటే కొత్త నీరే తియ్యగా వుంటుంది!... మీరు ముందుంటే చాలు ఫలితాలు బ్రహ్మాండంగా దూసుకుపోతయి... యాభై ఒకటేమిటి, డెభై దాటి ఈ జిల్లాకే మకుటమవుతుంది మన స్కూలు... ఈ బ్రహ్మచారిగారికి ఏ దిగులూ లేకుండా నివాసాన్ని ఏర్పాటు చేశాను... ఇక ఖాళీ సమయాన్ని ఆలోచనలతో నింపవలసింది స్కూలు, భోజనం గురించే... రెండోదాన్ని గురించి గూడా ఏదో ఒక ఏర్పాటు చేస్తానులే... సాయింత్రానికల్లా టైంటేబుల్ ఇస్తానుగాని, రేపటినుంచి గోదాలోకి దిగాలి చక్రవర్తిగారు!”

“మీరు తలుచుకుంటే కానిపనేముంటుంది పూర్ణచంద్రరావుగారు... మీ అనుభవం ముందు మావి కుప్పిగంతులే... కొత్త పంతులుగారూ! ఆయన అనుభవజ్ఞుడే కాదు మహా మేధావి కూడా... చూస్తుండండి సంవత్సరం తిరక్కుండా మీ బ్రహ్మచర్యం కూడా వదలకొడతారు!” అన్నది పకపకా నవ్వుతూ భ్రమర.

ఆమె మాటలకు బిత్తరపోయాడు చక్రవర్తి.

* * *

ఆ పూట చిదంబరమే ఇద్దరికీ వంటచేశాడు. అతడి వంటను చక్రవర్తి మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు. గరిట తిప్పటంలో చేయి తిరిగిన మనిషే!

ఆయన వంట చేస్తున్న సమయంలో తను తీసుకోవల్సిన క్లాసుకు సంబంధించి లెక్కల పుస్తకాన్ని తిరగేశాడు.

చిదంబరం ఒక చాప ఇస్తే తనకంటూ ఇచ్చిన గదిలో నేలమీద పరిచి దానిమీద దుప్పటి ఒకటి పడేశాడు పడుకోవటానికి అన్నట్లుగా. ఇక సామాన్లన్నీ ఒక్కొక్కటీ ఏర్పరుచుకోవాలి.

భోజనం చేస్తుండగా తోటి ఉపాధ్యాయులపైన, హెడ్మాస్టర్ గురించిన వివరాలు మాట్లాడుకున్నారు ఇద్దరూ.

"పూర్ణచంద్రరావుగారు పైకి నవ్వుతూ 'భేష్... భేష్' అంటూ సాత్వికంగానే మాట్లాడతాడుగాని పని విషయంలో రాక్షసుడే... క్రమశిక్షణను ఆయన ఆచరించటమే కాకుండా మనందరినీ ఆచరించమంటూ ఊదరకొడతాడు... ఈ రోజుల్లో ఎక్కడుండి చచ్చిందండీ అది?" అన్నాడు నిరాశగా చిదంబరం.

"ఆ మాట అనొద్దండి... నలుగురూ ఆయనలాగా ఓ పట్టుపడితేనే జిల్లాలోనే కాదు, రాష్ట్రంలోనే మన స్కూలుకు మంచిపేరు వచ్చేది... కార్పొరేట్ స్కూల్సు డబ్బున్నవాళ్ళ పిల్లల కోసం పెట్టినవి... ఆ ఫీజుల్ని భరించలేని వాళ్ళ నిలయాలే ఇవి. అందులో తెలివిగలవాళ్లు ఉండరనా మీ ఉద్దేశ్యం."

"అనికాదు!" కాస్తంత తడబడ్డాడు చిదంబరం.

"తలుచుకుంటే ప్రైవేటు పాఠశాలలకు మించిన ఫలితాలు ఇక్కడా తెప్పించవచ్చు... కావాల్సింది పట్టుదలే!"

"చూద్దాం కానీయండి... కొత్తల్లో చాలా మంది ఇలాగే అంటారు... సంవత్సరం తిరిగేటప్పటికి వాళ్ళూ నీరసించిపోయి, ఎలా చెప్పినా మన జీతం మనకు వస్తుందిగదా అనే ధోరణిలోకి వెళ్ళిపోతారు... ఈ ప్రభుత్వ స్కూళ్ళలో మనకేం ప్రోత్సాహం వుంటుందండి... చదువు సరిగ్గా చెప్పినవాడినీ, చెప్పనవాడినీ ఒకే గాటిలో కట్టేస్తారు!"

"నేను ఈ ఊరుమీద ఎంతో అభిమానంతో వచ్చాను... నా సబ్జక్టులో విద్యార్థులని

ఉత్తేజుల్ని చేయాలనేది నా కోరిక... పూర్ణచంద్రరావుగారు ఈ సంవత్సరం ఉద్యోగ విరమణ చేయబోతున్నారని తెలిసింది... ఆయనంటే అందరికీ గౌరవం ఉన్నట్లుగా ఒక్కరోజులోనే గ్రహించాను... అందుకే రాష్ట్రపఠంలో మన బడి ఓ మెరుపు మెరిసేలా చేసి ఆయనకు ఘనమైన వీడ్కోలు ఎందుకు ఇవ్వగూడదో ఆలోచించండి... రేపు స్కూల్ మీటింగ్‌లో మన తోటి ఉపాధ్యాయులతో అందుకు శపథం చేయించాలనేది నా ఆలోచన!" అన్నాడు చక్రవర్తి దృఢమైన కంఠంతో తాతయ్య కళ్ళముందు నిలబడి బోసినోటితో నవ్వుతుండగా.

ఆయన ఎప్పుడూ అనే మాటలు గుర్తుకు వచ్చినయి. 'నేను వీధిన నడుస్తుంటే కూర్చున్న మనిషి కనబడేవాడు కాదురా?' అంటూ. గురువులకు అలాంటి గౌరవం లభించినప్పుడే విద్యార్థులలో చదువుమీదా శ్రద్ధ ఏర్పడి ఉన్నత స్థితిలోకి వెళ్ళ గలుగుతారు. విద్యార్థులకు ఉపాధ్యాయులంటే భయముండాలి... కొడతారని కాదు, సబ్జక్టులో ఆయనేసిన ప్రశ్నకు సరైన సమాధానం చెప్పగలిగి ఉండాలని!'

"మీకు ఈ ఊరిమీద, ఈ స్కూలుమీద ఎందుకు అంతగా అభిమానం ఏర్పడింది?" ఉత్సుకతతో అడిగాడు చిదంబరం.

తాతయ్యగురించి చెప్పాలని నోటిదాకా వచ్చింది కాని, ఇప్పుడు కాదు ఈ గ్రామప్రజలకు ఆయన గుర్తున్నాడో లేదో తెలుసుకోవాలి. తన గుండెల్లో ముందు ఆయన మీద వున్న గౌరవాన్ని మరింత పటిష్టం చేసుకుని, ఆయనున్న ఆ ఇంటి అందాలని కనులారా చూసి అప్పుడు ఇక్కడకు తన రాకలోని ఆంతరార్థాన్ని నలుగురికీ తెలియబరచాలి. ఆయన గొప్పదనానికి గుర్తింపుగా తను ఈ వృత్తిని చేపట్టినట్లుగా నలుగురూ తెలుసుకున్నప్పుడే తను ఆ ఆనందాన్ని ఆస్వాదించగలుగుతాడు.

"ఈ గ్రామం పేరులో నేను నమ్మిన దేవుడుంటమే నన్నిక్కడకు రప్పించింది!" అన్నాడు గుంభనగా.

చిదంబరం చేయి చాస్తూ, "ఆల్ ద బెస్ట్!" అన్నాడు. "నా సబ్జక్ట్‌లో పరీక్షలే ఉండవ్. ఎక్స్‌ట్రా కర్రిక్యులర్ యాక్టివిటీ క్రిందే తరగతిలో వారానికి ఒకరోజున ఓ

గంటపాటు బొమ్మలు గీయిస్తున్నది... పిల్లలూ దాన్ని తేలిగ్గానే తీసుకుని కాలక్షేపానికి కూర్చుంటారు... నా క్లాసులో ఉండవలసిన పిల్లల్లో ఎప్పుడూ సగంమందే ఉంటారు!"

"డ్రాయింగ్ మీద ఉత్సాహం ఉన్న పిల్లలు లేరంటారా?" చక్రవర్తి ఆయన్నే సూటిగా చూస్తూ అడిగాడు.

"ఉండరని అనను గాని... ఇళ్ళల్లోకూడా అలాంటి పిల్లల్ని ప్రోత్సహించేవాళ్ళు ఉండాలికదా... డ్రాయింగ్ పేపర్లు, రంగులు కొనమంటే పెద్దవాళ్ళు ముందు చదువులు ఏడవండిరా తరువాత ఆ వెధవ బొమ్మలు వేద్దురుగాని అంటూ తేలిగ్గా తీసిపారేస్తారు!" అన్నాడు నిరుత్సాహపు నవ్వుతో చిదంబరం.

"ఒక పనిచేద్దాం... మన స్కూల్లో ఒకటినుండి పది దాకా తరగతులున్నాయి... ప్రతి తరగతిలోనూ ఈ కళమీద అత్యుత్సాహం చూపించే ఒకతన్ని మీరు ఎన్నుకోండి... ఉపాధ్యాయులమూ ఇరవైమంది దాకా ఉన్నాం... అందులో పదిమంది ముందుకు వచ్చినా సంవత్సరానికి అలా ఎన్నుకున్న విద్యార్థుల ఖర్చును మనమే భరించవచ్చు!"

"మంచి ఆలోచనే... తప్పకుండా... నా సబ్జక్ట్‌కూ ఓ గుర్తింపు వస్తుందంటే నాకూ ఆనందమే!"

చక్రవర్తి హాయిగా నవ్వాడు– తన తాతగారికి ఇష్టమయిన ఈ ఊరును తనూ ఓ అద్భుతమైన ఊరుగా భావిస్తూ ఆనందించాలి... అప్పుడే తను ఇక్కడకు రావటంలోని తృప్తి పొందగలిగేది.

టైం చూచుకుంటే పదయింది. మాటల్లో సమయం తెలియనే లేదు.

"పొద్దున్నే నేనూ మీతో పాటు వంట కార్యక్రమంలో పాల్గొంటాను!"

"వెల్‌కమ్!"

తన గదిలోకి వెళ్ళబోతూ, చక్రవర్తి, "భ్రమరగారు ఈ మధ్యనే జేరారని విన్నాను... ఎందుకో ఆమె మాట కటువుగా ఉన్నట్లనిపిస్తోంది... పేచీకోరా?" అడిగాడు నుదురు ముడివేసి చిదంబరాన్నే చూస్తూ చక్రవర్తి.

"ఆమె ఎవరికీ అర్థం కావటంలేదు... ఒకసారి హెడ్మాస్టరుగారే మాటల్లో... 'ఒంటరిగా ఈ పల్లెటూరుకెందుకొచ్చావమ్మా?' అని అడిగితే ఆమె నవ్వుతూ... 'కొంతకాలం ఈ పల్లె సౌభాగ్యాన్ని చూద్దామని... భవిష్యత్తులో అది వీలుపడుతుందో లేదో!' అన్నదట... ఒకటి మాత్రం నిజం... ఆమె మరొకరి విషయంలో జోక్యం చేసుకోదు... తనజోలికి వస్తే ఊరుకోదు!"

– అంటే తన ఆలోచనా ఆమె ఆలోచనా ఒకటేనా?

అదే నిజమయితే మనస్సులో తెలియని తృప్తి...

"ఆమె ఎన్నాళ్ళయింది జేరి?"

"క్రితం సంవత్సరం మధ్యలో వచ్చింది!"

"బదిలీమీదా?"

"అనుకోను... కొత్త రిక్రూటీయే అనిపిస్తోంది... ఎల్పీసీ తీసుకురాలేదు!"

"వివాహమయిందా?"

"తెలియదు... ఏ ఊరునుంచి వచ్చిందో తెలియదు... ఏం చదివిందో తెలియదు... ఇంతకు ముందు ఎక్కడైనా పనిచేసిన అనుభవం ఉన్నదో లేదో తెలియదు... ఈ ఆరునెలల్లో ఎవరు ఆమె గురించిన వివరాలు అడిగినా నవ్వేస్తుందేగాని చెప్పలేదు... ఆమె వెనుక ఏదో మిస్టరీ ఉన్నదని మా అనుమానం... మీరన్నట్లు కాస్త గడుసు మనిషే, పీటీసారే ఒకటికి రెండుసార్లు వివరాలకోసం ఒత్తిడి చేస్తే... 'నా స్వవిషయంలో ఎవరైనా వేలు పెడితే ముక్కు పచ్చడిచేసి తరువాత చెబుతాను ఆ వివరాలు అన్నది!' అంతటితో ఆయన ఆమెతో మాట్లాడటమే మానేశాడు... మిగతావాళ్ళయితే ఆ సంగతి తెలిసి మరోసారి ఆ ప్రశ్న వేయనేలేదు... ఆమె గుంటూరునుండి వచ్చి ఉండవచ్చని భోగట్టా... కాస్త విచిత్రమయిన మనిషేలేండి!" అన్నాడు నవ్వుతూ. "ఆమెనో నిప్పుకణికలా భావిస్తూ దూరంగా వుండటానికి అలవాటు పడ్డాం మేమంతా... కొత్తగదా అని చెబుతున్నాను... ఆమె దగ్గర చొరవచూపించి అభాసవ్వద్దు!"

ఆ మాట తీరు చూస్తుంటే, చిదంబరమూ ఆమె నోటి దెబ్బలు ఒకసారి రుచిచూసి ఉండవచ్చునే అనిపించింది చక్రవర్తికి. అయినా అడగలేదు కదా. "థాంక్స్!" అని ఊరుకున్నాడు.

చాపమీద పడుకుని ఆలోచిస్తున్న అతనికి ముందు తల్లికి ఫోన్ చేయాలనిపించింది. పెట్టె తీసుకు బయల్దేరుతుంటే ఆమె పదేపదే రోజూ ఫోన్ చేస్తుండమని చెప్పటం గుర్తుకురాగా. వెంటనే సెల్‌ను చేతిలోకి తీసుకున్నాడు.

* * *

తాతయ్య చెప్పిన వాతావరణమేదీ ఈ గ్రామంలో కనబడుతున్నట్లనిపించటంలేదు. పెద్దపెద్ద మేడలువెలిసినయి. మెయిన్ రోడ్డునుంచి ఊరు లోపలకు కిలోమీటరు దూరంలో ఉంటుందని ఆయన చెప్పాడుగాని, తను బస్సును ఊళ్ళోనే దిగినట్లనిపించింది. తన పూర్వీకుల పెంకుటిల్లు ఇప్పటికీ అలాగే వున్నదో లేక చేతులు మారినట్లే రూపమూ మారిందో తెలియదు. ఆ ఇంటిముందు పందిరికి పాకిన నక్షత్రాల్లా మెరిసే సన్నజాజిపూల తీగ ఇంకా ఉండి వుంటుందా? అలా ఉండివుంటే తప్పకుండా దానిని స్వయంగా సృజించి తీరాలి. దొడ్లో బావి చుట్టూ పళ్ళెం... ఇప్పుడు బావిలో నీళ్ళు ఎవరు తోడుతున్నారు... అన్నిటికీ పంపులే... అవకాశముంటే ఆ ఇంట్లోనే తన నివాసం ఏర్పరుచుకోవాలి... తనవాళ్ళు తిరిగిన ఆ ఇంట గతాన్ని గుర్తుకుతెచ్చుకుంటూ ఆనందంగా గడపాలి... కానీ, తను గమనించాడు ఇప్పుడు ఎటు చూచినా డాబాలు, మేడలు... పెంకుటిళ్ళు చాలా తక్కువ కనబడినయి.

వచ్చిన మూడురోజులకు రాత్రి తొమ్మిది గంటలప్పుడు వంట కార్యక్రమం పూర్తిచేసి భోజనాలకు కూర్చుంటుండగా అంతకుముందు తను చూడని ఓ వ్యక్తి వచ్చాడు ఆ ఇంట్లోకి. సన్నగా పొడుగ్గా రివటలా వున్నాడు. తొడుక్కున్న లాల్చీ చాలా వదులుగా వున్నట్లనిపించింది. మధ్య పాపడి... నుదుట పొడుగ్గా తిలకం... కళ్ళకు లావద్దాల కళ్ళజోడు...

ఆయన్ను చూస్తూనే చిదంబరం ఆహ్వానిస్తూ, "రండి ఆంజనేయులుగారూ!"

అన్నాడు.

ఆయన చక్రవర్తిని చూస్తూనే, “ఎవరో అతిథి ఉన్నట్లున్నారు... తరువాత వస్తాను లేండి!” అంటూ వెనుదిరగబోయాడు.

“మనవాడే... మన స్కూల్లో కొత్తగా జేరిన లెక్కల మాస్టారు... పరిచయం కాలేదా ఇంకా?”

“ఎక్కడండీ... విజయవాడ వెళ్ళాను మా అక్కయ్యకు ఆరోగ్యం బాగోలేదని తెలిసి... సాయంత్రమే వచ్చింది! లెక్కల మాస్టారంటే చక్రవర్తిగారే గదా... ఆ మధ్య ఒకసారి పూర్ణచంద్రరావుగారు చెప్పారు కొత్త మాస్టారు వస్తున్నారని... సారూ! ఒంటరిగా ఉండటం తాత్కాలికమేనా?”

“ఇంకా వివాహం కాలేదండి!” అన్నాడు చక్రవర్తి ఆయన మాటలు అవగతమవ్వటంతో.

“త్వరగా చేసుకోండి మాస్టారూ! మనం ఎక్కడ తిరిగినా, ఎప్పుడొచ్చినా ముందు అన్నం పెట్టేది భార్యే! నేను ఇంత హాయిగా తిరగగలుగుతున్నానంటే నాకు ఈ ఊళ్లో ఉన్న రెండెకరాల చెక్క, మా అత్తగారు నాకోసం కని పెంచి అప్పజెప్పిన రత్నమే కారణం!”

“వీరు ఆంజనేయులుగారని... వీరిది విజయవాడ... పది సంవత్సరాల క్రితం ఎవరో సాయిరాంపురం బాగుంటుందని చెబితే వచ్చి కొద్ది పొలం కొనుక్కుని, ఊరిబయట చిన్న రెల్లు ఇల్లు వేసుకుని స్థిరనివాస మేర్పరుచుకున్నారు... ఎల్ఐసీ, పోస్టాఫీస్ సేవింగ్స్, మ్యూచయల్ ఫండ్స్‌లాంటి చాలావాటికి ఏజెంటు... కాస్తోకూస్తో వాటిమీద ఆదాయమున్నా స్థిరంగా చేస్తున్నది వ్యవసాయమే... చిన్న తోటగూడా ఉన్నది. అందులో పండ్లతోపాటు కూరగాయలు పెంచుతున్నారు... అన్నిటికీ మించి ఎవరికి ఏ ఆపదవచ్చినా ముందుండి సాయం చేస్తుంటారు... చిన్నచిన్న రోగాలను, రొష్టులను పంచదార గోలీలతో తగ్గిస్తుంటారు... చాలా మంచివాడు... నేనీ ఊరు వచ్చినప్పటినుంచి నాకెంతో చేదోడు వాడోడుగా ఉంటున్నారు!”

"నా వైద్యం సరే నేను సరే... ఎవరికైనా ఆరోగ్య సమస్య వస్తే మూడురోజులేనండి నేను మందు ఇచ్చేది... అప్పటికి తగ్గకపోతే దణ్ణం పెట్టేసి మంచి డాక్టరు దగ్గరకు వెళ్ళండి బాబూ అని పంపించేస్తాను... మిడిమిడి జ్ఞానంతో రోగులమీద ప్రయోగాలు చేయటం నాకిష్టంలేదు!" ఆయన గోడవారగా చాపేసుకు కూర్చున్నాడు.

"అసలు ఊరు ఏది?" చక్రవర్తి అడిగాడు.

"మా నాన్న తాడేపల్లిలో రైతు... అన్నీ పోగొట్టుకుని విజయవాడ చేరాడు... ఆయన చేసిన వ్యవసాయమే నేనూ చేసి వృద్ధిలోకి రావాలనేది నా తపన... పదేళ్ళ క్రితం ఓ స్నేహితుడి ప్రోద్బలంతో సాయిరాంపురంలో కాలుపెట్టాను... కానీ గ్రామాభివృద్ధిని నిస్వార్థంగా చేద్దామనుకున్నా కొందరు కీచకులు మన నెత్తిన కాలుపెట్టి అణగదొక్కేస్తుంటారు... ఎంత సామరస్యంగా నలుగురితో వుంటున్నా ఆ రాక్షసులచేతిలో ఇబ్బందులు పడక తప్పటంలేదు!"

ఆయన భోజనం చేసే బయల్దేరాననటంతో వాళ్ళిద్దరూ భోజనానికి ఉపక్రమించారు.

ఈ ఊరి ఎలిమెంటరీ స్కూలును గురించి, తన తాతగారున్న ఇంటిని గురించి కొంతవరకు ఈయన ద్వారా తెలుసుకోవచ్చనిపించింది పొద్దున లేచినప్పటినుంచీ నాలుగు చోట్లకు తిరుగుతూ నలుగురినీ కలుస్తుంటాడు కాబట్టి.

"ఈ ఊళ్ళో ఎలిమెంటరీ స్కూలు ఎక్కడున్నది?" చక్రవర్తి అడిగాడు చివరగా మజ్జిగ పోసుకుంటూ.

ఆంజనేయులు ఎగాదిగా చక్రవర్తి వంక చూచాడు.

"ఎలిమెంటరీ స్కూలా?" అన్నాడు నుదురుముడివేసి. "ఈ ఊళ్ళో అదెక్కడున్నదబ్బా... ఇక్కడున్నవి రెండే రెండు స్కూళ్ళు... ఒకటి ప్రభుత్వ పాఠశాల... రెండోది మా సర్పంచి బావమరిది ప్రైవేటు స్కూలు!" అంటూనే, "ఒక్కక్షణం, ఒక్కక్షణం... ఇప్పుడున్న ప్రభుత్వ పాఠశాల దాన్ని పడగొట్టే కట్టారన్నట్లుగా ఈ

ఊరొచ్చిన కొత్తల్లో ఎవరో అంటే విన్నాను... ఇది కడుతున్న సమయంలో తాత్కాలికంగా దాన్ని వెంకటప్పయ్యగారి పాత పెంకుటింట్లో పిల్లల్ని వానకు తడిపేస్తూ, ఎండకు ఎండపెడుతూ నడిపించారట! అప్పటికి మా సర్పంచిగారి బావమరిది ఇంకా రంగంలోకి దిగలేదుట!" అన్నాడు.

"ఆయనకెంతమంది బావమరుదులేం?" అన్నాడు నవ్వుతూ చక్రవర్తి.

"అబ్బే... బావమరిదంటే నిజం బావమరిది కాదు... మామగారికి ఒక్కతే కూతురు... ఆ పవర్‌ఫుల్ బావమరిది ఆయనగారు పర్మినెంట్‌గా వుంచుకున్న మాణిక్యం తమ్ముడు... ఎప్పటికయినా సర్పంచిగా ఆయన చెప్పుల్లో కాలుపెట్టాలని ఉబలాటపడుతున్న మనిషి!" అన్నాడు ఆంజనేయులు నవ్వుతూ.

రాజకీయాలల్లో ఆయనగారి ప్రత్యర్థిలా వున్నాడు ఇతడు. లేకపోతే అంత ఎగతాళిగా మాట్లాడడు!

"అవునూ... మీకు దేనికవసరమొచ్చింది ఆ ఎలిమెంటరీ స్కూలు?" అడిగాడు నుదురు ముడివేసి ఆయనే.

చక్రవర్తి తడబాటును నిగ్రహించుకుంటూ, "ఈ ఊరుకి కొత్తగా వచ్చాను... చూస్తే రెండూ హైస్కూళ్ళే కనబడుతున్నాయి... వేరే ఎలిమెంటరీ స్కూలంటూ ఉన్నదో లేదో తెలుసుకుందామని!"

ఆయన నవ్వాడు. "మీ హెడ్మాస్టరు పూర్ణచంద్రరావుగారిని అడిగితే ఆయన చెప్పగలుగుతారు... కరణీకాలు ఉండంగా వాళ్ళ నాయన ఈ ఊరుకి కరణమేలేండి! ఆయన పుట్టి పెరిగిందంతా ఇక్కడే!" అన్నాడు లేచి వెళ్ళబోతూ. "ఈ ఊరుకు కొత్తయిన మీకు ఎలాంటి సాయం కావాలన్నా నిర్మొహమాటంగా నా దగ్గరకు వచ్చేయండి... మరి ఇక నేను శెలవు తీసుకుంటాను!" అన్నాడు.

"మీరు సాయంత్రం ఖాళీగా వుంటే నన్ను ఊరంతా తిప్పి చూపగూడదూ... రేపే అనేం లేదు, మీకు వీలున్నప్పుడే!" చక్రవర్తి ఆశగా అడిగాడు అలాంటి పనికి

ఆయనే సరైన మనిషి అన్నట్లుగా.

"అంతకు మించిన ఆనందమేమున్నది... రేపు సాయంత్రం మీ స్కూలు అయిపోయే సమయానికి మీ ముందు వాలతాను– సరా!"

ఆయన వెళ్ళిపోయాడు.

మరునాడు అన్నట్లుగానే స్కూలు బెల్లు మ్రోగుతుండగానే ఆంజనేయులు వచ్చి చక్రవర్తి ముందు నిలబడ్డాడు.

"ఈరోజు ఊరు చుట్టూ వున్న పచ్చటి పొలాలు చూస్తూ ఆనందిస్తాను... నేను కాంక్రీట్ జంగిల్‌లాంటి హైదరాబాద్‌నుంచి వచ్చానని తెలుసుగదా!" చిరునవ్వుతో అన్నాడు చక్రవర్తి.

"సంతోషం... పదండి... నేనీ ఊరు వచ్చిన కొత్తల్లో ఊరి మొదట్లోనే వ్యవసాయక్షేత్రాలు కనబడుతుండేవి... ఇప్పుడు వాటి స్థానే కర్మాగారాలు రావటంతో పొలాలు సిగ్గు పడుతున్నట్లుగా కిలోమీటర్ల దూరం పారిపోయినయి ఊరికి అన్ని వైపులా!... ఇప్పుడు ఇక్కడ ఏ ఇంటినీ పైరుగాలి తాకదు... కాలుష్యపు వాసనలు తప్ప!" పెద్దగా నవ్వాడు ఆంజనేయులు..

ఇద్దరూ వీధుల్లో నడుస్తున్నారు. తారు రోడ్డుకు అటూ ఇటూ డాబాలు. రెండు మూడంతస్తుల భవనాలు. బారు లైట్లతో వీధి దీపాలు.

ఏ ఇంటిముందయినా నీడనిచ్చే చెట్టు కనబడుతుందేమోనని చూచాడు. రెండు మూడు వీధులు తిరిగినా ఏ ఇంటిముందూ చెట్టు కనబడలేదు. అక్కడక్కడా కొన్ని ఇళ్లలో మాత్రం తలెత్తి చూస్తే కనబడేలా కొబ్బరి చెట్ల ఆకులు కనబడినయి.

"ఈ ఊళ్లో రామాలయం ఎక్కడున్నదండీ?" అడిగాడు ఆసక్తిగా తమ ఇంటి సంగతి తెలుసుకోవాలన్నట్లుగా.

తన తాత పనిచేసిన ఎలిమెంటరీ స్కూలు చరిత్రలో కలిసిపోయింది ఇక దాన్ని గురించి తెలుసుకోవాల్సింది ఏమీ లేదు. మిగిలింది తమ ఇల్లే... అది ఆ ఊళ్లో వున్న

రామాలయం ఎదురు ఇల్లని తాతయ్య చెప్పేవాడు.

ఆయన పోబోతున్నవాడల్లా ఆగి, “ఏ రామాలయం?” అన్నాడు.

విచిత్రంగా చూచాడు చక్రవర్తి ఆయనవంక.

“మా ఊళ్లో మూడు రామాలయాలు ఉన్నయ్యండి!”

“పూర్వంనుండీ ఉన్న రామాలయం ఎక్కడున్నదో చెప్పండి!”

“కోదండరామస్వామి వారి దేవాలయమా... ఇక్కడకు రెండు వీధుల అవతల కుడివైపు సందులో ఉన్నది... నా కిష్టమైన గుడి అదేనండి బాబు... దాన్ని డెభై సంవత్సరాల క్రితం ఊరందరూ కలిసి కట్టుకున్నారుట... తరువాత మరో రెండు కులాలవారీగా కట్టుకున్నవి... ఊరిలో చాలామందికి నాలాగానే ఆ పాతదంటేనే ఎక్కువ ఇష్టం... కొత్తగా కట్టిన వాటికి మాత్రం ఎక్కువగా ఆ కులంవాళ్ళే వెళు తుంటారు... అందులో ఒకదానికి మా కీచకుడు ధర్మాధికారి... ప్రతి సంవత్సరం రంగులు వేయించి తానేదో పెద్ద రామభక్తుడన్నట్లుగా అందరికీ చెవులో పూలు పెడుతుంటాడు కానీ, పాతదేవాలయంలోనే శ్రీరామనవమి శాస్త్రోక్తంగా జరిగేది! అక్కడ పూజారిగారికే నాలుగు మంత్రపు ముక్కలు వచ్చు... రోజూ మంగళగిరినుంచి ఉదయాన్నే తొక్కుడుబండి మీద వచ్చి చేయితిప్పి వెళుతుంటాడు... రోజూ రాలేనండీ అంటాడుగాని నా బలవంతానే వస్తున్నాడు!”

ఇతడిని కదిలిస్తే మాటలపోగే అనిపించింది.

“ప్రస్తుతం పాలిస్తున్న మా ఊరి రాజు బావమరిదే అగ్ని,వాయువు కూడా... ఏంచేస్తాం బావగారు ప్రియురాలి విధేయుడు... నేను ఎన్నిసార్లు ఈ రాజ్యాన్ని ప్రక్షాళన చేయాలని ప్రయత్నించినా ఫలితం దక్కటంలేదు, మా నాన్న నాకెంతో శక్తిమంతుడి పేరు పెట్టినా! అవునూ మీరు గమనించారో లేదో... ఈ ఊరొచ్చిన అందరితోటీ పరిచయమయింది కానీ మీ హిందీ టీచరేమిటండి... పెద్ద సీమటపాకాయలా వున్నది... దగ్గరకే రానీయదు!” అన్నాడు ఓ అడుగు వెనక్కు

వేసి.

"అలాగా... నేనూ మొన్ననే కదా వచ్చింది... ఇంకా గమనించలేదు!" అన్నాడు చక్రవర్తి గుంభనగా.

"ఆమె తీరు చూస్తుంటే నాకొకటి అనిపిస్తున్నది... ఈ ఊరి కీచకులను చీల్చి చండాడగలిగిన శక్తి ఆమెకే ఉన్నదని!"

అతడి మాటలకు ఉలిక్కిపడ్డట్లుగా తలెత్తాడు చక్రవర్తి.

* * *

ప్రతి వారం లాగానే చిదంబరం శనివారం సాయంత్రమే సత్తెనపల్లి దగ్గరవున్న స్వగ్రామానికి వెళ్ళాడు. తిరిగి సోమవారం ఉదయం స్కూలు టైంకు వస్తాడు.

మార్కెట్‌కు వెళ్ళి కూరలు కొంటుంటే భ్రమర కనబడింది.

"నమస్కారమండీ లెక్కల మాష్టారూ!" అన్నది నవ్వుతూ వెనుకనుంచి.

ఉలిక్కిపడ్డట్లుగా వెనక్కు తిరిగాడు చక్రవర్తి.

"వంటలో నిష్ణాతులేనా?"

"ప్రస్తుతానికి చిదంబరంగారి దగ్గర అప్రెంటిస్‌గా చేస్తున్నాను!"

"ఆయన ఆదివారమొస్తే ఉండరు కదా... అయితే ఈరోజున స్వయంగానే చేయి కాల్చుకుంటారన్నమాట!" అన్నది నవ్వుతూ.

– అంటే ఆమె సంగతి ఎవరికి తెలియకపోయినా, అందరి సంగతీ ఆమెకు తెలుస్తునే ఉన్నదన్నమాట!

"తప్పదుకదా మరి!"

"మా ఆడవాళ్ళకు వున్న వెసలుబాటు అదే... ఎన్ని ఇబ్బందులున్నా తిండికి లోటుండదు!... అవునూ... మీకు బెండకాయ కూర ఇష్టమేనా?"

"నాకు అయిష్టాలంటూ ఏమీలేవు... మా అమ్మ వేపాకుతోనైనా రుచికరమైన పచ్చడి చేయగల సమర్థురాలు... అది నా అదృష్టం!" అన్నాడు నవ్వుతూ చక్రవర్తి.

"ఓ మై గాడ్! వారి దగ్గర నేను మీరు చిదంబరంగారి దగ్గర చేసినట్లుగా కొన్నాళ్ళు అప్రంటిస్ చేయాలన్నమాట!"

మాట్లాడుకుంటూ కూరలు కొంటుంటే సమయం తెలియలేదు. చివరకు, కొతిమేరు, కరివేపాకు కొంటూ "ఇవేవీ నిషిద్ధం కాదుగదా మీకు?" అన్నది తలెత్తి.

"చెప్పాను కదా... నాకు ఏదీ పనికిరానిదంటూ లేదని!" అన్నాడు ఆఖరుగా టొమాటాలు ఓ కిలో తీసుకుంటూ. "ఈ రెండు మూడురోజుల అనుభవంతోనే నాకు తెలిసిందేమిటంటే వీటితో కూరచేయవచ్చు, పప్పు చేయవచ్చు. పచ్చడి చేయవచ్చు... పులుసు, చారు పెట్టుకున్నా వాటిల్లో ముక్కలు తరిగి పడేయనూవచ్చు!"

"బాగుంది... చిదంబరంగారి శిష్యరికంలో మీరు మీ భార్యను పువ్వుల్లో పెట్టి పూజించగలిగే శక్తిమంతులవుతారని అర్థమవుతున్నది... ఒక పనిచేయండి... ఏం కష్టపడతారుగాని, ఈపూట మా ఇంటికి భోజనానికి వచ్చేయండి... వంటలో నా దగ్గరా ఏవైనా మెళుకువలు తెలుసుకుంటే ఆ వచ్చే భార్య మరింత సుఖపడుతుంది!"

కలవరపడ్డాడు చక్రవర్తి.

"భోజనానికా? మరోసారి వస్తానులేండి!"

"ఇవాళకేమయింది... విదియ గురువారం... రోజంతా వర్జ్యంలేదు... రాహుకాలం ఎప్పుడో మధ్యాహ్నం మూడుగంటలప్పుడుగాని రాదట... పన్నెండుగంటల వరకూ మంచిసమయమే అని పంచాంగం ఘోషిస్తోంది!" అన్నది పకపకా నవ్వుతూ.

ఆమె అంత చనువుగా మాట్లాడుతుంటే విచిత్రంగా తోచింది చక్రవర్తికి... ఎన్నాళ్ళ పరిచయమని!

ఇద్దరూ కూరల కొట్లముందునుండి మెయిన్ రోడ్డుమీదకు వచ్చారు.

"ఒంటరిదాని కొంపకు వస్తే నలుగురూ నీలాపనిందలు వేస్తారని భయపడుతున్నారా ఏమిటి ఖర్మ... ఏ వెధవకూ మనం ఎట్టి పరిస్థితులలోనూ భయపడాల్సిన అవసరం లేదండీ మాష్టారు... పిచ్చిపిచ్చి ఆలోచనలతో మనస్సు పాడు చేసుకోకుండా పదకొండు గంటలకల్లా మా ఇంటికి రాండి... మీ ఇంటికి వెళ్ళే దారిలోనే వున్నది మా ఇల్లు.... వెళుతూ చూపిస్తాను... భోజనానికి ఎవరైనా ఎప్పుడైనా ఆహ్వానిస్తే కాదూ అనగూడదు... అలా అంటే ఆరోజుకు అభోజనంగానే ఉండిపోతారని మా అమ్మ ఎప్పుడూ చెబుతుంటుంది... ప్రస్తుతం కొడుకు దగ్గర ఏలూరులో మనవడికి సేవచేస్తూ ఉంటున్నదిలేండి!" అసలే పెద్దకళ్ళను మరింత పెద్దవి చేసి చక్రవర్తినే చూస్తోంది తెల్లని పలువరస కనబడేలా నవ్వుతూ భ్రమర.

"ఈరోజంతా ఈ గ్రామాన్ని అన్ని మూలలా చూడాలనుకుంటున్నాను!" తప్పించుకునేందుకు దారులు వెతుక్కుంటూ నసుగుతున్నట్లుగా అన్నాడు. "కొత్తవూరు గదా... తెలుసుకోవటం మంచిదని!"

"ఫరవాలేదు... వచ్చే ఆదివారం ఓ టేపుకూడా తీసుకు బయల్దేరితే కొలతలూ వేసుకోవచ్చు... చిదంబరంగారు ఇప్పుడప్పుడే పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యంలో లేరులేండి... మీరూ హైదరాబాద్ వెళ్ళకపోతే ప్రతి ఆదివారం మీదే!"

తడబడ్డాడు చక్రవర్తి.

"ఒక్కొక్కర్ని చూడగానే సదభిప్రాయం ఏర్పడుతుంది... మన సోషల్‌స్టడీస్ మాస్టారు లాంటి వారిని చూస్తే మొట్టబుద్ధి వేస్తుంది... నాకు తెలిసినంతవరకూ పెళ్ళాం, ముచ్చటగా ముగ్గురు పిల్లలూ ఉన్న ఆయనకు అదేం రోగమో ఆడమనిషి కనబడితే చాలు చొంగకార్చటం మొదలెట్టేస్తాడు... గురువులకు ఉండవలసిన లక్షణాలు కావు అవిమరి!"

బిత్తరపోయాడు చక్రవర్తి అంత నిర్మొహమాటంగా చెబుతున్న ఆమె మాటలకు. ఆయనగాని ఆ మాటలు వింటే పెద్ద గొడవే అయిపోతుంది.

భ్రమర ఆపలేదు. "ఒకసారి స్కూలుకొచ్చిన ఓ పిల్లవాడి తల్లిని అలా చూస్తుంటే,

నేనే చిన్నగా పక్కగా వెళ్ళి, 'జేబురుమాల ఉందా, లేకపోతే ఇచ్చేదా?' అన్నాను... అంతే పరుగో పరుగు!" చేతులూపుతూ పెద్దగా నవ్వుతోంది.

ఆమె సామాన్యురాలు కాదు. ఆమెతో జాగ్రత్తగా ఉండటం అన్నివిధాలా శ్రేయస్కరం. చిదంబరం చెప్పిన మాట వాస్తవమే!

"మా ఇంటికి భోజనానికి రావటానికి అభ్యంతరం ఏమీ లేదు కదా!" మరోసారి రెట్టించింది భ్రమర.

"మరోసారి చూద్దాంలేండి!" నసుగుతున్నట్లుగా అన్నాడు చక్రవర్తి.

"అదేం కుదరదు... మీరెంత లెక్కల మాస్టారయినా నా లెక్క ఎప్పుడూ తప్పదు. ఎవరో మిమ్మల్ని నా గురించి భయపెట్టారు. తలెత్తి ముఖంలో ముఖంపెట్టి చూస్తూ ఓ ఆడమనిషితో మాట్లాడలేని వారి వలన నాకెలాంటి భయమూ ఉండదు... మీరు ఈ పూట వచ్చేయండి... నేను మొరటు మనుష్యులనే ఓ పట్టుపడతానుగాని, మీలాంటి వారిని కాదు!" అన్నది కళ్ళు తిప్పుతూ.

"తప్పదా?"

"ఎందుకు తప్పాలి... పోనీయ్ మీరు రాలేనంటే చెప్పండి... పన్నెండింటికల్లా వంటచేసి మనిద్దరికీ క్యారియర్‌లో పెట్టుకుని మీ ఇంటికి నేనే వస్తాను... ఇద్దరం కలిసి కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేద్దాం!"

కంగారు పడ్డాడు చక్రవర్తి. "వద్దులేండి, వద్దులేండి... నేనే వస్తాను!"

ఆమె నవ్వుతూ, "నడవండి స్వామీ! చేతిలో కూరలు బరువుగా వున్నయి... మన తెలుగువాళ్ళసంగతి తెలిసిందే గదా... భార్యాభర్తలు బజారు కెళ్ళినా మగమనిషి చేతులూపుకుంటూ ముందు నడుస్తుంటే. కొన్న సామాన్లన్నీ పట్టుకుని, తలవంచుకుని ఆడది ఆయనగారి వెనకాలే నడవటం సంప్రదాయంగా వస్తున్నది... ఇక మనమంటారా సహ ఉద్యోగులమే కనుక మీరు నా బరువును మోయకపోయినా బాధపడను!"

చక్రవర్తి ముఖం ఎర్రబడింది ఆమె మాటలకు.

కూరల సంచీని ఇంట్లో పడేసి, వంట చేసే అవసరం లేదు గనుక మరోసారి కాఫీ కలుపుకు త్రాగి తమ పూర్వీకుల ఇల్లు చూడటానికి బయల్దేరాడు.

ఆంజనేయులు చెప్పినట్లుగానే రెండు వీధుల దాటి మలుపు తిరిగితే మధ్యగా వున్నది రామాలయం.

చక్రవర్తి లోపలకు వెళ్ళాడు. అంతగా పోషణ ఉన్నట్లులేదు. తమ హైస్కూల్ లాగానే ఉప్పుచవుడు రాలుస్తున్న గోడలు. పెద్ద ఆవరణ. మధ్యలో మందిరం. గాలిగోపురం లాంటిదేమీ లేకపోయినా ముందు చిన్న ఆర్చి. ధ్యజస్థంభం. దాని క్రిందగా ఆంజనేయస్వామివారిదిలా వున్నది చిన్న గూడు. ఒక పక్కగా కప్పులేని వేదిక. బహుశః దాన్ని ఎప్పుడయినా పురాణ కాలక్షేపానికి ఉపయోగిస్తుండవచ్చు. దాని చుట్టూ పెరిగిన పిచ్చి మొక్కలు చూస్తుంటే ఆ కార్యక్రమాలూ అంతగా జరగటంలేదనే అర్థమవుతోంది.

ఆ ఆర్చిక్రింద నిల్చొని లోపలకు చూస్తున్న అతడు చటుక్కున ముఖాన్ని ఎదురుగ్గా వున్న ఇంటివైపుకు తిప్పాడు. ఇంకా అది పెంకుటిల్లే. దాన్ని చూస్తుంటే మనస్సంతా ఉద్విగ్నతకు లోనయింది. అది ఏ మార్పులేకుండా తాతయ్య చెప్పినట్లే కనబడుతున్నది.

ఆయన నివసించి ఆనందాన్ని ఆస్వాదించిన ఇల్లు అది. తన తల్లి, తన తండ్రి చేయిపట్టుకుని కాళ్ళకు పారాణితో మంగళ వాయిద్యాల నడుమ మొట్టమొదటిసారిగా కాలుపెట్టిన ఇల్లు అది. తను పుట్టిన ఇల్లు అది!

ఆనందంతోనూ, ఆవేశంతోనూ ఛాతి ఉప్పొంగగా పాదాలు ముందుకు అడుగులు వేస్తున్నాయి.

తలుపులకు రంగు వేసివున్నది. గోడవారగా వున్న బాదం చెట్టుకు కొమ్మలు పలచగా ఉన్నాయి. ఒకటి రెండు కాకిగూళ్ళు చెట్టుమీద కనబడినయి. వరండాముందు పందిరి వున్నదా? దానిమీదకు పాకిన సన్నజాజితీగ ఇంకా వున్నదా? లోపలకు

వెళితేగాని తెలియదు. మనస్సు వాటిని గురించి తెలుసుకోవాలని ఉవ్విళ్ళూరు తున్నది.

రోజూ తాత చీకటి పడిం తరువాత ఎదురుగా వున్న ఆ గుళ్ళోకి వెళ్ళి తత్వాలు పాడుతుంటే చాలామంది కూర్చొని తన్మయంగా వింటూ ఉండేవాళ్ళట ఎనిమిది గంటలవరకూ.

కాస్త ఎత్తుగా వున్న మెట్లెక్కి తలుపులు తెరిచివున్న ఆ ఆలయంలో కాలుపెట్టాడు. కోదండరాముడు కొలువైయున్న తీరు ఎంతో ఆనందాన్ని కలిగించింది. అప్పుడే పూజారిగారు హారతిస్తున్నారు.

కళకళలాడుతున్న ఆ విగ్రహాలనే చూస్తూ రెండు చేతులూ జోడించాడు. హారతిని అద్దుకుని ఆ పళ్ళెంలో పదకొండు రూపాయలు దక్షిణగా ఉంచాడు.

పూజారిగారు చిన్మయంగా చూచారు. "ఏ ఊరునుంచి వచ్చారు?" ఎప్పుడూ చూడని ఆ మనిషి ఆ ఊరికి కొత్తని ఇట్టే గ్రహించాడు.

"హైదరాబాదండి... ఇక్కడ ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయుడిగా మొన్ననే జేరాను!"

"చాలా సంతోషం... తరచూ వస్తుండండి!" అంటూ ప్రసాదంగా పటికబెల్లం పలుకులు చేతిలో పెడితే కళ్ళకద్దుకుని నోట్లో వేసుకున్నాడు చక్రవర్తి.

బయటకు వచ్చి ఆ వీధి అన్ని వైపులా చూచాడు. తన ఇల్లు, ఈ రామమందిరమే పాతవిగా వున్నయ్యేమోననిపించింది. ఆ వీధిలోనూ ఎక్కువగా డాబా ఇళ్ళే కనబడినయి. ఎప్పుడో వేసిన తారురోడ్డు పెచ్చులు లేచి గతుకులతో వున్నది.

ఎదురుగ్గా వున్న ఇంటి వంకే చూస్తూ ఓ కొద్దిసేపు నిల్చున్నాడు. ఆ ఇంటిని చూస్తుంటే తాతగారు కళ్ళెదుట నిలుచున్నట్లే అనిపిస్తోంది. లోపలకు వెళ్ళి చూడాలనిపిస్తున్నది. అంతగా ఆ ఇంటిని ప్రేమించిన ఆయన, తన తల్లిదండ్రులు అన్నయ్యలు, అక్కయ్య తిరిగిన ఆ ఇంట్లో తనూ తిరగాలనిపిస్తున్నది.

ఆ ఇంట్లో వాళ్ళకు ఏమని చెప్పాలి. ఇల్లు చూస్తానంటే నవ్వవచ్చు. తన తాతగారి

పేరు చెప్పి పరిచయం చేసుకుంటే బాగుంటుందనిపించింది. ఆ ఆలోచన రాగానే ఇక ఆలస్యం చేయలేదు. వడివడిగా రెండడుగులు ముందుకు వేశాడు. అప్పుడు గమనించాడు. వాకిటి తలుపుకు గొళ్ళెం పెట్టి చిన్న తాళం వ్రేలాడుతోంది. దానికి పైగా ఓ నిమ్మకాయ, నాలుగయిదు ఎండు మిరపకాయలూ కట్టి వున్నాయి.

విచిత్రంగా చూచాడు వాటివంక, తాళం వేసివున్న తలుపును చూస్తుంటే అతడికి ఎంతో నిరుత్సాహం కలిగింది.

గుడిమూసి, సైకిల్ తీసుకుని వెనగ్గా వచ్చిన పూజారి, ఆ ఇంటినే తదేకంగా చూస్తూ నిలుచున్న చక్రవర్తిని ఒకసారి వింతగా చూచి సైకిల్ ఎక్కేశాడు.

* * *

చేతి గడియారం వంక చూచుకుంటే పదకొండుగంటలయింది.

భ్రమర ఇంటికి వెళ్ళాలంటే భయంగావున్నది. ఎవరన్నా చూస్తే ఇబ్బందిగా వుంటుంది. నలుగురూ కథలల్లి అవాకులూ చెవాకులూ పేలవచ్చు. ఆమె కుటుంబంతో వుంటే వేరు. వంటరిగా వున్న ఓ ఆడమనిషి ఇంటికి భోజనానికి పిలిస్తే వెళ్ళానన్నా నమ్మేవాళ్ళు ఎంతమంది? ఆమె తన మాటతీరుతో ఈ ఊరు వచ్చిన కొద్ది కాలంలోనే శత్రువులనూ ఏర్పరుచుకున్నదనేది తెలిసిందే. చిదంబరం హెచ్చరికను మరిచిపోలేదు.

తామిద్దరూ తెల్లవారిన దగ్గరనుంచి ఒకళ్ళనొకళ్ళు చూసుకోవాల్సిన వాళ్ళు. తమ గురించి సాటి ఉద్యోగులు చెడుగా చెప్పుకుంటుంటే ఇద్దరికీ ఇబ్బందిగానే ఉంటుంది.

ద్వైదీభావం రకరకాల ఆలోచనలతో మనస్సును అటూయిటూ ఊపేస్తోంది.

ఎందుకో ఆమెను చూస్తున్నా, ఆమెతో మాట్లాడుతున్నా మనస్సు ఆహ్లాదంగా వుంటుంది. తెలియని ఆత్మీయత కలుగుతోంది. ఒక వైపు భయం. మరోవైపు ఆకర్షణ. ఆకర్షణ అనేది ఆమె రూపం వలననో, మాటల వలననో తెలియదు. అటు భయంకూడా చుట్టూ వున్న నలుగురివలనా లేక ముక్కుమీద గుద్దినట్లుగా మాట్లాడే ఆమె మాట

తీరువలసనా అనే విషయంలో కూడా నిశ్చితాభిప్రాయానికి రాలేకపోతున్నాడు. అందుకే వెళ్ళటం అంతగా ఇష్టం లేకపోయినా నిక్కచ్చిగా రానూ అని చెప్పలేకపోయాడు.

చక్రవర్తిని చూస్తూనే భ్రమర కళ్ళు కాంతివంతమవ్వగా, "రండి... రండి... రారేమోననే సంశయం మనస్సులో పీకుతున్నా రావటం నన్ను అర్థం చేసుకున్న మనిషే మీరు అని చెప్పక చెబుతోంది! ఎనీహౌ... థాంక్యూ!" అన్నది తడిచేతుల్ని చీరచెంగుకు తుడుచుకుంటూ ఎదురు వచ్చి.

ఏం మాట్లాడాలో అర్థంకానట్లుగా మౌనంగా ఉండిపోయాడు చక్రవర్తి. ఎదుటి మనుష్యుల భావాల్ని చదివేయటంలో ఆమె నేర్పరి అని తెలిసిందే!

"చివరి ఐటమ్ ములక్కాడలు వేసిన మజ్జిగపులుసును స్టౌమీద పెట్టాను... ఓ పావుగంట కబుర్లు చెప్పుకుంటూ కూర్చుంటే ఘుమఘుమ వాసన రాగానే మనం భోజనం చేయటం మొదలుపెట్టవచ్చు!"

"స్పెషల్స్ చేస్తున్నారా ఏమిటి?"

"భోజనానికి పిలిచి చింతకాయపచ్చడితో భోజనం పెట్టటం భావ్యం కాదుగదా ఎంత తెలిసినవారయినా... అవునూ! మిమ్మల్ని వచ్చిన రోజునుంచీ ఓ ప్రశ్న అడగాలనిపిస్తోంది, అడిగేయమంటారేమిటి?" అన్నది పకపకా నవ్వుతూ.

"నిస్సందేహంగా అడగవచ్చు!" తను వద్దంటే మాత్రం ఆగుతుందా అనుకుంటూ అన్నాడు.

మనిషి పిసరంత నలుపే అయినా చూడ ముచ్చటగా వుంటుంది. ఎప్పుడూ ముఖాన పెద్ద కుంకుమబొట్టు. నేటి డ్రస్సులమీద అంతగా మోజులేదేమో లైట్ కలర్ చీరలో హుందాగా, మరింత అందంగా కనిపిస్తున్నది. మెళ్ళో సన్నటి బంగారు గొలుసు. ఒత్తయిన తలకట్టు. పక్కపాపడితో తల దువ్వుకుని జడను ముందుకు వేసుకున్నది. చెవులకు రంగురంగు రాళ్ళ పాతకాలపు లోలాకులు. ముక్కుకు చిన్న తెల్లరాయి పుడక. దాని మెరుపు చూస్తుంటే వజ్రమేనేమో ననిపిస్తోంది. అది నిజమైన

వజ్రమే అయితే ఆమె డబ్బున్న మనిషే అయివుండాలి.

అప్పుడు ఈ పల్లెటూరులో వంటరిగా వుంటూ ఈ ఉద్యోగం చేయాల్సిన అవసరమేమున్నది. ఆమె ఎలా అంత తొందరగా అర్థం కాదో, ఆమెను గురించిన ఆలోచనలూ ఓ పట్టాన తెగవు.

"మీరెప్పుడయినా గుంటూరు మాజేటి గురవయ్య హైస్కూల్లో చదివారా?" ఆ ప్రశ్న అడిగి ఆసక్తిగా అతడి ముఖంలోకి చూడసాగింది కళ్ళార్పకుండా.

ఉలిక్కిపడ్డట్లుగా ఆమె వంక చూచాడు చక్రవర్తి. "మీరు చదివారా అక్కడ?"

"నేను చదివినప్పుడు కాదు... చిన్నప్పుడు మా వరండాలో నేను ఆడుకుండే రోజుల్లో, బడికి ఎందుకు వెళ్ళాల్సి వచ్చిందిరా బాబూ అన్నట్లుగా నీరసంగా ఓ అబ్బాయి మా ఇంటిముందునుంచే వెళుతుండేవాడు... మేం ఆ స్కూలు పక్కనే ఉండేవాళ్ళంలేండి... ఆ ముఖానికి ఇప్పటి మీ ముఖానికీ దగ్గర పోలికలున్నట్లనిపిస్తుంటే అడిగాను!"

ఆమె మాటలకు చక్రవర్తి ముఖం కందినట్లయింది.

అతడి ముఖకవళికలను గమనిస్తూనే ఆమె తడబడుతూ, "అది నా అనుమానమేనండోయ్... అలా ఒకటి రెండు సార్లు నాకు కనబడ్డారులేండి!" అన్నది త్వరత్వరగా. చిన్నగా నవ్వుతూ.

ఆ నవ్వు ఎంతో ఆత్మీయంగా అనిపించింది చక్రవర్తికి.

"మీ ఇల్లు స్కూలు పక్కనే అంటుంటిరి... మీ ఇంటిముందునుంచి చాలా మంది పిల్లలు వెళ్ళటం సహజం... ఉదయం బడికి వెళ్ళేటప్పుడు, సాయంత్రం ఇంటికి తెరిగి వెళ్ళేటప్పుడు చిన్న పిల్లల ముఖాలు విభిన్నంగానే వుంటయి!" ఆమె మాటలను తనూ సీరియస్‌గా తీసుకోవటం లేదన్నట్లుగా నవ్వాడు. "అయినా ఎప్పుడో చిన్నప్పటి సంగతి... అందునా ఇంకా మీరు స్కూలుకు వెళ్ళటం ప్రారంభించని వయసులో... ఆ ముఖాన్ని ఇంకా ఎలా గుర్తుపెట్టుకో గలిగారా అని!"

“ఆ అబ్బాయి మా ఇంటి పక్కింట్లో అద్దెకుండేవాడు కాబట్టి... బడి పక్కనే వున్నా, వాళ్ళమ్మ రోజూ తీసుకు వెళ్ళి స్కూల్లో దించి, మళ్ళా స్కూలు అయ్యేసమయానికి వెళ్లి ఇంటికి తీసుకు వస్తుండేది కాబట్టి... ఆ రెండు సార్లూ ఆ పిల్లవాడి పుస్తకాల సంచీని ఆమె మోసేది కాబట్టి! ఆపైన ఆ పిల్లవాడిది అంతా తండ్రిపోలికే అవ్వటంతో అప్పటి ఆయన్ని ఇప్పుడు మీలో చూస్తున్నాను కాబట్టి!” ఆమె ఊహించింది నిజమే అవుతున్నట్లనిపించగా కొంటెగా అన్నది.

భ్రమర చెప్పిందాంట్లో అబద్ధం లేదు. తను ఆ స్కూల్లో చదివాడు. స్కూలు పక్క వీధిలోనే తాముండేవాళ్ళు. అమ్మే తనను స్కూలుకు తీసుకువెళ్ళేది తీసుకు వచ్చేది. ఆ ఇంట తనే చిన్నపిల్లవాడు గనుక పెద్దవాళ్ళ గారాబంతో ప్రతిదానికీ పేచీ పెడుతుండేవాడు.

“ఫైన్... మనం పాత పరిచయస్తులమేనన్నమాట!”

“అయ్యో నా తెలివిమండ... ఇంటికి వచ్చిన అతిథిని నిల్చోబెట్టే మాట్లాడుతున్నాను!” అంటూ వడివడిగా గోడవారగా ఉన్న కుర్చీని తీసుకు వచ్చి అతడి పక్కగా వేసింది. “కూర్చోండి... మంచినీళ్లు ఇవ్వమంటారా?”

“వద్దండి... మీలెక్కన పాత పరిచయస్తుడినే కాబట్టి కొత్తగా మర్యాదలు చేయాల్సిన అవసరమేమీ లేదు!” ఇక ఆమెను గురించి అంతగా భయపడాల్సిన అవసరం లేదనుకున్నాడు. ఈ రోజున తనను ఆమె భోజనానికి పిలవటంలోని కారణం కూడా అదే అయివుండవచ్చు. “కానీ మీరు నాకు గుర్తుకు రావటంలేదు!” అన్నాడు నసుగుతున్నట్లుగా.

“నేనెలా గుర్తుంటాను... చిన్నప్పుడంతా అమ్మ కూచి... అమ్మ చేయి పట్టుకుని నడిచే మీకు ఆడపిల్లలే కాదు, అక్కడ మీతోపాటు చదివిన మగపిల్లలూ జ్ఞాపకం ఉండి ఉంటారని అనుకోను!”

ఆమె అన్న మాటకు మనస్సు మరోసారి కష్టమేసింది చక్రవర్తికి. తను నలుగురితో కలివిడిగా ఉండలేడనేగా ఆమె మాటల్లోని సారాంశం!

అతడి భావాల్ని పట్టించుకోనట్లుగానే, “ఒక్క నిముషం!” అంటూ పులుసు కాగిన వాసన రావటంతో వంటింట్లోకి వెళ్ళి ఒకసారి దాన్ని గరిటతో తిప్పి, కుండలోని చల్లని నీళ్ళు గ్లాసుతో తీసుకు వచ్చింది.

“నాకు గుర్తున్నంతవరకూ మీరు ఓ రెండు మూడేళ్ళకంటే ఎక్కువలేరు గుంటూరులో... లేదా మా వీధిలోనుండి మారిపోయి అయినా వుండవచ్చు!” అంటూ భ్రమరా మరో కుర్చీ లాక్కుని అతడికి కాస్త దూరంగా కూర్చున్నది.

“గుంటూరులో మేం నాలుగేళ్ళున్నాం... అయితే స్కూలు పక్క ఇంట్లోకి వచ్చిన రెండేళ్ళకే మా నాన్నకు నాగార్జునసాగర్ బదిలీ అవ్వటంతో అక్కడనుంచి వెళ్ళిపోయాం!”

“హైదరాబాద్‌నుంచల్లా పడి ఇంత దూరంలో ఉన్న ఈ ఊరెందుకు వచ్చారు... అక్కడెక్కడా దొరకలేదా బీయిడీ చదివిన మీకు ఇంతోటి బోడి ఉద్యోగం!”

“నేను ఈ ఊరు ఎంతో బాగుంటుందని వినే కావాలని వచ్చాను... పల్లెటూరి అందాలని ఆస్వాదించాలని!” అన్నాడు తన్మయంగా తాతయ్యను గుర్తుకు తెచ్చుకుంటూ. “మీరూ రావటంలో ప్రత్యేకత ఏమైనా ఉన్నదా?... లేదా వాళ్ళు వేస్తే తప్పక తిట్టుకుంటూ వచ్చారా? అయినా ఇది గుంటూరుకు దగ్గరేగా... శనాదివారాలల్లో చిదంబరంగారిలాగా మీరు మీ ఇంటికి వెళ్ళి ఉండవలసింది!” అన్నాడు.

“ఎప్పుడో చిన్నప్పుడు గుంటూరులో ఉన్న మాట వాస్తవమేగాని మా నాన్నగారి మరణంతో ఏలూరులో వున్న మా అమ్మమ్మగారి దగ్గరకు వెళ్ళిపోయాం... అంత దూరం ప్రతివారం వెళ్ళాలంటే చికాగ్గా వుంటుంది!”

“సారీ... మీ నాన్నగారు పోయారా?”

“అందరం పోవాల్సిన వాళ్ళమే... కాదంటే కాస్త ముందూ వెనుకా!” తలవంచుకు అన్నది. “మేం ఉంటున్న ఆ ఊరుకు ఇది దూరమే అయినా నేనే కావాలని ఈ ఊరుని ఎన్నుకున్నాను!... ఎందుకో తెలుసా?”

"నాలాగానే పల్లె అంటే ప్రేమతో అయివుండవచ్చు!"

"కాదు!"

"మరి?"

"ఈ ఊరిని కాల్చి బూడిదచేయాలనేది నా కోరిక... అందుకే నాకిచ్చిన ఆప్షన్లలో ఈ ఊరి పేరు కనబడగానే మరే ఆలోచనలేకుండా ఎన్నుకున్నాను!" అన్నది పెద్దగా నవ్వుతూ,

ఉలిక్కిపడ్డట్లుగా ఆమె వంక చూచాడు. కొద్దిక్షణాలపాటు ఏం మాట్లాడాలో తెలియనట్లుగా మౌనంగా ఉండిపోయాడు.

ఆమె చటుక్కున లేచి నిలబడింది. "కాళ్ళు కడుక్కోండి... భోజనం చేద్దాం!"

"మీకీ ఊరంటే ఎందుకంత ద్వేషం?" అన్నాడు మనస్సు కలత చెందగా ఆమె మాటలకు. తాతయ్య దీన్ని భూలోక స్వర్గమని ఎప్పుడూ మెచ్చుకుంటూ ఉండేవాడు. అటువంటి ఈ ఊరును కూడా ద్వేషించే మనుష్యులు ఉంటారా?

"మరోసారి ఆ ప్రశ్నను నన్ను అడగవద్దు... మూడో కన్ను తెరిచానంటే ఈ ఊరుతోపాటు మీరూ కాలి బూడిదయిపోతారు!" ఆమె ఒక్క అంగలో గడపదాటి లోపలకు వెళ్ళిపోయింది.

భోజనాలయ్యేంతవరకూ ఇద్దరి నడుమా మౌనమే రాజ్యం చేసింది.

గంట తరువాత ఆ ఇంటినుంచి బయటకు వస్తుంటే, వెనగ్గా వస్తున్న ఆమె, "నాకు కోపమొస్తే నిగ్రహించుకోలేను... అప్పుడు ఏం మాట్లాడతానో నాకే తెలియదు... సారీ!" అన్నది తలవంచుకుని చిన్నగా.

చక్రవర్తి మాట్లాడలేదుగాని తలతిప్పి ఆమెను ఒకసారి చూచి గడప ఇవతల కాలు పెట్టాడు.

* * *

ఊరంతగా మారిపోయినప్పుడు తన తాతగారి ఇల్లూ మారిపోయి ఉంటుందనుకున్నాడు. కానీ బయటనుంచి చూచినప్పుడు ఎలాంటి మార్పూ ఉన్నట్లుగా తోచలేదు.

ఈ ఊరు వచ్చి పదిరోజులు దాటినా ఇంతవరకూ తన తాతగారి పేరునూ, ఆయన నివసించిన ఈ ఇంటిని గురించి ఎవరికీ చెప్పలేదు. ఆ ఇంటి మీద ఆయన ముద్ర, వయస్సు మళ్ళిన వాళ్ళకైనా ఆయన పేరు గుర్తుండి వుంటే అప్పుడు చెప్పవచ్చు అనేది అతడి భావన. నలుగురికీ చెప్పిన తరువాత ఆ ఇంట్లోవాళ్ళు తనను లోపలకు రానీయకపోతే చాలా అవమానంగా వుంటుంది. ముందు ఇల్లు చూడాలి.

శనివారం సాయంత్రం మామూలుగా చిదంబరం ఊరికి వెళ్ళాడు.

ఆదివారం ఉదయాన తొమ్మిది గంటలప్పుడు గుడికి వెళుతూ చూచాడు తన తాతగారి ఇంటికి తాళం వేసి లేదు. మనస్సుకు హాయి కలిగించింది.

పూజారిగారు చక్రవర్తిని చూస్తూనే గుర్తుపట్టి, "బాగున్నారా?" అని అడిగాడు.

"బాగున్నానండి!" అన్నాడు నమస్కరిస్తూ.

"నిన్న సాయంత్రం రావాల్సింది... శనివారం కదా, ఓ భక్తుడు వెన్నతో ఆంజనేయస్వామికి అలంకారం చేయించాడు!"

నవ్వేసి ఊరుకున్నాడు చక్రవర్తి.

కాస్తంత త్వరగా వెళ్ళాలన్నట్లుగా దైవదర్శనం చేసుకుని, ఆయనతో మాటలు పెట్టుకోకుండా బయటకు వచ్చేశాడు.

వెళ్ళి తలుపులు మూసివున్న తన తాతగారి ఇంటి వాకిటిముందు వేసిన నాపరాయిమీద కాలుపెట్టి వ్రేలాడుతున్న గొళ్ళెంతో తలుపుమీద శబ్దం చేశాడు చక్రవర్తి. తలుపు తెరిచిన వాళ్ళతో తను ముందుగా ఏం మాట్లాడాలి?

తలుపు తీస్తున్న శబ్దం వినబడలేదు. లోపలనుంచి మనిషి వస్తున్నట్లుగా అడుగుల

సవ్వడీ వినబడలేదు. ఆలస్యానికి అసహనంగా మరోసారి తలుపు మీద కొట్టాడు. రెండు నిముషాల తరువాత కీచుమంటున్న శబ్దంతో, తమ పూర్వీకుల ఇంటి తలుపు తనకు స్వాగతం చెబుతున్నట్లుగా తెరుచుకోసాగింది.

ఓ యాభైయేళ్ళ మనిషి తలుపు సగం తెరిచి ఎవరా అన్నట్లుగా మెడ బయటకు పెట్టాడు.

"నమస్కారమండీ... నేను లోపలకు రావచ్చా?" అన్నాడు కళ్ళు మెరుస్తుండగా చక్రవర్తి.

"అయ్యో! అదేమిటి... రండి రండి!" ఆయన కాస్త పక్కకు జరుగుతూ తలుపు పూర్తిగా తెరిచాడు.

అప్పుడు గమనించాడు వరండాలో ఓ పాతికేళ్ళ పడుచు నిలబడి ఎవరా వచ్చిందన్నట్లుగా ఆసక్తిగా చూస్తోంది.

ఇల్లు పాతదే అయినా ఇంట్లోని ఆ అమ్మాయి ధగధగా మెరిసిపోతోంది ఎర్ర చీరలో. అప్పుడే స్నానం చేసిందల్లేవున్నది ఒత్తయిన జుట్టును దువ్వుకుంటున్నది.

"మీరెక్కడనుంచి వస్తున్నారు?" ఆ ముసలాయన వెనగ్గా వాకిటి తలుపులు మూసి లోపలకు వస్తూ అడిగాడు.

అద్భుతం... వాకిట్లో వున్న పందిరిని ఇంకా సన్నజాజి పూల తీగ పచ్చగా ఆవరించుకునే వున్నది. ఇంట్లో నివాసముంటున్నవాళ్ళు చెట్లను బాగానే పోషిస్తున్నారన్నమాట. కాస్త మెడవంచి పక్కగా చూచాడు. అక్కడ బావి వున్నది. దాని చుట్టూ సీమెంటు పళ్ళెం వున్నది. దానికి కుడివైపుగా పెద్ద మల్లె పొద వున్నది.

తన తాత ఇంటిని అమ్మినా మంచివాళ్ళ చేతుల్లోనే పెట్టాడన్నమాట!

"ఈ ఊరి స్కూల్లో కొత్తగా జేరిన టీచర్నండి!"

"బాగుందండీ... చాలా సంతోషం... పాపా! చల్లటి మంచినీళ్ళు తీసుకురా!

చిట్టిదాని స్నానం అయిందటనా?" లోపలకు తొంగి చూస్తూ అన్నాడు ఆయన.

వాళ్ళు ఆయన మనవరాళ్ళులాగా ఉన్నారు.

"ఎన్నాళ్ళయింది మా ఊరి వాసులయి మీరు?"

"మొన్ననే జేరాను... ఒక్కసారి ఈ ఇంటిని చూచి వెళ్దామని వచ్చాను!"

ఆయన ఆ మాటకు నవ్వాడు. "ఆనందం!"

ఎఱ్ఱచీర కట్టుకున్న అమ్మాయి మంచినీళ్ళ గ్లాసుతో వచ్చి చిరునవ్వుతో అతడికి అందించింది. కనబడీ కనబడకుండా వున్న తెల్లని పలువరుస ఆమె ముఖానికి మరింత అందాన్ని చేకూరుస్తోంది.

"నేను రామబ్రహ్మంగారి మనవడినండి... ఒకప్పటి ఈ ఇంటి స్వంత దారుడు మా తాతయ్యే... ఈ ఊరు వచ్చాను గదా, ఒక్కసారి అప్పుడు ఆయన ఉన్న ఇల్లు చూద్దామనిపించింది... అంతేకాదు ఈ ఇంట్లోనే నేను పుట్టింది!"

"ఇది విజయవాడలో ఉన్న ప్రకాశరావుగారి ఇల్లుగదండి... అంటే ఆయన మీ తాతగారి దగ్గర కొన్నారన్నమాట... చాలా సంతోషం... ఒకప్పటి ఇంటి యజమాని వారసుడు ఈ ఇంటిమీద ఇష్టత చూపటంకు మించిన ఆనందమేమున్నది.... రండి... రండి... మీరు మాకు ముఖ్యమయిన అతిథులన్నమాట!... ఇప్పుడే కాదు ఎప్పుడయినా మీరు మా ఇంటికి ఆహ్వానితులే!" అన్నాడు ఆయన చిరునవ్వుతో.

ఇద్దరూ లోపలకు నడిచారు. నైరుతీ మూలది తాతయ్య పడుకునే గదిట. లోపలకు తొంగి చూచాడు. అందులో పెద్ద మంచం... దాని పరుపుమీద తెల్లటి దుప్పటి... చాలా శుభ్రంగా వున్నది. తృప్తిగా దానివంక చూస్తూ తన అమ్మా నాన్నల గదివంక చూచాడు. అందులోనూ ఓ పట్టెమంచంమీద ముడతలు లేని తెల్లటి దుప్పటి పరిచి వున్నది. కిటికీ వైపు అగరువత్తులు వెలిగించి పెడతారల్లేవున్నది– గోడమీద పొడుగ్గా నల్లటి చారలు...

మధ్యలో హాలు. దాని వెనగ్గా పెద్ద వంటిల్లు.

"మీరు టీ తీసుకుంటారా... కాఫీ తీసుకుంటారా?" ఆయనే అడిగాడు.

"ఏదీ వద్దండి... నా టిఫిను, కాఫీలు పొద్దున్నే అయిపోయినయి!" అసలు లోపలకు రానిచ్చి ఇంటిని చూడనిస్తారో లేదో అనే సంశయంతో కాలుపెట్టిన చక్రవర్తి ఆయన మర్యాదలకు ఉప్పొంగిపోయాడు. ఈ ఇల్లు తాతగారి చేతినుండి మారి ఇన్ని సంవత్సరాలయినా ఎలాంటి మార్పులు లేకుండా ఆయనే గుర్తుకు వచ్చేలా వున్నదంటే దీన్ని గురించి అందరికీ ఎంతో గొప్పగా చెప్పుకోవచ్చు.

వంటింట్లో ఈశాన్య దిక్కున వున్న దేవుడి మందిరం వైపుకు చూచాడు. అంత శుభ్రంగా వున్న ఆ ఇంట్లో ఆ మందిరంలో ఒక్క దేవుడి ఫొటోగూడా లేకపోవటం వింతగా తోచింది.

ముసలాయన వైపుకు చూచాడు. ఆయనకు దేవుళ్ళంటే గిట్టదేమో అనుకున్నా ముఖాన కుంకుమ బొట్టు అది నిజం కాదని చెబుతోంది.

ఆయన నవ్వుతూ, "మాకు అద్దెకిచ్చినాయన దేవుళ్ళ కోసం ప్రత్యేకంగా మరో గది కట్టించారండి, వంటింట్లో ఉండటం ఆయనకు నచ్చలేదల్లే ఉన్నది... నాకూ అదే బాగున్నట్లనిపించింది. పూజ అవ్వగానే ఆ గదికి తలుపేసేస్తాను... దాని పవిత్రత దానికుంచాలి గదండీమరి!" అన్నాడు.

ఆయన మాటలు తృప్తి కలిగించినయి చక్రవర్తికి. తిరిగి వరండాలోకి వచ్చి కూర్చున్నారు.

నీలం చీర కట్టుకున్న మరో అమ్మాయి టీ తీసుకు వచ్చి ఇద్దరికీ ఇచ్చింది.

"వద్దన్నాను గదండి!"

ఆ అమ్మాయి ఎర్ర చీర కట్టుకున్న అమ్మాయంత పచ్చటి పసిమి కాకపోయినా కళగల ముఖమే. ఒక్కసారి చూచి తల వంచుకున్నాడు చక్రవర్తి.

"ఫరవాలేదు తాగండి... మా పిల్లలకు ఇంటికి వచ్చిన అతిధులకు మర్యాద చేయటం వెన్నతో పెట్టిన విద్య!"

"క్రితం ఆదివారం వచ్చానుగాని తాళం వేసి ఉండటంతో నిరాశగా వెళ్ళిపోయాను!"

"క్రితం ఆదివారమా?" ఒక్కక్షణం ఆలోచిస్తున్నట్లుగా ఆగిపోయాడు ఆయన. "ఆఁ... మా మనవరాళ్ళు ఏవో కొనుక్కోవాలంటేను మంగళగిరి తీసుకు వెళ్ళాను... అయితే ఆరోజు వచ్చారన్నమాట మీరు!"

"అవునండీ!"

"ఉండటం ఎక్కడ?" ఆయన అడిగాడు.

"నాతోటే పనిచేసే మరో మాష్టారింట్లో ఉంటున్నాను!"

"అక్కడా ఇక్కడా దేనికండి... ఒకప్పటి మీ తాతగారింట్లోనే ఒక గదిలో ఉండవచ్చుగదా... ఆయనకూ తృప్తిగా వుంటుంది!... లంకంత కొంప... అన్ని సౌకర్యాలూ ఉన్నయి... మీరు మీ స్వంత ఇంట్లోలా ఉండవచ్చు!"

ఆయన ఆప్యాయతకు చక్రవర్తికి చాలా సంతోషమేసింది.

నిజమే– వచ్చిన రోజునే ఈ ఇంటిని చూడటానికి వచ్చి వున్నట్లయితే అక్కడా ఇక్కడా వుండకుండా తాతగారి మాటలు గుర్తుకుతెచ్చుకుంటూ ఈ ఇంట్లోనే ఆనందంగా ఉండేవాడు!

పది నిముషాల తృప్తిగా ఆ ఇంటిని చూచి లేచి నిలబడ్డాడు వెళతానన్నట్లుగా చక్రవర్తి.

"అయ్యో వెళ్ళటమేమిటి... ఉండండి... మా పిల్లలు చక్కగా వంటచేస్తారు... భోంచేసి కాసేపు విశ్రాంతి తీసుకుని వెళ్ళవచ్చు... ఇది మీ ఇల్లే అనుకుంటే మా పిల్లలూ ఎంతగానో సంబరపడతారు!"

"కాదులేండి... వెళతాను... మరోసారి మీ ఆతిథ్యాన్ని తప్పకుండా స్వీకరిస్తాను... మీ పేరు చెప్పనేలేదు!"

"అవతారం అంటారు... ఇదేమీ బాగాలేదండి... ఈ ఇంట కాలుపెట్టినవారు మా ఆతిథి మర్యాదలు పొందకుండా వెళ్ళటమనేది మాకు తృప్తిని కలిగించదు... మా పిల్లల్ని చూడండి... మీరు వెళ్ళిపోతానంటే ముఖాలు ఎలా ముడుచుకున్నారో!" అన్నాడు దిగులుగా ముఖం పెట్టి అవతారం.

"మరోసారి తప్పకుండా వస్తానన్నానుకదా... మీ ఆప్యాయతకు చాలా సంతోషం!"

ముందుకు అడుగులేస్తూ, ఒక్కసారి ఆ వరండాలోనే వున్న ఆ అమ్మాయిల వంక చూస్తూ, "వస్తానండి!" అన్నాడు.

వాళ్ళు చేతులూపుతూ, "తప్పకుండా రావాలి!" అన్నారు నవ్వుతూ.

అవతారంకు నమస్కారంపెట్టి బయటకు వచ్చేశాడు. రామబ్రహ్మంగారి మనవడంటేనే ఇంత మర్యాదచేశారు, ఆయనే వచ్చివుంటే ఇంకెంత హడావుడి చేసే వాళ్లో!

అప్పుడే గుడిమూసి సైకిల్ పట్టుకుని బయిటకు వచ్చిన పూజారిగారు, ఎదురింటిలోనుంచి వస్తున్న చక్రవర్తిని చూస్తూనే కనురెప్పలార్పటంకూడా మర్చిపోయినట్లుగా బిగుసుకుపోయి, నోరు తెరుచుకు చూస్తూ నిలబడిపోయాడు చాలాసేపు!.

* * *

సోమవారం ఉదయాన చిదంబరం ఊరునుంచి వచ్చాడు.

"ఓ గంట లేటుగా వస్తారని చెప్పేదా?" చక్రవర్తి అడిగాడు.

చిదంబరం నవ్వాడు. "ప్రతి సోమవారం ఉండేదేగా... చెప్పండి!"

చిదంబరం ఇంటినుంచి తెచ్చిన వాటిని సర్దుకుంటూ, "మా అమ్మ సున్నుండలు చేసి ఇచ్చింది... ఒకటి తిని వెళ్ళండి!" అంటూ చేతిలో పెట్టాడు.

"ఉండనీయండి... సాయంత్రం తింటాను!"

"సాయంత్రం ఇంకోటి తిందురుగాని!" అన్నాడు నవ్వుతూ. "మా అమ్మ వాటిని చేయటంలో ఎక్స్‌పర్ట్... ఇద్దరికోసమని ఇచ్చింది!"

అతడన్నది నిజమే. నేతి వాసనతో ఘుమఘుమలాడుతూ చాలా రుచికరంగా ఉన్నయి.

తొమ్మిది గంటలప్పుడు స్కూల్లో కాలుపెడుతుండగా సోషల్‌స్టడీస్ మాస్టారు సోమశేఖరం పలకరించాడు. "వచ్చిన కొద్ది రోజులకే ఈ ఊరి ఆనుపానులన్నీ తెలుసుకున్నారే... యూ ఆర్ గ్రేట్!" అన్నాడు పళ్ళన్నీ బయటపెట్టి నవ్వుతూ.

చక్రవర్తికి అర్థమవ్వలేదు ఆయన మాటల్లోని శ్లేష.

తను ఈ ఊరు వచ్చిన తరువాత ఎక్కడికి వెళ్ళాడని, ఎవర్ని కలిశాడని. వెళ్ళింది నాలుగయిదు ప్రదేశాలకు మించి లేవు. క్రితం ఆదివారం మొదటిసారిగా కూరలు కొనేందుకు మార్కెట్‌కు వెళితే భ్రమర కనబడింది. ఇద్దరూ మాట్లాడుకుంటూ కూరలు కొన్నారు. ఆమె బలవంతం చేయటంతో రామాలయం చూచి, వాళ్ళింటికి భోజనానికి వెళ్ళాడు. రెండోది ఆంజనేయులు గారితో కలిసి ఓ సాయంత్రంపూట పొలం గట్లవెంట తిరిగాడు. నిన్నటి రోజునయితే తన తాతగారు ఎప్పుడో నివసించిన పాత ఇంటిని చూచి వచ్చాడు. ఈ మాత్రం దానికే ఆయనగారు తను ఈ ఊరి ఆనుపానులన్నీ తెలుసుకున్నట్లుగా ఎగతాళిగా మాట్లాడతాడేమిటి?

తను భ్రమర ఇంటికి భోజనానికి వెళ్ళినందుకు అలా మాట్లాడుతున్నాడా?

అందులో పెద్ద విచిత్రమేమున్నది. చిన్నప్పుడు తను తెలిసినవాడవ్వటంతో ఆమె తనింటికి భోజనానికి ఆహ్వానించింది. ఆపైన ఇద్దరూ ఒకచోట పనిచేస్తున్నవాళ్ళవ్వటంతో తను నిరాకరించలేకపోయాడు. అది అంతగా అందరి దృష్టినీ ఆకర్షించాల్సిన విషయమేమీ కాదు!

పల్లెటూళ్ళతో వచ్చిన గొడవే ఇది. చీమ చిటుక్కుమన్నా ఊరంతా ఇట్టే తెలిసిపోతుంది. అంటే అందరూ కలిసి నిన్న తను తిన్న రుచికరమైన భోజనాన్ని

విషంలా మార్చి తన ఒళ్ళంతా ఎక్కించినా ఎక్కించవచ్చు. అసలే సోమశేఖరం శకునిలాంటి వాడని చిదంబరమే చెప్పాడు ఒకసారి మాటల్లో.

ఈ వార్త నలుగురికీ పాకుతుందేమోనని తనే భయపడుతున్నాడు. ఆడమనిషి భ్రమర ఇంకెంతగా బాధ పడుతుందో?

ఎలాగూ బయటపడింది కాబట్టి ఇక ఆ విషయాన్ని కప్పిపుచ్చటం అనవసరమనిపించింది. "నా చిన్నప్పుడు నేనూ భ్రమరగారూ గుంటూరులో పక్కపక్క ఇళ్ళలో ఉండేవాళ్ళం. ఆమే నన్ను గుర్తుపట్టి భోజనానికి పిలిస్తే ఆదివారం గదా అని వాళ్ళింటికి వెళ్ళాను... అంతేగాని కొద్ది రోజుల్లోని ఊరి ఆనుపానులన్నీ తెలుసుకునేంత గొప్పవాడినేం కాలేదు!" అన్నాడు ముఖానికి గంటుపెట్టుకుంటూ చక్రవర్తి.

"నిజమా! కంగ్రాచులేషన్స్... ఆమె చాకులాంటి నిజాయితీ గల మనిషేలేండి!" అంటూనే బడిగంట మ్రోగుతుండటంతో వడివడిగా లోపలకు వెళ్ళిపోయాడు మరో మాటకు అవకాశమివ్వకుండా.

మనస్సు అస్తవ్యస్తమయింది చక్రవర్తికి పిచ్చి పిచ్చి ఆలోచనలతో.

సాయంత్రం స్కూలు అయింతరువాత బయటకు వచ్చేముందు హెడ్మాస్టరుగారి గదిలోకి వెళ్ళి చెప్పి వెళ్ళటం ఓ మర్యాదగా ఉపాధ్యాయులంతా పాటిస్తారు. చక్రవర్తీ ఆయన గదికి వెళ్ళాడు. అప్పటికే చాలామంది వెళ్ళిపోయారు. తనే ఎవరో విద్యార్థి అడిగిన ఓ లెక్కను వివరిస్తూ క్లాసులోనే ఉండిపోవటంతో ఆలస్యమయింది.

చక్రవర్తి వెళ్ళేటప్పటికి పూర్ణచంద్రరావుగారు టేబుల్ సర్దుకుంటున్నారు బయల్దేరేందుకు సిద్ధపడుతున్నట్లుగా.

"వస్తానండి!"

"కూర్చో... నేనూ వస్తాను... అయిపోయింది!"

సోమశేఖరం వచ్చాడు. "వెళుతున్నాను సార్! రేపు ఓ గంట ఆలస్యంగా వస్తాను... నాకు మొదటి రెండు పీరియడ్లు లేవు... విజయవాడలో ఇవాళ మా మరదలికి

సీమంతం... మా ఆవిడను పొద్దునే పంపాను... ఇప్పుడు నేను వెళ్ళి ఆవిడను తీసుకుని రేపొద్దున వస్తాను!" అన్నాడు.

"విజయవాడ ఎంతసేపు వెళ్ళటం... కూర్చోవయ్యా, నేనూ వస్తున్నాను!"

చక్రవర్తి ఉండగా తనూ ఉండటం కాస్త ఇబ్బందికరంగా అనిపించింది ఆయనకు. చక్రవర్తిని ఎందుకు కూర్చోబెట్టిందీ అర్థమవుతూనే వున్నది. మధ్యాహ్న భోజన సమయంలో తను హెడ్మాస్టరుగారికి అందించిన సమాచారం గుర్తుకురాగా.

భ్రమర అప్పటికే వెళ్ళిపోయినట్లుగా గమనించాడు చక్రవర్తి. ఇవ్వాళ స్కూల్లో ఒకటి రెండుసార్లు ఎదురుపడ్డా ముభావంగా నవ్వేసి వెళ్లిపోయిందేగాని మాట్లాడలేదు.

"లేదులేండి... నేను వెళతాను... వెళ్ళే బస్సులన్నీ నాన్‌స్టాప్‌లు... పాసింజరు ఎప్పుడొస్తుందో సెంటర్‌లో కాపలా వేయాలి!" అంటూనే ఆగకుండా వెళ్ళిపోయాడు.

"పర్మిషన్‌లు ఎక్కువయిపోయినయి... ఇదుగో ఎక్కువసార్లు ఆలస్యంగా వస్తానంటూ చెప్పేది ఈయనే... ఇక చిదంబరంగారయితే ప్రతిసోమవారం అంతే... అందుకే సోమవారంనాడు కావాలని మొదటి రెండు పీరియడ్లు లేకుండా చూచుకున్నాడు... అయినా ఆయన చెప్పేది డ్రాయింగే కాబట్టి పెద్ద ఇబ్బంది లేదు!"

"నేను వారితో మాట్లాడానండి... డ్రాయింగ్‌లో కూడా విదార్థులకు ఇష్టత ఏర్పడేలా చేయాలని... ఆయనలో ఉత్సాహముంటే పిల్లల్లోనూ వస్తుంది!"

"భేష్! నాకూ ఉన్నదండి... ఇక్కడున్న ఆరువందలమంది విద్యార్థులలో కొందరయినా అందులో నిపుణత సంపాదించాలని... చూద్దాం... మీరూ ఆలోచించండి ఎలా చేస్తే బాగుంటుందో... అమలు పరుద్దాం... అంతేకాదు ఈసారి జిల్లాలో పదోతరగతిలో మన స్కూలు ప్రథమ స్థానంలో ఉండాలనేది నా కోరిక!"

"నిజమేనండి... నేనూ చిదంబరంగారితో అదే అన్నాను... మీరు ఈ సంవత్సరం రిటయిరవుతున్నారటగదా... అలా చేసి మీకు పార్టింగ్ గిఫ్ట్‌గా ఇవ్వాలనేది మా ఆలోచన!"

ఆయన ఆనందంగా చక్రవర్తి వంక చూచాడు.

"కానీ ఒక్క విషయం మనం గుర్తుంచుకోవాలి... మనం గురువులం... అంటే మనం అందరికీ ఆదర్శంగా ఉండాలిగాని, ఎవ్వరికీ వేలెత్తి చూపించే అవకాశమివ్వగూడదు... అప్పుడే మనకూ ఈ వృత్తికీ గౌరవం లభించేది!"

"మీరన్నమాట నూటికి నూరు పాళ్ళు నిజమండి!"

"భేష్! మాటల్లో కాదు చేతల్లో చూపించాలి దాన్ని!" ఆయన కంఠం కొద్దిగా గంభీరంగా మారింది. "నేను నీ గురించే ప్రత్యేకంగా మాట్లాడుతున్నది... నువ్వు ఈ ఉద్యోగానికి కొత్తగాబట్టి అంతగా నొక్కి చెప్పాల్సివస్తోంది!"

"ఏమైందండి... నేనేమైనా తప్పుచేశానా?" తడబడుతూ అడిగాడు చక్రవర్తి. ఉదయం స్కూలుకు వస్తున్నప్పుడు సోమశేఖరం అన్న మాటలూ గుర్తుకు రావటంతో కంగారూ పడ్డాడు.

"నువ్వు చేసిన పని ఏమీ బాగోలేదయ్యా! మన పేరు నలుగురు నోళ్ళలో నానగూడదు... అది విద్యార్థుల దృష్టిలోకి వెళ్ళిందంటే నీకే మాత్రం గౌరవం ఇవ్వరు వాళ్ళు... అసలు లెక్కచేయరు కూడా... ఇదే గనుక ప్రయివేటు స్కూలు అయివున్నట్లయితే వార్నింగ్ ఇవ్వటమే కాదు ఉద్యోగంనుండి పీకేసే వారు!"

"తోటి టీచర్ ఇంటికి భోజనానికి వెళ్ళటం అంత ఘోరమయిన నేరమా సార్!" ఇక ఆగలేక సూటిగా అడిగాడు. అలా అడుగుతుంటే అవమానంతో అతడి కంఠం బొంగురు పోయింది. "భ్రమరగారు మేము నా చిన్నప్పుడు గుంటూరులో పక్కపక్క ఇళ్ళలో ఉండే వాళ్ళం... ఆమే నన్ను గుర్తుపట్టి భోజనానికి పిలిచినట్లుగా అర్థమయింది! అంతేగాని ఇందులో నా గౌరవం పోగొట్టుకునేంత తప్పు ఉంటుందని అనుకోవటంలేదు!" తనని తాను సమర్థించుకుంటూ అన్నాడు చక్రవర్తి కొద్దిగా కంఠం హెచ్చించి. ఇంత చిన్న విషయాన్ని భూతద్దంలోనుంచి అందరూ చూస్తున్నారన్నమాట.

"ఆమె భోజనానికి పిలిచింది నువ్వు వెళ్ళావ్... అందులో తప్పేమున్నది... దాన్ని ఎవరు మాత్రం తప్పుపడతారు... నేననేది ఆ విషయం కాదు... మోహినీ మహల్‌కు ఎందుకెళ్ళావని?" ఆయన చక్రవర్తినే చూస్తూ చికాగ్గా అడిగాడు.

"మోహినీ మహలా? అదెక్కడున్నది సార్?" భృకుటి ముడివేశాడు చక్రవర్తి. ఆయన మాటలు చాలా వింతగా తోచినయి అతడికి.

"అదేమిటో తెలియకుండానే వెళ్ళాను అంటే ఎవరు నమ్ముతారయ్యా... నువ్వేమైనా చిన్న పిల్లాడివా?"

ముందుకు వంగుతూ, "నాకు వివరంగా చెప్పండి సార్! అసలు ఏం జరిగింది... నేను మీరనే ఆ మోహినీ మహల్‌కు వెళ్ళానని మీకెవరు చెప్పారు? అది నిజమో కాదో, ఎవర్నిచూసి ఎవరనుకున్నాడో మీకు చెప్పినాయన్ను కూడా పిలిపించండి... అడుగుదాం!" అన్నాడు కంఠాన్ని పెంచి. తన మీద వేసిన అభాండానికి చక్రున కోపమొచ్చింది. అసలు అలాంటి అపవాదును ఆ పెద్దాయనకు మోసిన వ్యక్తిమీదా కోపమొచ్చింది.

"నిన్న నువ్వు రామమందిరం వీధిలోకి వెళ్ళావా?" ఆయన గుచ్చిగుచ్చి చూస్తూ అడిగాడు.

"వెళ్ళాను!... నిన్నేమిటి, క్రితం ఆదివారమూ వెళ్ళాను!" అన్నాడు ముఖం చిట్లిస్తూ. అందులో అబద్ధమాడాల్సిన అవసరమేమున్నది.

"దాని ఎదురుగ్గా వున్న పెంకుటింట్లోకి వెళ్ళావా?"

"వెళ్ళాను!" దృఢంగా అన్నాడు.

"అదే మోహినీ మహల్... ఓ వ్యభిచార గృహం!"

పూర్ణచంద్రరావుగారి మాట వింటూనే చక్రవర్తి బిగుసుకు పోయాడు. ఇదెక్కడి ఘోరం?

"ఏమన్నారు అది వ్యభిచార గృహమా?" మాట నూతిలోనుంచి వచ్చినట్లుగా వున్నది. గుండె బాధతో మెలితిరిగిపోతోంది. "మా తాతగారు నివసించిన ఎంతో పవిత్రంగా చెప్పుకునే ఆ ఇల్లు ఇప్పుడు వ్యభిచార గృహమయిందా?"

ఆయనకు అర్థం కాలేదు అతడి మాటలు. "ఏమిటి నువ్వంటున్నది? మీ తాతగారు ఆ ఇంట్లో ఉన్నారా? మీ తాతగారు ఎవరు?" ఆయన ఎవరా అన్నట్లుగా ఆలోచిస్తూ, నుదురు ముడివేసి అడిగాడు.

"ఒకప్పుడు ఈ ఊరి ఎలిమెంటరీ స్కూల్లో టీచర్‌గా చేసి, ఎంతో గౌరవప్రదంగా బ్రతికిన రామబ్రహ్మంగారే మా తాతగారు!... మా నాన్న నాన్న! ఆయన నివసించిన గృహమే అది!"

తెరుచుకున్న నోరు మూతపడలేదు పూర్ణచంద్రరావుగారికి.

"నిజమా?" రెండు నిముషాల తరువాతకానీ ఆయన ఆ మాట అనలేకపోయాడు.

"అవునండీ... ఆయన బ్రతికున్నంత కాలం చెప్పిన మాటల స్ఫూర్తితోనే నేను ఈ ఊరును కావాలని ఎన్నుకుని వచ్చింది!"

"వారు చాలా పెద్దమనిషి... గౌరవనీయుడు... నాకు అక్షరాభ్యాసం చేసింది ఆయనేనని ఇప్పటికీ నేను గర్వంగా చెప్పుకుంటాను... నువ్వు ఆయన మనవడివా?" ఎంతో ఆత్మీయంగా చక్రవర్తిని చూస్తూ అతడి చేతిమీద చేయివేశాడు.

ఆయన మాటలకు సంతోషమేసింది చక్రవర్తికి. "నా చిన్నవయస్సులో ఆయన ఎప్పుడూ చెబుతుండే ఈ ఊరు, ఎంతో పవిత్రంగా చూసుకునే ఆయన నివసించిన ఆ ఇల్లు, ఆయన పనిచేసిన స్కూలు గురించిన విశేషాలే నా మనస్సునంతా ఆవరించి ఉన్నయ్!"

పూర్ణచంద్రరావుగారు తదేకంగా చక్రవర్తినే చూస్తున్నాడు.

"నా మనస్సుమీద ఆయన వేసిన ముద్రతోటే ఎలాగైనా ఈ ఊళ్ళో ఆయన పొందిన ఆనందాలను నేనూ పొందాలనే కోరిక కలిగింది... ఆయన పని చేసిన

స్కూలు పడగొట్టే ఈ హైస్కూలు కట్టారు అని తెలుసుకున్నప్పుడు ఎంతగానో బాధపడ్డా అదే స్థలంలో కట్టిన ఈ భవనంలోనే నేను పనిచేస్తున్నాననుకోవటం కొంత తృప్తిని కలిగించింది... అలాగే ఆయన చెప్పినట్లుగానే ఈనాటికీ ఏ మార్పులేకుండా కనబడుతున్న ఆ ఇంటిని చూడాలనిపించి లోపలకు వెళ్ళాను... అంతే! అదో వ్యభిచార గృహమని నా ఊహకే అందని విషయం!" ఆ మాట అనుకుంటుంటేనే అతడి కడుపులోని నరాలు మెలికలు తిరగసాగాయి బాధతో.

తలవంచుకుని చెబుతూ అతడు పడుతున్న ఆవేదనను గమనిస్తున్న పూర్ణచంద్రరావుగారూ ఎంతో బాధపడ్డారు.

"ఎందుకు అలా అయింది ఆ ఇల్లు... దానికి ఎవరు బాధ్యులు?" కంఠం అసహనానికి లోనయింది చక్రవర్తికి.

"మీ తాతగారు అమ్మిన తరువాత అది నాలుగయిదు చేతులు మారింది... ఇప్పుడు విజయవాడలో వున్న ప్రకాశరావుగారు దానికి స్వంత దారుడు!"

"ఆ ఇంటి ఒకప్పటి గౌరవాన్ని నిలపాలన్న జ్ఞానం ఆయనకు లేకుండా పోయిందా?"

"ఆయన మంగళగిరిలో ఉద్యోగం చేస్తున్నప్పుడు పక్క ఊరే కాబట్టి అన్ని విధాలా బాగుంటుందని ఈ ఇంటిని కొనుక్కున్నారు. నాకు తెలిసినవారే... కొద్ది సంవత్సరాలు ఇక్కడనుండే రోజూ వెళ్ళివస్తుండేవాడు... కూతురుకు ఇంజనీరింగ్ కాలేజీలో విజయవాడలో సీటు రావటంతో దీన్ని అద్దెకిచ్చి అక్కడకు వెళ్ళిపోయారు. ఇప్పుడు ఆయన విశ్రాంత జీవితాన్ని గడుపుతున్నట్లుగా తెలిసింది!"

"తెలియక అద్దెకిచ్చినా మోహినీ మహల్ అని పేరుపెట్టి అసభ్యకరమైన వ్యాపారం చేస్తున్నారని తెలుసుకున్న తరువాతయినా ఖాళీ చేయించవచ్చుగదా!"

పూర్ణచంద్రరావుగారు నవ్వారు. "'మోహినీ మహల్' అనేది ఆ ఇంటికి ఈ ఊరి ప్రజలు పెట్టుకున్న ముద్దుపేరు... అదో ఊబిలాంటిది... ఎవరైనా ఒకసారి ఆ

ఇంట పెట్టిన కాలును బయటకు తీయటమనేది అంత తేలికైన విషయం కాదు... గూండాలు, రౌడీల దన్నుతో నడిచే వ్యాపారం... ప్రకాశరావుగారు అమాయకుడు... ఆ విషయం తెలిసిన వెంటనే ఖాళీ చేయమని చెప్పాడు... ఆయన అన్నప్పుడల్లా వాళ్ళు సరేనంటారుగాని ఖాళీ మాత్రం చేయటంలేదు... ఒకసారి ఆయన్ను బెదిరించారు కూడా... మీ అద్దె ప్రతినెలా సరిగ్గా ఇస్తున్నప్పుడు మేమెందుకు ఖాళీ చేయాలని మొండిగా మాట్లాడారుట... నాకు చెప్పుకుని ఎంతగానో బాధపడ్డాడు. చివరకు ఏమీ చేయలేక చేతులెత్తేశారు!"

"కుటుంబాలు నివసించే వీధిలో అలాంటి గృహాన్ని ఊరి ప్రజలు మాత్రం ఎలా సహిస్తూ ఊరుకున్నారు?... ఎవరూ పోలీసు కంప్లెయింట్ ఇవ్వలేదా?"

"పూర్వంలా ఇది గ్రామం కాదు, ప్రజలు తిరగబడటానికి... బాగా పెరిగిపోయిన బస్తీ... ఎవరి జీవితం వారిదే... చుట్టూ ఫ్యాక్టరీలు రావటంతో ఎక్కడెక్కడినుంచో కొత్తవాళ్ళు చాలామంది వచ్చారు... గమనించావో లేదో ఊరిచుట్టూ చాలా కాలనీలు వచ్చినయి, ఇంకా వస్తున్నయి... ఇదుగో ఈ నాలుగయిదు వీధుల్లోనే ఇంకా పాత వాసన కొడుతూ కొన్ని పూర్వపు ఇళ్ళు కనబడుతుంటయి... వాటినీ డెవలపర్స్ కొనేసి అపార్ట్‌మెంట్లు కట్టాలనే ప్రయత్నాలల్లో ఉన్నారు... ఎప్పటికయినా రాష్ట్రం విడిపోతే ఇక్కడకు దగ్గరలోనే రాజధాని వస్తుందనే ప్రచారమూ ఉన్నది... నేనయితే దాన్ని ఎత్తేయించటానికి ఒకటి రెండుసార్లు ప్రయత్నించినా, ఆ పనికి నేను చాలా బలహీనుణ్ణని అర్థమయి నోరుమూసుకు కూర్చున్నాను!" అన్నారు పూర్ణచంద్రరావుగారు బాధాతప్త హృదయంతో. "అందుకు కారణం మొదటివాడు భుజంగం అయితే, రెండోవాడు ఆయనగారు ఉంచుకున్న మాణిక్యం తమ్ముడు, నాగరాజు!"

* * *

భ్రమర స్కూల్లో ఆ రోజు ఉదయం కాలుపెడుతుండగానే, "మిమ్మల్ని సర్పంచ్‌గారు ఒకసారి కలవమని ఫోన్ చేశారు!" అన్నారు పూర్ణచంద్రరావుగారు ఆమెనే చూస్తూ.

"ఆ వెధవ స్కూల్లో నేను పనిచేసే ప్రసక్తేలేదు... వాళ్ళకు హిందీ టీచర్ కావాలిట,

ఈ గవర్నమెంటు స్కూలు కంటే రెట్టింపు జీతం ఇస్తాను రమ్మనమని కబుర్లమీద కబుర్లు పెడుతున్నాడు!” అన్నది పకపకా నవ్వుతూ భ్రమర. “ఈసారి ఫోన్ చేస్తే, ఆవిడకు ఏమాత్రం వాళ్ళ స్కూల్లో జేరే ఉద్దేశ్యం లేదని, ఇక్కడ వీళ్ళిచ్చే జీతంతో ప్రశాంతంగా రెండు పూటలా కడుపునిండా అన్నం తింటున్నానని చెప్పండి!”

“అమ్మా! ఇంకా సంవత్సరం కూడా నాకు సర్వీసులేదు... ఒకప్పుడు మా నాన్న ఈ ఊరిని కరణంగా రాజులా ఏలిన మాట వాస్తవమేగాని, ఈనాడు నేను ఏమాత్రం దన్నులేని ఒంటరిని... ఏదో ఇలా బ్రతుకుతున్నాను... నన్ను ఆ లంపటంలోకి లాగవద్దు... నువ్వే ఆయనతో మాట్లాడమ్మా!” అన్నారు నవ్వుతూ ఆయన.

ఆయనకు తెలుసు– గత నెలరోజులుగా నడుస్తున్న ఈ వ్యవహారం!

* * *

రాత్రి ఎనిమిది గంటలప్పుడు వంటపని పూర్తవ్వగానే ముందు గదిలో మంచంమీద కూర్చుని, సెల్ ఆన్ చేసింది భ్రమర. అటు ఎత్తి ‘హలో’ అన్న మాట వింటూనే, “ఏరా అన్నయ్యా! ఏమైంది... సమాచారం ఏమైనా దొరికిందా?” అడిగింది ఆత్రంగా.

“లేదు... ఆ పని అప్పజెప్పిన మనిషి చేతులెత్తేశాడు!”

“ఓ పెద్ద సీనియర్ దగ్గర పనిచేస్తున్నా ఆ పని చేయలేకపోయావంటే– చెట్టుక్రింద ప్లీడరువు అవుతావేమోనని భయంగా వున్నది!” అన్నది ఎగతాళిగా.

“పడ్డవాడెప్పుడూ బలహీనుడు కాదని నేను ఋజువు చేస్తానులే!”

“అదీ చూద్దాం... ఆ వెధవకు ఎంతిచ్చావేం?” అన్నది అరుస్తున్నట్లుగా.

అవతల మాట్లాడుతున్న రఘుపతి ఆమె పెదనాన్న కొడుకు. “ఎంతిస్తేనేంగాని దాన్ని గురించి ఆలోచించబోకు!”

“ఎందుకాలోచించగూడదు... నా మూలకంగా నీ పర్సెందుకు ఖాళీ అవ్వాలి...

చెప్పు ఎంతో ఇచ్చేస్తాను... నేనే నడుముకు చీరచెంగు బిగించానంటే కొన్ని ప్రాణాలు గాలిలో కలిసిపోతయ్యేమోనని భయంగా వున్నది!" అన్నది గొంతు తగ్గించి రహస్యంగానూ, చికాగ్గానూ. "ఈ ఊరు వచ్చి అప్పుడే ఎనిమిది నెలలు దాటుతోంది... ఎంత త్వరగా దాన్ని సాధించాలని ఆత్రపడుతున్నానో అంత ఆలస్యం జరుగుతున్నది... ఈ ఆలస్యానికి నాకే చిన్నతనంగా వున్నది!"

"ఇలాంటి విషయాలల్లో తొందరపడకూడదే... ఆ ఊరి వాడే మా క్లయింట్ బంధువొకడున్నాడని తెలిసింది... అతడి కోసం కబురు పెట్టాను!"

"ఎప్పుడొస్తాడట?" అసహనంగా అడిగింది.

"రెండు మూడ్రోజుల్లో రావచ్చు!"

"ఐదు సంవత్సరాల క్రితం యాక్సిడెంట్ చేసి, మూడు సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించి వచ్చిన వాడు దొరికితేచాలు నేను డొంకనే కదిలిస్తాను... వాళ్ళు ఎలాంటి వాళ్ళయినా సరే ముక్కు పచ్చడి చేయందే వదలను!" అన్నది గుసగుసగా. "చివరకు నేనే డైరక్ట్‌గా ఆ విషయాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నించక తప్పేలా లేదు!"

"ఒక్క వారం ఓపికపట్టు నేనే ఓ కొలిక్కి తీసుకు వస్తాను... ఇక్కడ పోలీస్ డిపార్టుమెంటులో నాకు కొంతమంది పరిచయస్తులున్నారు... మంగళగిరినుంచి ఆ పాత ఫైల్ తెప్పించాను... ఆ రోజు ఆ ట్రాక్టర్‌ను నడిపింది వెంకటస్వామి అనే అతడని తెలిసింది కాని జైలు నుంచి విడుదలయిం తరువాత అతడు కుటుంబంతో సహా ఎక్కడ సెటిలయిందీ ఎవరూ చెప్పలేకపోతున్నారు... అందులో ఏదో మిస్టరీ ఉన్నట్లు అనిపిస్తోంది!"

"ఎప్పుడూ ఊరు పట్టుకు తిరిగే ఆంజనేయులు అనే మనిషి నాకు ఇక్కడ పరిచయమయ్యాడులే... నువ్వు పెట్టిన గడువు దాటిందో ఆయన తోకకు నిప్పంటించి వదిలిపెడతాను... ఓ లక్ష రూపాయలకు ఎల్లయిసీ పాలసీ తీసుకుంటానంటే ఆ మాత్రం సాయం చేయకపోడు!"

"నువ్వు ఏంచేసినా నీ పేరు తెరమీదకు రాగూడదు... దేనికైనా సమయం రావాలి... తొందరపడితే ఎట్లా?"

"తొమ్మిది నెలలు ఆగాను!" అన్నది చికాగ్గా.

"ఆ ఊళ్ళోనే వుంటున్న నీ సంగతి, ఆ కేసులో నీ ఆసక్తి బయటకు వచ్చిందో నీ ప్రాణానికే ముప్పు, జాగ్రత్త!"

"అందుకే ఓపిక పడుతున్నది... ఓకే!" సెల్ ఆఫ్ చేసేసి వరండాలోకి వస్తూనే ఉలిక్కిపడింది భ్రమర.

అప్పుడే గేటు తెరుచుకుని ఓ వ్యక్తి లోపలకు వస్తున్నాడు. వరండా దీపపు కాంతిలో అతడు నాగరాజని గుర్తించగా చికాకు పడింది.

"నమస్కారమమ్మా! ఇంట్లో ఉన్నారా, లేరా అనుకుంటూ బయల్దేరాను... అదృష్టం... కనబడ్డారు!"

అతడు వరండాలోకి రాగానే, మనస్సులో ఎంత అయిష్టత ఉన్నా మర్యాదకోసం లోపలనుంచి కుర్చీ తీసుకు వచ్చి వేసి తను గోడవారగా నిల్చున్నది.

"చెప్పండి!"

"మా స్కూలు స్టేట్‌లో ప్రథమస్థానంలో నిలబడాలనేది నా కోరిక, మా బావగారి కోరిక... అన్ని సబ్జక్టులకూ మంచి ఉపాధ్యాయులున్నారుగాని కొద్ది నెలలబట్టీ సరైన హిందీ టీచర్‌లేక దాంట్లో విద్యార్థులు వెనకబడుతున్నారు! అందుకోసం మా బావగారు ఎన్నోసార్లు ఫోన్ చేశారు మీకు... నేనూ స్వయంగా కలిసి ఆ విషయం ఒకసారి చెప్పాను ఇంతకుముందే!"

"మీ స్కూలును మీరు అభివృద్ధిలోకి తేవాలని అనుకోవటం బాగానే వున్నది కాని, నేను గవర్నమెంటు ఉద్యోగాన్ని వదిలేసి ప్రయివేటు దానికి ఎందుకు రావాలో అర్థం కావటంలేదు... ఒక్కక్షణం... కాఫీ కలుపుతాను!" అంటూ వెనక్కు తిరగబోయింది భ్రమర.

"వద్దండీ నాకు కాఫీలు, టీలు అలవాటు లేదు... మాదీ ఎయిడెడ్ స్కూలే... మీ ఉద్యోగానికి దిగులేం లేదు!"

"అలా అని ఎలా చెప్పగలరు... ఎయడెడ్ అయినా మేనేజ్‌మెంటుకు కోపమొచ్చిందంటే నేను బయటకు వెళ్ళక తప్పదు... ఇప్పుడున్న దాంట్లో ఆ అవకాశం తక్కువ మహా అయితే నన్ను మరో ఊరికి బదిలీ చేస్తారు!" నిర్లిప్తంగా ఆయన్నే చూస్తూ అన్నది. "ఈ సంవత్సరం మా విద్యార్థులకూ ర్యాంకులు వచ్చేలా చూడాలని ప్రయత్నిస్తున్నాం!"

"బోడిస్కూలు... గవర్నమెంటు స్కూల్లో పాసయ్యేవాళ్ళకంటే తప్పేవాళ్ళే ఎక్కువుంటారు... ఆలాంటి స్కూలును గొప్పగా చిత్రీకరిద్దామనుకుంటే ఎలా... చదువురాని మొద్దులే అక్కడ జేరేది!"

"మొద్దులనుంచే కదా అందమైన కళాకృతులు తయారయ్యేది!" అన్నది నవ్వుతూ భ్రమర.

"మాటలు అనవసరమమ్మా! మీరు మా స్కూలుకు రావాలి... ఈ ఊళ్ళో ఎప్పుడూ ఆ ప్రభుత్వస్కూలుకంటే మా స్కూలే ఉన్నతస్థాయిలో ఉన్నది, ఉంటుంది, ఇంకా ఇంకా ఉండాలి... మీకెంత జీతం కావాలో చెప్పండి... ఇస్తాం... అంతేగాని మా ఊళ్ళో వుంటూ మా మాట వినసంటే ఎలా?"

భ్రమర అతడి మాట తీరుకు కోపాన్ని నిగ్రహించుకోలేకపోయింది.

"బెదిరిస్తున్నారా?"

"ఛ!ఛ! చిటిక వేయటమే తప్ప నాకు అలాంటి అలవాటు లేదు!... కార్యవాదినే కాని, మాటల మనిషిని కాను!"

అది మరో చురకలా భావించింది భ్రమర.

"దెన్ సారీ! ఇంకెప్పుడూ ఆ విషయాన్ని నా దగ్గర ఎత్తవద్దు... నమస్కారం!" అన్నది ఓ అడుగు ముందుకువేస్తూ.

నాగరాజు తోకతొక్కిన త్రాచులా ఆ కుర్చీలోనుంచి లేచాడు.

* * *

ఆదివారం ఉదయం తొమ్మిది గంటలప్పుడు పూర్ణచంద్రరావుగారు, చక్రవర్తి విజయవాడలో బస్సు దిగి, ఆటో ఎక్కారు సత్యనారాయణపురం వెళ్ళేందుకు. క్రితంరోజు రాత్రి పూర్ణచంద్రరావుగారు ఫోన్ చేసి ప్రకాశరావుకు చెప్పారు సాయిరాంపురంలోని ఇంటి విషయం మాట్లాడేందుకు తాము వస్తున్నట్లుగా,

"నాకూ అర్థం కావటంలేదు, మాష్టారూ!... వాళ్ళు ఖాళీ చేయమంటే చేయకపోంగా నన్ను బెదిరిస్తున్నారు కూడా... దాన్ని అమ్మేద్దామన్నా వాళ్ళ భయంతోటే కొనేవాడెవడూ ముందుకు రావటంలేదు... కోర్టుకు వెళ్దామంటే డబ్బుకు డబ్బా దండగ, ఈ వయస్సులో కోర్టులచుట్టూ తిరగటం నా వల్లకాదు... నాకు అలవాటు లేదు... నా బ్రతుకు ఆ వెధవల వలన దినదినగండంగా తయారవుతుంది... ఏం చేయాలో తెలియటం లేదు... ఎప్పటికయినా భగవంతుడు దయ నామీద ప్రసరిస్తే ఆ ఇల్లు నాదవుతుంది... అంతే!" అన్నాడు నిర్వేదంగా ప్రకాశరావు.

"అమ్మితే ఎంత వస్తుందనుకుంటున్నారు?" చక్రవర్తి అడిగాడు.

వాళ్ళు వరండాలో కూర్చొని మాట్లాడుకుంటున్నారు. ప్రకాశరావు భార్య అంతకు ముందే వేడివేడి కాఫీ తెచ్చి ఇస్తే త్రాగారు. ఆయన సాయిరాంపురంలో వున్నంతకాలం తరచూ పూర్ణచంద్రరావుగారిని కలుస్తుండేవాడు. శెలవు వస్తే ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ పొలాలగట్లమీదకు వెళుతుండేవారు.

"కొనేవాడు ముందుకు రావాలిగదా?"

"ఎవడైనా ధైర్యంచేసి వస్తే!" ఎవడైనా అన్న మాటను నొక్కి పలుకుతూ అన్నాడు చక్రవర్తి.

"ఇప్పుడయితే పది లక్షలదాకా వస్తుంది... స్థలమే నాలుగు వందల గజాలు... రాష్ట్రం విడిపోయి గుంటూరు విజయవాడల మధ్య రాజధాని గనుక వస్తే రెండు

మూడు రెట్లు పెరిగినా పెరగవచ్చు... కానీ మనస్సుకు ప్రశాంతత చేకూర్చుకునేందుకే ఎంతవచ్చిన చూసుకోకుండా వదిలించుకుని చేతులు కడుక్కుందామనుకుంటున్నాను!" అన్నాడు నీరసంగా ఆయన. "నాకు తిండికి లోపంలేకుండా ఆస్తి వున్నది... ఇంకా దానిమీద బాగా రావాలి అనుకుంటూ టెన్షన్ పడుతూ బ్రతుకును ఎందుకు కుదించుకోవాలి?... అనుకున్నదాంట్లో సగం వచ్చినా కళ్ళుమూసుకుని ఇచ్చేస్తాను!"

చక్రవర్తి ఆలోచనలో పడ్డాడు.

– ఐదు లక్షల్లో తన తాతగారి ఆ ఇంటిని తను కొనుక్కుంటే ఎలా ఉంటుందా అని. దానికి డబ్బుకంటే ముందు దౌర్జన్యానికి ఎదురు నిలబడగల శక్తి కావాలి. నిబద్ధతకు ప్రాణం ఇచ్చే తాతగారి ఇంటిని పరమ ఛండాలపు పనులనుండి విముక్తిచేసి, పూర్వపు శోభ, ప్రతిష్ఠ, పవిత్రత తీసుకురావాలనే తపన మనస్సునంతా ఆవరించింది. అప్పుడే తను ఈ ఊరు రావటంలోని ఆంతర్యానికి సరైన సమాధానం దొరికేది.

హైదరాబాద్‌లో ఉన్న నాన్నగాని, అమెరికాలో ఉన్న అన్నయ్యగాని తలుచుకుంటే ఐదు లక్షలు ఓ లెక్కలోది కాదు. తాను కొనాలనుకునేది తాతపేరు నిలబెట్టేందుకే.

"ప్రకాశరావుగారు! నాకో సాయం చేయగలరా? మీరు అన్నమాట మీద నిలబడేటట్లయితే నేను ఆ ఇంటిని కొంటాను. ఒకప్పుడు మా తాతగారయిన రామబ్రహ్మంగారు నివసించిన ఆ ఇల్లు ఇప్పుడు ఇలా అయిందే అని నా మనస్సు విలవిలలాడిపోతోంది. నేనే కాదు, ఆ గ్రామంలో వున్న పూర్ణచంద్రరావుగారిలాంటి ఆయన అభిమానులంతా కూడా బాధ పడుతున్నారనే అనుకుంటున్నాను... నేను వాళ్ళందరి సాయమూ తీసుకుంటాను... అయితే మీరొక పనిచేయాలి. నాకు డబ్బు సమకూర్చుకునేందుకు కొంత సమయం పట్టవచ్చు... సంవత్సరాలు కాదులేండి, నెలలే... దాని డాక్యుమెంట్లు ఇవ్వండి... ముందు బ్యాంకునుండి అప్పుదొరుకుతుందేమో ప్రయత్నిస్తాను, దొరక్కపోయినా నా స్వంత ఏర్పాట్లు నేను చేసుకుంటాను... ఈ అమ్మకం విషయాన్ని మాత్రం రహస్యంగా వుంచాలి... రిజిస్ట్రేషన్ అయి, కాగితాలు నా చేతికి వచ్చేంతవరకూ మన ముగ్గురికీ తప్ప మరొకరికి తెలియగూడదు... ముఖ్యంగా

ప్రస్తుత ఆ ఇంటి నిర్వాహకులకు, వారి అనుయాయులకు... నా పేరున కాగితాలు వచ్చిన తరువాత నేనే స్వయంగా రంగంలోకి దిగి ఆ ఇంటిని ఖాళీచేయించటానికి నా ప్రయత్నాలు నేను చేసుకుంటాను... నేను డబ్బివ్వటం, మీరు రిజిస్టరు చేయటంతో మీ సమస్య తీరిపోయి, నా సమస్య మొదలవుతుంది!" అన్నాడు చిరునవ్వుతో చక్రవర్తి.

ప్రకాశరావు వెంటనే చక్రవర్తి మాటలకు స్పందిస్తూ, తన అంగీకారాన్ని సంతోషంగా తెలియబరిచాడు. దాన్ని ఎలాగో అలాగా వదిలించుకోవటమే ఆయన ధ్యేయం కూడా!

"భేష్! మంచి నిర్ణయం తీసుకున్నావయ్యా, చక్రవర్తి!" పూర్ణచంద్రరావుగారు ఎంతగానో సంతోషించారు అతడి మాటలకు.

'రణభేరి మ్రోగేందుకు కనీసం మరో మూడు నాలుగు నెలలు పట్టవచ్చు!'

* * *

పండు వెన్నెల. చల్లటి గాలి వీస్తోంది. రాత్రి ఎనిమిది గంటలయింది.

భుజంగమూ, నాగరాజు మాణిక్యం ఇంటి వెనుక వైపు మామిడి చెట్టుక్రింద కూర్చొని వున్నారు. వాళ్ళముందు టీపాయ్ మీద వాళ్ళ శరీరాలకు కావాల్సిన ఇంధనం వున్నది. పక్కన గ్లాసులున్నయి. స్టీలు మగ్గులో ఐస్ క్యూబ్స్ వున్నయి. వంటింట్లో మాణిక్యం గుడ్లుకొట్టి ఆమ్లెట్లు వేస్తున్నది.

ఆమెది భారీశరీరం. నల్లగానే వున్నా కళగల ముఖం. ఒత్తయిన జుట్టును ఎప్పుడూ చుట్టగా చుట్టి కొప్పులా పెట్టుకుంటుంది. ముఖాన రూపాయి కాసంత బొట్టు. మెళ్ళో నాలుగు వరసల బంగారు గొలుసులు దిగేసుకుంటుంది. ఇంట్లోనే వున్నా వెయ్యి రూపాయలకు తక్కువ చీరకట్టదు.

తమ్ముడూ, ఉంచుకున్నవాడూ అడ్డదారుల్లో సంపాదించినదంతా తెచ్చి ఆమె చేతిలో పెడుతుంటారు.

"ఎప్పుడో ఈ ఊళ్లో పనిచేసిన బడిపంతులు మనవడు మన గెస్ట్‌హౌస్‌కు వెళ్ళాడట!"

నాగరాజు అన్నాడు.

"అవతారం లోపలకు రానిచ్చాడా?" మాణిక్యం లోపలనుంచే అడిగింది.

"వాడికేం తెలుసు... పాసింజర్ అనుకొని రానిచ్చాడు... లోపలకు వచ్చింతరువాత ఆ గాడిద వెళ్ళబెట్టాడట– ఇది మా తాతగారు ఒకప్పుడు ఉన్న ఇల్లు, చూద్దామని వచ్చానూ అంటూ... వాడు గాని అసలు సంగతి తెలుసుకొని హడావుడి చేస్తాడా అని అనిపించింది... అప్పటికీ అవతారం పిల్లలిద్దరినీ మనవరాళ్ళంటూ పరిచయం చేశాడటలే!"

భుజంగం విని ఊరుకున్నాడు.

"అవతారం చెప్పగానే ఒకటే అనుకున్నాను... వాడు గనుక పిచ్చిపిచ్చి వేషాలు వేస్తే చిటిక వేద్దాంలే అని!" .

మాణిక్యం ఆమ్లెట్లను, చుడువాను, వేయించిన జీడిపప్పులను ప్లేట్లలో పెట్టుకొని తీసుకువచ్చింది. "అప్పుడే చిటికేసేదాకా వచ్చిందేమిటి వ్యవహారం?" అన్నది నవ్వుతూ. "కుర్రాడేనా?"

"ఆఁ... ఇంకా పెళ్ళికూడా కాలా!"

"నా దగ్గరకు తీసుకురా... సానబట్టి మళ్ళా కోలుకోకుండా చేస్తాను!"

భుజంగం, నాగరాజు ఘొల్లున నవ్వారు.

గ్లాసుల్లోని డ్రింకులు శరీరాల్లోకెక్కుతుంటే హుషారుగా వున్నారు. భుజంగానికయితే మాణిక్యం మాటలు మరింత కిక్కిస్తయి. ప్లేట్లు సగం ఖాళీ అయినయి.

మాణిక్యం వాటిని ముట్టుకోదు. భుజంగం ఎప్పుడైనా చికెన్‌లాంటిది తయారు చేయమన్నా నసుక్కుంటూ చేస్తుందేగాని తను తినదు. పూర్తి శాకాహారే.

నాలుగు పాడిగొడ్లు భుజంగం కొన్నవే ఉన్నయి. స్వయంగా పాలు పితికి అమ్ముకుంటూ ఏ కారణంతోనైనా అతగాడు దూరమైనా దిగులు లేకుండా బాగానే

వెనకేసుకుంటున్నది. రోజూ పొద్దున్నే పాలు పెద్ద క్యాన్‌లో పెట్టుకుని వాకిటి తలుపు దగ్గర స్టూలు వేసుకు కూర్చొని, పైట జారిపోతున్నా పట్టించుకోకుండా వచ్చినవాళ్ళకు పాలు పోస్తుంటుంది. కొందరయితే ఆమెను చూస్తూ కబుర్లుచెప్పటానికే పాలు పోయించుకునే వంకతో వస్తుంటారు. అయినా వాళ్ళ పరిధిలో వాళ్ళుంటారు. దూరంగా నిల్చొని తనివితీరా ఆమెను చూస్తూ కబుర్లు చెప్పేంతవరకే చనువు తీసుకుంటారు. వాళ్ళకు తెలుసు మాణిక్యం సంగతి– నోరు తెరిచిందంటే తాము గింగిరాలు తిరుగుతూ పానకాలస్వామి కొండవతల పడతామని.

"హిందీ టీచరు ఏమంటుందిరా, మన స్కూలుకు వస్తుందటనా, రాదటనా?"

"మహా పొగరుమోతులా వున్నది... స్వయంగా నేనే వెళ్ళి అడిగాను. రానని ఖచ్చితంగా చెప్పేసింది!"

"నువ్వు మాటకు ముందు చిటికేస్తాననటమే తప్ప దాని బ్యాక్‌గ్రౌండేమిటో ఎప్పుడయినా తెలుసుకోవాలని ప్రయత్నించావా?" అడిగాడు నాగరాజునే ఎగతాళిగా చూస్తూ భుజంగం. అతడికి ముందుకు దూకటమే తప్ప బుర్రలేదని తెలుసు. మాట ముద్దగా వస్తున్నది.

"దాని మొహం... దాని వెనుక ఏముంటే నా కేమిటి!"

"ఆగు... ఆవేశంతో కడాకు వచ్చేయబోకు... అది భానుమూర్తి కూతురు!"

"ఏ భానుమూర్తి?"

"ఐదేళ్ళ క్రితం నువ్వు చిటికేశావే... వాడి కూతురు!"

"ఇది ఏలూరునుంచి వచ్చింది... వాడిది గుంటూరు కదా?" నదురు చిట్లించాడు నాగరాజు.

"నువ్వు చిటికేసిం తరువాత వాళ్ళు ఏలూరు పారిపోయారు లే!"

"అది ఆ విషయం తెలియకే వచ్చిందా?"

“అదే మనం ముందు తెలుసుకోవాల్సింది... అది ఏ ఆలోచనతో వచ్చినా మన స్కూల్లో జేరితే మన కాళ్ళ దగ్గర చచ్చినట్లు పడివుంటుందనేది నా ఆలోచన!... అందుకే అది రావాలని నేను పట్టుపడుతున్నది!”

“దాని వాలకం చూస్తే ఎవరి కాళ్ళ దగ్గరా పడివుండే రకంలా లేదు!”

భుజంగం గలగలా నవ్వాడు నిషా బాగా ఎక్కటంతో. అప్పటికే రెండు రౌండ్లు పూర్తయినయి.

“శత్రుశేషం ఋణశేషం ఉండగూడదంటారు... పిచ్చిపిచ్చి వేషాలు వేస్తే దాన్ని అవతారం మనవరాలిగా మార్చేయటమే!” మాణిక్యం వాళ్ళ మాటలకు ముక్తాయింపు యిచ్చింది భుజంగం వంక చిరునవ్వుతో చూస్తూ.

* * *

శనివారం మధ్యాహ్నం ఒంటిగంటప్పుడు ఆరోజుకు స్కూలు అయిపోయి అందరూ ఇళ్ళకు వెళుతున్న సమయంలో భ్రమర హెడ్‌మాస్టర్‌గారి గదిలోకి వచ్చి, “నేను ఊరికి వెళుతున్నాను... బహుశః బుధవారం వస్తాను... ఎప్పుడొచ్చేది ఖచ్చితంగా చెప్పలేను గనుక వచ్చింతరువాత శెలవు చీటి ఇస్తాను!” అన్నది.

“భేష్! ఏ ఊరు వెళుతున్నావ్?”

“అది నా స్వవిషయం... మీరు అడగ్గూడదు నేను చెప్పకూడదు... ఊరికి వెళ్ళకపోతే ఇంట్లో బూజు దులుపుకుంటూ అయినా కూర్చుంటానేగాని స్కూలుకు మాత్రం రాను!”

“అమ్మో! ముందు పెద్దవాళ్ళతో సరిగ్గా మాట్లాడటం నేర్చుకో!”

“నేను తప్పేం మాట్లాడాను... మా అమ్మ నాకు అన్ని మర్యాదలూ నేర్పిందిగాని, ఈ సమాజమే నన్ను ఇలా నిష్కర్షగా మాట్లాడమని పురమాయించింది!” అన్నది పకపకా నవ్వుతూ. “ఏదీ ఇటు తిరిగి కాళ్ళు ముందుకు పెట్టండి!” అంటూనే ఆయన తిరగటం ఆలస్యం వంగొని ఆయన పాదాలకు నమస్కరిస్తూ. “నేను మీ కూతురు

లాంటిదాన్ని... నన్ను మీతోనైనా స్వేచ్ఛగా మాట్లాడనివ్వండి!... నేను వెళుతున్నపని సానుకూలమయ్యేలా ఆశీర్వదించండి!” అన్నది.

“భేష్!... ఇదీ పెద్దమనిషి తరహా అంటే... నువ్వు ఏది తలపెట్టినా విజయం సాధిస్తావనే నమ్మకం నాకున్నది... సుఖంగా వెళ్ళి లాభంగా రా!”

ఆమె నవ్వుకుంటూ  ఆ గదిలోనుంచి వడివడిగా బయటకు వెళ్ళిపోయింది.

భ్రమర వెళ్తున్నవైపే చూస్తూ ఉండిపోయారు పూర్ణచంద్రరావుగారు. ‘ఈ అమ్మాయి అంత తేలిగ్గా అర్థంకాదు... మనిషి మంచిదేగాని, మాట పెడసరం!’ అనుకున్నాడు ఆయన.

ఆమె అటు వెళుతుండగానే చక్రవర్తి వచ్చి ఆయన ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

“నాన్నతో మాట్లాడాను... అంత ఇష్టం లేకపోయినా మా అన్నయ్యతో సంప్రదించి చెబుతానన్నారు... ఆ ఇంటి ప్రస్తుత పరిస్థితిని నేను ఆయనకు చెప్పలేదు బాధ పడతాడనే ఉద్దేశ్యంతో!”

“భేష్! మంచిపని చేశావ్!”

“నాన్నకు మరోటికూడా చెప్పాను... ఇక్కడే వుండి ఎప్పుడయినా సరే అవాకాశమొస్తే పొలాలూ కొనాలని వున్నది... నువ్వు డబ్బు సర్దటమే కాదు, అన్నయ్యను కూడా పెట్టుబడి పెట్టమను... దాన్ని ఉమ్మడి ఆస్తిగానే అభివృద్ధి చేద్దాం అని!”

“భేష్!”

“అమ్మయితే ఎంతగానో సంతోషించింది... ఈ పట్నంలో ఏమున్నదిరా... వయసు వస్తున్నది, నాన్న రిటయిరవ్వగానే మేమూ అక్కడికే వచ్చేస్తాం... సాయింత్రంపూట ఎదురుగ్గా వున్న రామాలయంలో కూర్చొని రామదాసు కీర్తనలు పాడుకున్నా ఆ ఆనందమే వేరు అన్నది!... ఆమె పాటలు వినాలేగాని మరొకరు చెబితే ఆ కంఠంలోని మాధుర్యం తెలియదు!”

"నువ్వు ఎదుర్కోబోయే పోరాటంలో నా చేయూత తప్పకుండా ఉంటుందయ్యా... ఇదంతా రహస్యంగా జరగాల్సిన పని... మన ఊరి కొందరు పెద్దల్నికూడా అది నీ పేరున రిజిస్ట్రేషన్ అయిన తరువాత రంగంలోకి దింపుతాను... మాలాంటి చాలామందికి ఊరి మధ్యలో అలాంటి నీచపు పనులు జరగటం చూస్తుంటే చాలా అసహ్యంగా వున్నది!"

'మీ మాట సాయమే నన్ను ఈ విషయంలో ధైర్యంగా ముందుకు అడుగులు వేయిస్తోంది... ఇక మీరూ, ఊరి పెద్దలుకూడా నడుం బిగిస్తానంటే ఇంకా కావాల్సిందేమున్నది... సాయిరాంపురాన్ని ఓ ఆదర్శగ్రామంగా తీర్చిదిద్దుదాం!"

* * *

ఆదివారం ఉదయం ఏడుగంటలప్పుడు గుంటూరులో వున్న బాబాయి కొడుకు లాయర్ రఘుపతిని తీసుకుని బస్టాండుకు వచ్చి మాచర్ల బస్సెక్కింది భ్రమర.

ఇద్దరిలో రఘుపతే కొద్ది నెలలు పెద్ద. చాలా చనువుగా ఉంటారు. 'ఏరా అన్నయ్యా' అంటూ ఆత్మీయంగా పిలుస్తుంటుంది. అతడు గుంటూరులో ఓ ప్రముఖ న్యాయవాది దగ్గర జూనియర్‌గా పనిచేస్తున్నాడు.

రెండు రోజుల క్రితం వాళ్ళ క్లయింట్ సాయిరాంపురంనుంచి మనిషిని తీసుకు వచ్చాడు.

"మీ ఊళ్ళో ఐదు సంవత్సరాల క్రితం జరిగిన యాక్సిడెంట్‌లో ట్రాక్టర్ క్రిందపడి ఓ ప్రభుత్వోద్యోగి చనిపోయాడు... దాన్ని నడిపిన వెంకటస్వామి అనే డ్రైవరికి న్యాయస్థానం మూడు సంవత్సరాలు జైలు శిక్ష విధించింది. అతడు ఆ శిక్షను అనుభవించి క్రితం సంవత్సరమే విడుదలయ్యాడు. అతడిని ఒకసారి నా దగ్గరకు తీసుకురావాలి!" రఘుపతి చెప్పాడు వచ్చిన మనిషికి.

కావాలనే ఆ సమయంలో భ్రమర అక్కడ లేదు. తను సాయిరాంపురంలోనే ఉంటుండంతో ఆ ఊరి మనిషికి తనకు ఆ విషయంలో ఉత్సాహమున్నట్లు తెలియటం

ఇష్టంలేకపోయింది.

"వాడితో పనేమిటి సార్?" అన్నాడు నసుగుతున్నట్లుగా అతడు.

"నిజంగా ఆలోచిస్తే అందులో అతడి తప్పేమీ లేదు... బ్రేక్ ఫెయిలవ్వటంతో ఆ ప్రమాదం జరిగిందని అందరికీ తెలిసిందే... అయినా మూడు సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించటమే కాకుండా అతడి కుటుంబమూ అష్టకష్టాలు పడింది... చనిపోయిన ఆ ఉద్యోగి కుటుంబానికి ప్రభుత్వం పెద్ద మొత్తంలో ధనసహాయం చేసింది. అందులోనుంచి కొంత అతడికి ఇవ్వాలని అనుకుంటున్నారు వాళ్ళు... అది ఎంతో జాలితో, ఆ కుటుంబంమీద దయతో చేస్తున్న పని... నువ్వు ఆ ఊరువాడివి కాబట్టి అతడిని ఒకసారి నా దగ్గరకు తీసుకు వస్తే వాళ్ళకు కలుపుతాను!" అనునయంగా చెప్పాడు రఘుపతి.

"వెంకటస్వామి అయితే ఇప్పుడు మా ఊళ్ళో ఉండటంలేదు సారు... వాడికి జైలు శిక్షపడగానే వాడి కుటుంబమూ వెళ్ళిపోయింది... శిక్ష అనుభవించిన వాడూ తెలిసిన వాళ్ళమధ్య తలెత్తుకు తిరగలేక మా ఊళ్ళో కాలుపెట్టలేదు!"

"అయ్యో అలాగా?" అన్నాడు అతడి మాటలకు విచారపడుతూ రఘుపతి. "ఇప్పుడతడెక్కడున్నాడు మరి?"

"నాకూ బాగా తెలియదు సారు... వాళ్ళెవరూ ఇక్కడనుంచి వెళ్ళిపోయిన తరువాత మళ్ళా కనబడలేదు!"

"వాడి బంధువులెవరూ లేరా మీ ఊళ్ళో?"

"ఉన్నారుగాని ఎప్పుడన్నా ఆ మాట వచ్చినా వాళ్ళకేం తెలియనట్లే మాట్లాడుతున్నారు!"

"అయితే ఇప్పుడెలా... పాపం వాళ్ళేమన్నా ఆ కుటుంబానికి సాయం చేయాలనే ఆలోచనలో గట్టిగా వున్నారు... మనిషే కనబడకపోతే ఎవరికిస్తారు ఆ డబ్బు!"

అతడు సంశయిస్తున్నట్లుగా కాసేపు ఆగి, "నిజమెంతో తెలియదుగాని నేను

చూచాయగా విన్నది వాడు మాచర్లలో వున్నాడని... చెన్నకేశవస్వామి గుడిముందు కొబ్బరికాయలు అమ్ముకుంటూ బ్రతుకుతున్నాడని... నేను ఇలా చెప్పానని నా పేరు బయటకు తీసుకురావద్దు సార్... మీరు ఆ కుటుంబానికి సాయం చేయాలనుకుంటున్నారు కాబట్టి చెప్పాను!"

"ఛఛ... వాళ్ళే దీన్ని రహస్యంగా చేయాలనుకుంటున్నప్పుడు ఎందుకు చెబతాను ఎవరికైనా!"

దాని ఫలితమే ఈ రోజు రఘుపతి, భ్రమర మాచర్ల బయల్దేరింది వెంకటస్వామిని కలిసేందుకు.

మాచర్ల వెళ్ళేటప్పటికి పదకొండు గంటలయింది. ఎండ మండిపోతున్నది. బస్టాండునుంచి ఆటోలో చెన్నకేశవస్వామి గుడి దగ్గరకు వెళ్ళారు.

"అతడిని గుర్తు పట్టటం ఎలా?" భ్రమరకు ఆతురతగా వున్నది.

ముందు అతడిని చూడాలి. అతడితో అనునయంగా మాట్లాడి ఆ ప్రమాదం యాధృచ్ఛికంగా జరిగిందా, లేక కావాలనే ఎవరైనా యాక్సిడెంట్‌లా కనబడేలా చేయించారా తెలుసుకోవాలనేది ఆమె ఆలోచన.

తన తండ్రి ప్రభుత్వ ఉద్యోగి. సాయిరాంపురం సర్పంచి ప్రభుత్వ గ్రాంట్లను, వసూలుచేస్తున్న పన్నులనూ గ్రామంలో ఎలాంటి పనులకు వినియోగించకుండానే స్వాహా చేస్తున్నాడని విమర్శలు రావటంతో నిజానిజాలు పరిశీలించేందుకు ఆయన్ను పంపారు. ఆయన వెళ్ళి, అక్కడ వివరాలు సేకరించి, ప్రత్యర్థులు చెప్పినదంతా చాలా వరకు నిజమే అని తేలటంతో రికార్డులన్నీ స్వాధీనం చేసుకుని వస్తుండగా ఆ ప్రమాదం జరగటంతో ఆయన చనిపోయాడు. తండ్రి సహెూద్యోగి, అత్యంత సన్నిహితుడు, 'ఆ ప్రమాదం కావాలనే చేసినట్లుగా అనుమానంగా వున్నది' అంటూ తరువాత ఒకసారి వ్యక్తం చేశాడు... దానికి ముఖ్యకారణం ఆ ప్రమాదం ఓ నీటి కుంట పక్కన జరగటం, అతడు పట్టుకెళుతున్న ఆ రికార్డులన్నీ నీటికుంటలో పడి ఎందుకూ పనికిరాకుండా పోవటం... తన తండ్రేమో నిక్కచ్చి మనిషి... డబ్బుకు ఆశ పడేవాడు కాదు...

మొండిగా రూల్సు పట్టుకు కూర్చుండేవాడు... అందుకే కావాలని వాళ్ళే ప్రమాదాన్ని సృష్టించి చంపినట్లున్నారు అని ఆయన అమ్మతో అనటం తను విన్నది. అప్పుడు తను పదో తరగతిలో వున్నది. గుండెల్లో బాధ వేసింది. తండ్రి అంటే తనకు ఎంతో ఆత్మీయత. తనని చాలా ప్రేమగా చూచేవాడు. తన కోరిక నాలికమీద ఉండగానే తీరుస్తుండేవాడు. 'భ్రమర మా ఇంటి దీపం' అనేవాడు మాటకు ముందు... అలాంటి తండ్రి అలా మరణించటాన్ని సహించలేకపోయింది. ఆయన రూపాన్ని, ఆత్మీయంగా ఆయన తనని పెంచిన తీరునూ ఇంత కాలం గడిచినా మనస్సునుండి దూరం చేసుకోలేకపోతోంది. అన్నయ్య అప్పటికే గ్రాడ్యుయేట్ అవ్వటంతో ప్రభుత్వం అతడికి కారుణ్య నియామకాల్లో ఉద్యోగమిచ్చారు. దాంతో నాన్న లేడనే దిగులు తప్ప ఆర్థికంగా ఇబ్బందిలేకుండా సంసారం గడిచిపోతున్నది. తను బిఇడి చేసింది. అనుకోకుండా సాయిరాంపురంలో ఉద్యోగమూ వచ్చింది. ఆ ఊరి పేరు వింటూనే అప్పటివరకూ గుండెల్లో దాచుకున్న ద్వేషం ఒక్కసారిగా భగ్గుమన్నది. తన తండ్రిని పొట్టన పెట్టుకున్న ఆ ఊరిమీద కసి తీర్చుకోవాలనే దృఢసంకల్పానికి వచ్చింది.

తనని సాయిరాంపురం వేశారు అని తెలిసినప్పుడు తల్లి గాభరాపడుతూ ఎంతగానో వారించింది. తను అసలే దుడుకు మనిషి అని ఆమెకు తెలుసు. అందుకే తను ఇక్కడ ఏ ఇబ్బందుల్లో పడుతుందో అనే భయం ఆమెను వెంటాడుతోంది. అన్నయ్యగూడా లేనిపోని గొడవల్లో ఇరుక్కోవటం దేనికమ్మా అంటూ తనని నిరుత్సాహపరిచాడు.

తనే వాళ్ళకు ఎంతగానో నచ్చచెప్పింది. ప్రభుత్వ ఉద్యోగాన్ని వదులుకోవటం అంత తెలివైన పని కాదు, తను ఆ ఊళ్లో చనిపోయిన భానుమూర్తి కూతురుగా ఎవరికీ తెలియనీయనని చెప్పటంతో వాళ్ళు మెత్తబడ్డారు.

గుడిముందు ఆటో దిగారు ఇద్దరూ. రఘుపతి ఒక దుకాణంవద్దకు వెళ్ళి, "ఇక్కడ వెంకటస్వామి అనే అతడి కొట్టు వుండాలి... ఎక్కడో చెబుతారా?" అని అడిగాడు.

"అదుగో ఆ చివరలో వున్నదే... ఎర్రచీర కట్టుకున్న ఆడామె కూర్చొని వున్నది

చూడండి... ఆమె అతడి భార్యే!"

రఘుపతి, భ్రమర అటువైపుకు వడివడిగా అడుగులు వేశారు.

భ్రమర శరీరంలోని నరాలు ఉద్విగ్నితకు లోనవుతున్నయి.

వచ్చిన ఇద్దరినీ పూజాద్రవ్యాలకోసమే వచ్చారకుంటూ స్టూలు మీద కూర్చున్నదల్లా లేచి నిలబడింది ఆ ఆడమనిషి.

"వెంకటస్వామి ఉన్నాడా అమ్మా?"

"ఉన్నారండి!" వాళ్ళెవరన్నట్లుగా సంశయంగా చూస్తూనే కొట్టులోపలకు తొంగి చూచింది ఆమె. "నిన్నెవరో అడుగుతున్నారయ్యో!"

కొట్టులోపల పడుకుని వున్న మనిషి లేచి నిలబడ్డాడు. బాగా గడ్డాలు మీసాలు పెరిగివున్నయి. బలిష్టంగా వున్న అతడు గళ్ళ లుంగీమీద పొట్టి చేతుల తెల్ల చొక్కా తొడుక్కుని ఉన్నాడు. నుదుటంతా విభూది. మధ్యలో కుంకుమ.

ఎవరా అన్నట్లుగా వీళ్ళ వంక చూస్తూ వచ్చి ఎదురుగా నిలబడ్డాడు.

"మేం గుంటూరునుంచి వస్తున్నాం... మీతో కాస్త మాట్లాడాల్సిన పని బడింది!" రఘుపతే అన్నాడు.

అతడు కళ్ళు చిట్లించాడు. "ఏ విషయంలో?"

అతడి భార్య కూడా బెరుకుగా వాళ్ళ వంక చూచింది.

"కాసేపు ఎక్కడైనా కూర్చుందామా!"

"రండి... ఇంటికి వెళ్దాం!" అతడు తువ్వాలను భుజాన వేసుకుంటూ బయటకు వచ్చాడు మనస్సును అనుమానం పీడిస్తుండగా.

"నేనూ వస్తాను ఉండు!" కొట్లో పదేళ్ళ కూతుర్ని కూర్చోబెట్టి ఆమె కూడా బయల్దేరింది. ఆమె భయాలు ఆమెవి. ఎన్నో ఏళ్ళుగా కష్టాలు పడి, ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నారు. కొత్త కష్టాలేమీ తమను చుట్టుముట్టటంలేదుగదా అనేది ఆమె

సంశయం.

ఆ కొట్టుకు కొద్ది దూరంలోనే వున్నది చిన్న పాత పెంకుటిల్లు. అందులో రెండు గదుల్లో వీళ్ళుంటున్నారు. వాళ్ళకు ఒక్కతే ఆడపిల్ల.

"చెప్పండి!" అన్నాడు తలుపు తాళం తీసి లోపలకు వెళ్ళిన తరువాత చాప పరుస్తూ.

రఘుపతి, భ్రమర ఆ చాపమీద కూర్చున్నారు. గడప దగ్గర వెంకటస్వామి కూర్చున్నాడు. గోడవారగా అతడి భార్య నిలబడింది ఆత్రంగా వాళ్ళనే చూస్తూ.

"ఈ అమ్మాయి భానుమూర్తి కూతురు!"

అతడు ఉలిక్కిపడ్డట్లుగా చూచాడు భ్రమర వంక.

"దేనికి వచ్చారు ఇప్పుడు?" కంఠంలో చిన్న ఒణుకు.

కొద్ది క్షణాలపాటు అతడినే చూస్తూ ఉండిపోయి, సాయీరాంపురం నుండి తన క్లయింట్ తీసుకు వచ్చిన వ్యక్తికి చెప్పిందే అతడికీ చెప్పాడు రఘుపతి.

వెంకటస్వామి ముఖంలో ఎలాంటి మార్పులేదు. వాళ్ళిద్దరినే గుడ్లప్పగించి చూస్తుండిపోయాడు.

కొద్దిక్షణాలపాటు మౌనంగా వున్న అతడు నోరు తెరుస్తూ, "ఆ డబ్బుకు నేను అర్హుణ్ణి కాను!" అంటూనే చటుక్కున తలవంచుకున్నాడు.

ఉలిక్కిపడ్డట్లుగా భ్రమర అతడి వంక చూచింది. పెరిగిన జుట్టుతో వున్న అతడి ముఖంలోని భావాలను ఆమె స్పష్టంగా చదవలేకపోతోంది.

"ఎందుకని... ట్రాక్టర్‌లో ఏర్పడిన యాంత్రిక లోపానికి శిక్ష నీకు పడింది... కాదంటావా?"

"అందుకు కాదు నేను శిక్ష అనుభవించింది!"

"మరి?" రఘుపతి ఆత్రంగా కాస్తంత ముందుకు వంగాడు. "మరి ఏ నేరం

క్రింద నీకు న్యాయస్థానం ఆ శిక్ష విధించింది?"

"అయ్యా జరిగిపోయిందేదో జరిగిపోయింది... మా ప్రారబ్ధం అనుకుంటాం... ఏ తప్పూ చేయకపోయినా మేం అనుభవించినన్ని కష్టాలు, అవమానాలు ఈ భూమ్మీద మరెవ్వరూ అనుభవించి వుండరు... ఇప్పుడిప్పుడే కాస్త కోలుకుంటున్నాం... మరోసారి మమ్మల్ని ఆ రొంపిలోకి లాగకండి బాబూ!" తలుపు పక్కనే నిల్చొని వున్న ఆమె దీనంగా రెండు చేతులూ జోడించి అన్నది. ఆమె కళ్ళు తడుస్తుండటం గమనించింది భ్రమర.

వెంకటస్వామి మాట్లాడకుండా తలవంచుకు కూర్చున్నాడు.

"ఈయన మంచితనమే ఆ శిక్ష అనుభవించేలా చేసిందమ్మా!" మరల ఆమే అన్నది భ్రమరనే చూస్తూ.

"ఆ ప్రమాదంలో చనిపోయింది ఈమె తండ్రే అని చెప్పాను గదా... ఈమె మా బాబాయి కూతురు... ఎన్నో కష్టాలు పడ్డామని మీరే అంటన్నారు... ఇంటికి పెద్దయిన ఆయన చనిపోగా వీళ్ళెన్ని కష్టాలు పడిందీ మీరు అర్థం చేసుకోగలరు కనుక నేను వేరే చెప్పనక్కరలేదు... అలాంటి రెండు కుటుంబాలు ఒకరికొకరు చేతనయిన సాయం చేసుకోవటంలో తప్పేమున్నది!"

ముందుగా వెంకటస్వామే నోరు తెరిచాడు.

"ప్రమాదం జరిగిన ఆ రోజున ఆ సమయంలో నేను మంగళగిరిలో ఎరువులు కొనటానికి వెళ్ళాను!"

"ఏమిటీ... నువ్వు కాదా ట్రాక్టరును నడిపింది?" ఆత్రంగా అడుగుతూ, భ్రమర నోరు తెరుచుకుని వెంకటస్వామినే చూస్తూ ఉండిపోయింది.

"లేదు... నేను ఆ ట్రాక్టర్ డ్రైవర్నేకాని... ఆ సమయంలో భుజంగం గారు నన్ను ఎరువులు కొనుక్కు రమ్మనమని మంగళగిరికి పంపారు!"

"అయితే దాన్ని నడిపిందెవరు?"

"తెలియదు!"

"ఏమీ తెలియకుండానే నువ్వు నేరాన్ని అంగీకరించి శిక్ష అనుభవించావా?" విసురుగా అడిగాడు రఘుపతి.

భ్రమర అయితే అతడు చెప్పిన నిజానికి నోటమాట రానిదానిలా బిగుసుకుపోయి కూర్చున్నది.

"మా యజమాని కోరాడు కాబట్టి!"

రఘుపతి, భ్రమరా బిత్తరపోయారు అతడి సమాధానానానికి.

"అదంతా ఒక చెడు కలలా జరిగిపోయింది... మా ఖర్మ అనుకుని నోర్మూసుకు కూర్చోవటమే!" అతడి భార్యే లోగొంతుకతో అన్నది.

"అది గుర్తుకు వస్తుంటేనే నా గుండెలు మండిపోతున్నయి... నా మంచితనాన్ని వాళ్ళు ఉపయోగించుకున్నారు... ట్రాక్టర్ను నడిపింది ఎవరో చెప్పకపోయినా తమ దగ్గర బంధువని, అతడు కుర్రవాడు, చదువుకుంటున్నాడు, పోలీసు కేసయితే భవిష్యత్తంతా నాశనమయి పోతుంది అంటూ ఆ కేసును నా నెత్తిన వేసుకుని ఆ పిల్లవాడిని రక్షించమని భుజంగంగారు చేతులు పట్టుకు బ్రతిమలాడారు. కన్నీరు పెట్టుకుంటూ కాళ్ళావేళ్ళా పడ్డారు. నేనే ట్రాక్టర్ని నడిపినట్లుగా కోర్టులో అంగీకరిస్తే, నిర్లక్ష్యం వలన జరిగిన ప్రమాదం కాదు గనుక మహా అయితే ఆరునెలలో సంవత్సరమో శిక్ష పడుతుంది... నేను జైల్లో వున్నా మా కుటుంబం ఏ ఇబ్బందులు పడకుండా ధనసహాయం చేస్తామని నమ్మకంగా చెప్పి నేను జైలుకు వెళ్ళగానే, నా పెళ్ళాం పిల్లను కొద్దిగా డబ్బు చేతిలో పెట్టి ఆ ఊరునుంచి తరిమేశారు!" ఆ మాటలు చెబుతుంటే అతడి కళ్ళు ఎర్రబడుతున్నయి.

"అయ్యో అలాగా?" జాలిగా అన్నారు రఘుపతి, భ్రమర ఒకేసారి.

"అవునండి... మూడు సంవత్సరాలు నేను కటకటాల వెనుక నానా కష్టాలు పడ్డాను... అప్పుడప్పుడు నన్ను చూడటానికి వచ్చిన బంధువులు ఒక్కొక్క నిజాన్ని

నాకు చెబుతుంటే నా ఒళ్ళు సలసలా కాగిపోయింది. చదువుకుంటున్న పిల్లవాడిని రక్షించటానికి ముందుకు దూకితే నన్ను విషసర్పాలు కాటేసినయి. బంధువుల ద్వారానే నా భార్యా పిల్ల ఇక్కడ ఉన్నారని తెలుసుకుని జైలునుంచి విడుదలయినా సాయిరాంపురంలో కాలు పెట్టలేదు. కోపంతో రగిలిపోతున్న నా మీద నా భార్యే నీళ్ళు చల్లుతూ, నా కసిని తీర్చుకుందామన్నా మరోసారి ఆ ఊరు వెళ్ళనీయలేదు!" ఆ మాటలు చెబుతున్నప్పుడు బాధతో కృంగిపోతున్నా, అతడి కళ్ళు నిప్పులు కురిపిస్తున్నయి.

"కావాలని మా బాబాయిని చంపిన వాడు హాయిగానే తిరుగుతున్నాడన్నమాట!" అన్నాడు రఘుపతి.

అవునన్నట్లుగా తల ఊపాడు వెంకటస్వామి.

"ఇంతకీ అప్పుడు ట్రాక్టర్ను నడిపిన అసలు మనిషెవరో ఇప్పటికయినా తెలుసుకున్నావా?"

"అన్నిటికీ మూలకారకుడు ఆ నాగరాజే... వాడే కావాలని మీ బాబాయిగారిని చంపి, ఆయన పట్టుకెళుతున్న పుస్తకాలన్నీ పక్కన నీళ్ళకుంటలో పారేస్తే... నిజాయితీగా ప్రభుత్వడబ్బు ఖర్చుపెట్టి పనులు చేయించినా రుజువు చేయటానికి వీల్లేకుండా రికార్డులన్నీ నాశనమయ్యాయని పై ఆఫీసర్ల దగ్గర ఏడ్చాడట భుజంగం!"

"ఇప్పటికయినా నీ ద్వారా నిజాలు తెలుసుకోవటం మంచిదయింది!" రఘుపతి అన్నాడు.

"అయ్యా! ఇక్కడ గుట్టుగా బ్రతుకుతున్నాం... మళ్ళా దాన్ని బయటకు లాగి మమ్మల్ని ఇబ్బందుల్లో పడేయవద్దు!"

అతడు ఆ మాట అంటుండగానే భ్రమర వ్యానిటీ తెరిచి పదివేలు తీసి వెంకటస్వామికి ఇచ్చింది. "నా చేతి డబ్బునుంచి నేను ఇవ్వటంలేదు... ప్రభుత్వం ఇచ్చిన డబ్బులోనుంచే చాలా కొద్ది మొత్తాన్ని మీకిస్తున్నాను... దీంతో మీ అమ్మాయిని

బాగా చదివించండి!"

ఇక వెళతాం అన్నట్లుగా లేచి నిలబడ్డారు ఇద్దరూ.

భ్రమరకు చాలా ఆనందంగా వున్నది. మనస్సు తేలికపడింది. అతి ముఖ్యమయిన విషయాన్ని రాబట్ట గలిగినందుకు. ఇక తన తండ్రి మరణానికి కారకులయిన ఆ రాక్షసులను ఒక పట్టుపట్టాలి. దానికి మూల్యం వాళ్ళు చెల్లించక తప్పదు!

మరునాడు ఉదయం భ్రమర సాయిరాంపురంలో కాలుపెట్టి షేర్డ్ ఆటోలో తమ వీధి మొదట్లో దిగినప్పుడు, తన ఇంటి ముందు చాలామంది జనం గుమిగూడి ఉండటం గమనించి వడివడిగా అడుగులు వేసింది ఏం జరిగివుంటుందా అనే ఆందోళనతో.

రాత్రి దొంగలు పడ్డారు. దోచుకు వెళ్ళేందుకు విలువైనవేవీ ఆ ఇంట లేకపోయినా ఉన్నవాటినే నాశనంచేసి ఇల్లంతా చెల్లాచెదరుగా పడేశారు.

ఉలిక్కిపడ్డట్లుగా హాలంతా కలియచూసింది.

క్రిందపడివున్న సామాన్లను, గుడ్డలనూ చూస్తుంటే ఆమె కళ్ళముందు భుజంగమూ, నాగరాజే మెదిలారు!

ఆ వెధవలే అయివుంటారు– తను వాళ్ళ స్కూల్లో జేరలేదనే కసితో భయపెట్టేందుకు ఈ పని చేసివుంటారు.

పెదవులు బిగించి పళ్ళుకొరుక్కున్నది భ్రమర.

– కానీ ఆమె ఊహించలేకపోయింది– తానెవరి కూతురో వాళ్ళు అప్పటికే తెలుసుకున్నారనే నిజాన్ని!

* * *

ఆదివారం ఉదయం తొమ్మిది గంటలప్పుడు స్నానంచేసి కోదండరామస్వామి ఆలయానికి బయల్దేరాడు చక్రవర్తి.

మొన్న రాత్రి తండ్రే ఫోన్‌చేసి చెప్పాడు. "సాయిరాంపురంలోని ఆ ఇంటిని కొనేందుకు అన్నయ్య ఒప్పుకున్నాడురా! మొత్తం డబ్బు తనే ఇస్తానన్నాడు... ఆ ఊళ్లో పొలం కూడా కొందామంటుంటివి కదా, దానికి నేనిస్తానులే డబ్బు,,, నువ్వు అక్కడే ఉండటానికి నిశ్చయించుకున్నావు కాబట్టి వాటి బాగోగుల నువ్వే చూడవచ్చు. అమ్మగూడా చాలా సంతోషపడుతున్నది... ముందు రిజిస్ట్రారాఫీసుకు వెళ్ళి ఈసీ తీసుకో... ఇల్లు ప్రకాశరావుగారి పేరుమీదే ఉన్నదో లేదో చూడు... ఆయన ఇచ్చిన డాక్యుమెంట్లను గుంటూరులో మంచి లాయరుకు చూపించు... ఏ సమస్యా లేదనుకుంటేనే మనం ముందుకు వెళదాం!" చెప్పాడాయన.

"అలాగే నాన్నా!" అన్నాడు తండ్రి మాటలకు ఎంతగానో సంతోషపడుతూ.

ఆ ఇల్లు ఇప్పుడు ఏస్థితిలో వున్నదీ తండ్రికి చెప్పలేదు. కొందరు రౌడీల ఆధ్వర్యంలో అక్కడ వ్యభిచార గృహం నడుస్తున్నదీ అని తెలిస్తే అసలు దాన్ని కొనటానికే ఆయన సుముఖత చూపకపోవచ్చు!

పూర్ణచంద్రరావుగారికీ ఆ ఇల్లు కొన్నా చక్రవర్తికి అది సమస్యగా మారుతుందేమోననే భయం మనస్సులో ఓ మూల వున్నది. అందుకే ఆయనే ఓ మధ్యేమార్గాన్ని సూచించారు. దానికి ఆ ఇంటి యజమాని ప్రకాశరావూ అంగీకరించాడు, ఎలాగయినా దాన్ని వదిలించుకోవాలనే తపన పడుతుండటంతో.

ఆ సలహా ప్రకారం ముందుగా ఒప్పందం వ్రాసుకుని, ఇంటి యజమానికి లక్ష రూపాయలు బయానాగా ఇవ్వాలి. దాన్ని వాళ్ళిద్దరి పేర్లమీద బ్యాంకులో వేసి. చక్రవర్తికి జీపీఏ ఇవ్వాలి. తరువాత ఆ ఇంటిని ఖాళీ చేయించటానికి ఇద్దరూ కలిసి ప్రయత్నించాలి..

అటు అన్నయ్య అంగీకరించటం కూడా శుభసూచకంగా కనిపించింది చక్రవర్తికి. ఉదయాన్నే వెళ్ళి ఆ విషయాన్ని పూర్ణచంద్రరావుగారికి చెబితే ఆయనా సంతోషించి ప్రకాశరావుగారికి ఫోన్ చేసి చెప్పాడు.

ఆదివారం కావటంతో గుడికి వస్తూనే తాతగారి ఇంటివంక చూచాడు చక్రవర్తి.

వాకిటికి తాళం వేసి వున్నది.

గుళ్లోకి వెళుతూనే పూజారిగారు ఒంటరిగా వుండటంతో, "అదేమిటి మా తాతగారి ఇంటికి తాళం పెట్టివున్నది?" అని అడిగాడు.

"వారం రోజులబట్టి అది అలాగే వున్నది... మీరు గమనించారో లేదో తలుపుకు కట్టిన నిమ్మకాయ, మిరపకాయలు కూడా తీసివేశారు!"

"అసలు అవెందుకు కట్టారు?" అన్నాడు వింతగా ఆయన్నే చూస్తూ.

"సామాన్యంగా అలాంటి ఇళ్ళకు అలవాటు పడ్డవాళ్ళు గుర్తించేందుకు వీలుగా అవి కడుతుంటారు!" అన్నాడు ఆయన చిరునవ్వుతో.

"నిజమా?" ఆశ్చర్యపోవటం చక్రవర్తి వంతయింది. "నాకు తెలియదు ఆ విషయం... అలా తెలిసివుంటే ఆ ఇంట్లో కాలుపెట్టి మీలాంటి వారి దృష్టిలో పడివుండేవాడిని కాదు... అయితే వాళ్ళు ఇల్లు ఖాళీచేసి ఉంటారంటారా?"

"వాళ్లు అంత తేలిగ్గా ఆ ఇంటిని వదిలేస్తారని నేననుకోను... ఊరిమధ్య కుటుంబాలు నివసిస్తున్న వీధిలోని ఆ దరిద్రాన్ని వదిలించాలని ఇంతవరకూ ఎంతోమంది ప్రయత్నంచేసి విజయం సాధించలేకపోయారు, భుజంగం, నాగరాజుల శక్తి అలాంటిది మరి... తాళం వేసి అట్టిపెట్టారంటే వాళ్ళు ఏ ఎత్తులో వున్నారో ఊహించటం కష్టం!"

సరిగ్గా అప్పుడే ఆంజనేయులు గుళ్ళోకి వచ్చాడు.

"ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?" అన్నాడు వాళ్ళిద్దరూ మాట్లాడుకోవటం చూసి.

పూజారిగారు నవ్వారు. "గుడి ఎదురుగా వున్న మోహినీమహల్ తలుపులు ఈమధ్య తెరుచుకుంటున్నట్లు లేదు, ఈ ఊరుకి ఆ పీడా వదిలిందా అని అనుకుంటున్నాం!"

ఆంజనేయులు నాలిక బయటపెట్టి చప్పరించాడు. "అంత సుదినం తేలిగ్గా సాయిరాంపురంకు వస్తుందంటే నమ్మటం కష్టం... నేనూ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాను... ఎలాగైనా ఆ దౌర్భాగ్యులకి బుద్ధివచ్చేలా చేయాలని... మీకు తెలుసోలేదో మొన్న గుంటూరు వెళ్ళినప్పుడు ఓ శుభవార్త విన్నాను... మన ఊరు పెరిగిపోయి చుట్టూ పరిశ్రమలు ఏర్పడటంతో, దీనికి ఆనుకుని వున్న రెండుమూడు గ్రామాలను కలిపి మున్సిపాలిటీగా చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదట!... అదే నిజమయితే భుజంగంగాడికి రెక్కలు కత్తిరించినట్లే... అప్పుడు ఆ రాక్షస బావమరిది పనీ గోవిందానే... మంచివాళ్ళను చూసి మనం కౌన్సిలర్లుగా ఎన్నుకుంటే భుజంగంగాడు సోదిలోకి లేకుండా పోతాడు!" అన్నాడు విసురుగా.

చక్రవర్తి ఆ అవకాశాన్ని వదులుకోదలుచుకోలేదు. "ఎందుకు మీకు వాళ్ళంటే అంత కోపం?" అన్నాడు సాలోచనగా ఆయన్నే చూస్తూ.

"ఊరి మధ్యలో రాచపుండులా ఈ కొంపేమిటండీ... అసలు ఆ ఇంటి యజమాని ఎలా అద్దెకిచ్చాడు వీళ్ళకి?... తెలియక ఇచ్చాడనుకున్నా, తెలిసింతరువాతయినా ఖాళీ చేయించాలి గదా!" అన్నాడు నిరసనగా.

"ఆపని ఆయన వల్ల కావటంలేదేమో!" అన్నాడు పూజారిగారు.

"చూడండి ఆ నాగరాజుగాడికి నేనే సరైన మొగుణ్ణి... వాడి అంతు చూడటానికి నా ప్రాణాన్నయినా పణంగా పెడతాను!" అన్నాడు ఆవేశంగా ఊగిపోతూ ఆంజనేయులు.

"మీ విషయాలల్లో ఏమైనా కల్పించుకుంటున్నాడా?" ఉత్సుకతతో ముందుకో అడుగువేశాడు చక్రవర్తి.

"ఒళ్ళు మండిపోతోంది ఆ వెధవల్ని చూస్తుంటే... నాకు రెండు ఎకరాల తోట ఉన్నదని తెలుసుగదా మీకు... అది నా దౌర్భాగ్యానికి నాగరాజుగాడి తోటపక్కనే వున్నది... డబ్బులిస్తాడుట, దాన్ని నేను వాడిదాంతో కలిపేయాలట... నేను ఎంత కష్టపడి దాన్ని అభివృద్ధిచేసుకుంటున్నాను... దాంట్లో ప్రతిమొక్కనూ నా స్వహస్తాలతో

నాటాను... కుదుర్లు చేశాను... ఇప్పటికీ పొద్దున లేస్తూనే వెళ్ళి నీళ్ళు పెట్టుకుంటున్నాను... ఆ తోటమీద నా గుండెల్లో ఎంత ఆత్మీయత పేరుకు పోయిందో ఆ విషకుంభాలకేం తెలుస్తుంది... సంవత్సరంబట్టి రాయబారాలు నడుపుతున్నాడు... ఈ మధ్యన మళ్ళా ఒకసారి అడిగితే గట్టిగానే చెప్పాను ఇంకెప్పుడూ దాని మాటెత్తొద్దని... అది మనస్సులో పెట్టుకునే మొన్న రాత్రి నా పొలంలోకి గొడ్లను వదిలి పంటనంతా నాశనం చేయించాడు... వాడు అంతకు అంత అనుభవించేలా చేయకపోతే నాపేరు ఆంజనేయులేకాదు... తోక ఝాడించానంటే మాడిమసైపోతాడు వెధవ!" కళ్ళమ్మట నిప్పులు కురిపిస్తున్నాడు ఆంజనేయులు.

చక్రవర్తికి చాలా సంతోషమేసింది తనకో తోడు ఆంజనేయులు రూపంలో దొరికినందుకు.

గుడినుంచి సరాసరి పూర్ణచంద్రరావుగారి ఇంటికి వెళ్ళాడు చక్రవర్తి.

చక్రవర్తి మోహినీమహల్ గురించి చెప్పినమాట వింటూనే ఆయన నవ్వుతూ, "భేష్! అంటే నా దౌత్యం ఫలించిందన్నమాట... అది ఇంత తేలిగ్గా అవుతుందా అని నీకు చెప్పలేదులే... ఈ మధ్య గుంటూరు వెళ్ళినప్పుడు అనుకోకుండా నాకు తెలిసిన ఓ ఇన్స్పెక్టర్ కనబడితే ఊరికి న్యూసెన్స్గా వున్న ఈ ఇంటి విషయంలో ఏమైనా సాయం చేయగలుగుతాడేమోనని అడిగాను... అదేం పెద్ద విషయం కాదు, మీ యేరియా ఇన్స్పెక్టర్ బాగా తెలిసినవాడే, చెబుతాలేండి అన్నాడు... ఇప్పుడు నీ మాటల్నిబట్టి చూస్తే అతడు చేస్తానన్నది చేశాడన్నమాట!" అన్నాడు సంతోషంగా. "కాగల కార్యం గంధర్వులు తీర్చటమంటే అదే... మీ వాళ్ళు కొనటానికి అంగీకరించటం, నాకు అనుకోకుండా ఆ ఇన్స్పెక్టర్ దొరకటం అన్నీ శుభసూచకాలే!... ఇక నీదే ఆలస్యం... వెంటనే రిజిస్టర్ చేయించేందుకు డబ్బు సమకూర్చుకో!"

చక్రవర్తి హాయిగా ఊపిరిపీల్చుకున్నాడు.

– కానీ పూర్ణచంద్రరావుగారు ఊహించలేకపోయాడు... తను చెప్పిన ఇన్స్పెక్టర్ ఈ యేరియా ఇన్స్పెక్టర్కు చర్య తీసుకోమని చెబితే దాన్ని నాగరాజుకు ముందుగానే

ఉప్పందించటంతో, వాళ్ళు కొద్దిరోజులు దానికి తాళంవేసి అట్టిపెట్టాలని నిర్ణయించుకున్నారని!

* * *

స్కూల్లో ఆగస్టు పదిహేనున జండావందనం కార్యక్రమానికి అన్ని ఏర్పాట్లు జరిగినయి.

క్రితంరోజు సాయంత్రం స్కూలునుంచి వెళ్ళేముందు సోమశేఖరం పూర్ణచంద్రరావుగారి గదిలోకి వచ్చి, "ఈసారి జండా ఎగరవేయటానికి భుజంగంగారిని పిలవటంలేదా?" అని అడిగాడు.

"లేదండి... మన ఊళ్ళో వందేళ్ళ వృద్ధుడు వెంకటాచలంగారు వున్నారని తెలుసుగదా... ఆయన స్వాతంత్రోద్యమంలో పాల్గొన్న మనిషి... ఆయన చేత జండా ఎగరవేయించి, సన్మానం చేద్దామని అనుకుంటున్నాం... ఇలాగే ప్రతి సంవత్సరం ఇకనుంచి మన ఊరి ప్రముఖుల్ని సన్మానించాలనేది కోరిక... అఫ్‌కోర్స్ వచ్చేసంవత్సరం ఈ సీట్లో ఎవరుంటారో తెలియదుగదా... అందుకే ఒక ఆనవాయితీ ఏర్పరిస్తే బాగుంటుందని ఆ నిర్ణయం తీసుకున్నాం!"

"ప్రతి సంవత్సరం పిలుస్తున్న ఆయన్ను పిలవకపోతే బాధపడతారేమో!" అన్నాడు గునుపుగా సోమశేఖరం. "అందులో ఊరికి పెద్ద... ఇది ప్రభుత్వ స్కూలు... మనం పిలవకపోతే దానికి రాజకీయరంగు పులుముతారేమోనని నా భయం... ఇప్పటికే మన స్కూలుకు పోటీగా ఆయనకు కావాల్సిన మనిషి మరో స్కూలును నడుపుతున్నారు!"

పూర్ణచంద్రరావుగారు ఆలోచిస్తున్నట్లుగా కొన్నిక్షణాలు మౌనంగా వుండిపోయారు.

"పోనీయ్ వెంకటాచలంగారిని సర్పంచ్‌గారిచేత సన్మానం చేయిస్తే బాగుంటుందికదా!" మళ్ళా సోమశేఖరమే సలహా ఇస్తున్నట్లుగా అన్నాడు.

"రాములవారిని రావణాసురుడు సన్మానంచటమేమిటండీ... ఈసారికి

నేననుకున్నట్లుగా చేయనీయండి!”

సోమశేఖరం నసుక్కుంటూ వెళ్ళిపోయాడు.

– ఆయనకు తెలుసు ఈయనగారు భుజంగం చెంచా అని... ఎక్కడో అక్కడ ఆ దరిద్రానికి ఫుల్‌స్టాప్ పెడితేనేగాని స్కూలు గౌరవం పెరగదు. తను త్వరలోనే రిటయిరవ్వబోతున్నాడు కాబట్టి వాడు తనకు ఇబ్బంది కలిగించేదేమీ లేదు.

స్వాతంత్ర్య దినోత్సవాంనాడు పూర్ణచంద్రరావు మాటే నెగ్గింది. ఆయన నిర్ణయానికి ఎక్కువగా సంతోషించింది భ్రమర, చక్రవర్తి, ఆంజనేయులే.

అందునా ఆయన నిర్ణయం సాయీరాంపురంలో చాలామందిని ఉత్తేజుల్ని చేయగా వాళ్ళంతా వచ్చి హెడ్మాస్టర్‌గారికి బాసటగా ఆ కార్యక్రమం పూర్తయ్యేంతవరకూ నిలబడ్డారు. వెంకటాచలంగారయితే, కుర్చీలో కూర్చోబెట్టి, పూలదండవేసి, షాల్ కప్పుతుంటే, పూర్ణచంద్రరావుగారి చేతులుపట్టుకుని, జలజలా కన్నీరు కారుస్తూ, “నాకు సన్మానం చేయటం వలన ఎవరికీ లాభం వుండదుగదా... అనవసరం శ్రమతీసుకున్నారు!” అన్నాడు.

ఆ మాటలకు పూర్ణచంద్రరావుగారికీ కళ్ళు చెమర్చినయి.

కార్యక్రమాలన్నీ అయిన తరువాత వెళ్ళబోతూ, సోమశేఖరం పూర్ణచంద్రరావుగారి దగ్గరకు వెళ్ళి, “సర్పంచ్‌గారు ఇప్పుడే ఫోన్‌చేశారు... మిమ్మల్ని ఒకసారి కలవమన్నారు!” అన్నాడు.

“మీరు చేస్తే ఆయన చెప్పాడా, లేక ఆయన చేస్తే మీరు చెబుతున్నారా?” అన్నారు ఆయన నవ్వుతూ.

“నాకేం పని ఆయనకు ఫోన్‌చేయటానికి... ఆయనే చేసి చెప్పాడు కనుక మీకు చెబుతున్నాను... మీకు ఇష్టమయితే వెళ్ళండి... లేకపోతేలేదు!”

“మీరిద్దరూ బంధువులు కదా ఫోన్లు చేసుకోవటంలో తప్పేమున్నది... అందుకని అన్నాను!”

సోమశేఖరం సమాధానం చెప్పకుండా రుసరుసలాడుతూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

* * *

ఆదివారం ఉదయం పూర్ణచంద్రరావుగారు, చక్రవర్తిని తీసుకుని గుంటూరు వెళ్ళారు ప్రకాశరావుగారిచ్చిన ఇంటి కాగితాలు, జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ తనకు తెలిసిన లాయర్ విశ్వనాథంకు చూపించేందుకు.

ఆయన హెడ్మాస్టరుగారిని చూస్తూనే వడివడిగా కుర్చీలోనుంచి లేచి వచ్చి మిత్రుడిని సాదరంగా ఆహ్వానించాడు. ఆయనకు దాదాపు పూర్ణచంద్రరావుగారి వయస్సే వుంటుంది. ఆయన చిన్నతనమంతా సాయిరాంపురంలోనే గడిచింది. ఆ ఊరు కరణీకం చేసిన పూర్ణచంద్రరావుగారి తండ్రి, ఆయన తండ్రి ఎంతో సన్నిహితులు.

“చాలా ఆనందం నువ్వు మా ఇంటికి రావటం!” అంటూనే బెల్‌కొట్టి కుర్రవాడిని కాఫీలు తెమ్మనమని చెప్పాడు.

పూర్ణచంద్రరావుగారు వచ్చిన విషయం చెప్పి, చక్రవర్తిని పరిచయం చేస్తూ తెచ్చిన కాగితాలు ఇచ్చాడు, “సరిగ్గా ఉన్నయ్యో లేవో చూసి చెబితే, అన్నీ బాగుంటే ఆ ఇల్లు కొనుక్కోవాలనేది వీరి ఉద్దేశ్యం!”

ఆయన ఆ కాగితాల్ని కొద్దిసేపు పరిశీలించి, “నాలుగు రోజులాగి వారిని పంపు... ఈలోగా క్షుణ్ణంగా పరిశీలించి నా అభిప్రాయం చెబుతాను!” అన్నాడు.

కాఫీలు వచ్చినయి. త్రాగుతూ పూర్ణచంద్రరావుగారు ఆ ఇంటి ప్రస్తుత పరిస్థితిని వివరించాడు. “మొదటిది వీరికి తాతగారు నివసించిన ఆ ఇంటిమీద ఆత్మీయతతో కొనుక్కోవాలనే ఆలోచన కలిగించింది... రెండోది ఊరి మధ్యలో ఉన్న ఆ దరిద్రాన్ని వదిలించాలనేది నా తాపత్రయం... అందుకే నేనూ చొరవ తీసుకుంటున్నది!”

“వీరు రామబ్రహ్మంగారి మనవడా... గుర్తులేదా నా ప్రాథమిక విద్యంతా ఆయన దగ్గరే జరిగింది... వీరిని చూడటం ఆనందంగా వున్నది... చాలా మంచి

ఆలోచన, మంచి నిర్ణయం!" అన్నాడు ఆయన నవ్వుతూ.

"ఒకప్పుడు సాయిరాంపురంలో పూజనీయుడిగా గౌరవింపబడిన వారి ఇంటి పరిస్థితి నేడు అది... ఊళ్ళో పెద్దలు ఎంతగా సహకరించినా ఇల్లు ఖాళీ చేయించటం శ్రమతో కూడిన పని అయ్యేలా వున్నది... తెలిసీ కొండను ఢీకొట్టాలనే అనుకుంటున్నాం... భుజంగమూ, వాడి ఉంచుకున్న దాని తమ్ముడూ ఊరిని రాహుకేతువుల్లా పట్టుకున్నారు!"

లాయరు విశ్వనాథం ఆలోచిస్తున్నట్లుగా కొద్దిసేపు మౌనంగా ఉండిపోయాడు. ఆయనప్పుడే ఆ ఊరు వదలి పట్నమొచ్చి నలభై సంవత్సరాల పైనే అయివుంటుంది. ఆయన తండ్రీ ఇప్పుడు లేడు. సాయిరాంపురంలో స్థిరాస్తులేం లేవు. ఇప్పుడా ఊరు ఏలా వున్నదో ఆయనకు అంతగా తెలియదు.

"వాళ్ళు ఆ ఇంటిని అలాంటి అసభ్య కార్యక్రమాలకు ఉపయోగిస్తున్నా రనేందుకు ఆధారాలేమైనా చూపించగలుగుతారా?" అడిగారు. "ఎందుకంటే అలాంటి పనులు చేసే వాళ్ళెవ్వరూ అంత తేలిగ్గా చట్టానికి చిక్కరు!"

"ఆ ఇంటి సంగతి ఊళ్లో ఎవర్నడిగినా చెబుతారు... అంతకు మించిన ఆధారం ఇంకేం కావాలి?"

"అది నిజమే అవ్వవచ్చు కానీ అందుకు కోర్టుకు వచ్చి బోనులో నిలబడి సాక్ష్యం చెప్పగలిగిన వాళ్ళు ఉండాలి కదా! అలా ఎవరైనా ముందుకు వచ్చి సాక్ష్యం చెప్పినా తరువాత సుఖంగా ఆ ఊళ్ళో ఉండగలమనే ధైర్యమూ వాళ్ళకు ఉండాలి!" సాలోచనగా పూర్ణచంద్రరావుగారిని చూస్తూ అన్నాడు ఆయన.

ఆయనా ఆలోచనలో పడ్డారు.

"పకడ్బందీగా ఉంటే మనం పోలీసు కంప్లెయింట్ ఇవ్వవచ్చు... దానిమీద పోలీసులతో రెయిడ్ చేయించవచ్చు... అది ఋజువు చేయలేకపోతే మాత్రం పోలీసులుకూడా రాజకీయనాయకుల ముందు తలవంచవలసి వస్తుంది!"

రెండు నిముషాలపాటు ఎవరూ మాట్లాడలేదు.

“సరేలే... చూద్దాం... నేనూ, కలెక్టరుగారూ టెన్నిస్ కోర్టు ఫ్రెండ్స్‌మే... ఆయన సలహా కూడా తీసుకుందాం... వీరిని నాలుగురోజులు ఆగి నా దగ్గరకు పంపు!” అన్నాడు ఆయన.

పూర్ణచంద్రరావుగారు, చక్రవర్తి లేచారు ఇక బయల్దేరతాం అన్నట్లుగా.

ఆ గది లోంచి బయటకు వస్తూనే ముందుగదిలో, లాయరుగారి జూనియర్ రఘుపతితో మాట్లాడుతూ కూర్చుని వున్న భ్రమరను చూస్తూ ఇద్దరూ ఆశ్చర్యంతో నిలబడిపోయారు కొద్ది క్షణాలపాటు!

* * *

ఉదయం పది గంటలకు కోదండరామాలయం ముందున్న మోహినీమహల్ ఆవరణలో వేసిన తెల్లని షామియానాలోనుంచి స్పీకర్‌లో పెద్దగా సినిమా పాటలు వినబడుతున్నాయి.

ఆ ఇంటి వాకిటికి మామిడి తోరణాలు కట్టారు. జనం ఒక్కొక్కరే వచ్చి వాకిట్లోనే నిల్చొని మాట్లాడుకుంటున్నారు.

భుజంగం, నాగరాజు హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు.

ఆ ఇంటి ముందు గోడకు కొత్తగా పెద్ద అక్షరాలతో రాయించిన **‘అనాథ స్త్రీ శరణాలయం’** ‘నిర్వహణ: స్త్రీ జనోద్ధరణ సమితి, సాయీరాంపురం– అన్న బోర్డు పెట్టి వున్నది. దానికి చుట్టూ బంతిపూలు కట్టివున్నాయి.

లోపల కొందరు ఆడవాళ్ళు అటూ ఇటూ తిరుగుతూ ఏర్పాట్లు చూస్తున్నారు.

బయట ఓ పోలీసు జీపు, కొందరు పోలీసులూ వున్నారు.

పదకొండు గంటలవుతుండగా ఆ ఇంటిముందు ఓ పాత తెల్ల ఎంబాసిడర్ కారు దడదడమనే శబ్దంతో వచ్చి ఆగింది. దాని మ్రోత వింటూనే భుజంగం,

నాగరాజు బయటకు పరుగెత్తుకుంటూ వచ్చారు.

వచ్చింది మాజీ ఎమ్మెల్యే... ఆ రోజు ఆ అనాథ శరణాలయానికి రిబ్బను కత్తిరించి ప్రారంభోత్సవం చేస్తున్నది ఆయనే.

భుజంగం వెనకాలే వచ్చిన ఇద్దరు స్త్రీలు కారు దిగుతున్న ఆయనకు నమస్కరిస్తూ ఆహ్వానసూచకంగా బొకే ఇచ్చారు.

తలుపుకు ఓ ఎర్ర రిబ్బను కట్టివున్నది.

ఆ ఇంట్లో వున్న అందరూ బయటకు వచ్చారు. తలుపు దగ్గర మాజీ ఎమ్మెల్యే, భుజంగం, నాగరాజు నిలబడ్డారు. వాళ్ళ పక్కగా ఓ అమ్మాయి ప్లేటులో పెద్ద కత్తెర పెట్టుకు నిలుచున్నది. మాజీ ఎమ్మెల్యేగారు ఆ కత్తెర తీసుకుని రిబ్బను కత్తిరిస్తుండగా ఆయనమీద పూలవర్షం కురిపించారు ఆ ఆడపిల్లలే కరతాళధ్వనుల నడుమ.

ఆయన ముందు లోపల అడుగు పెట్టటంతో, బయట వున్న మిగతా అందరూ లోపలకు వెళ్ళి షామియానా క్రింద వేసిన కుర్చీలల్లో కూర్చున్నారు. సభ ప్రారంభమయింది. భుజంగం ఆహ్వానించగా ఆ మాజీ ఎమ్మెల్యేగారు స్టేజీ ఎక్కి అందరికీ నమస్కరించాడు.

“సాయిరాంపురం చేసుకున్న అదృష్టం సంఘసేవ చేయాలనే అభిలాష వున్న భుజంగంలాంటి మంచి మనసున్న పెద్దవారు సర్పంచ్‌గా వుండటం...”

షామియానాలో కూర్చున్న అందరూ చప్పట్లు కొట్టారు.

“ఈ గ్రామంలో ఉండవలసిన వసతులన్నీ ఉన్నయి. పల్లె అయిన దీన్ని ఎంతో కష్టించి తీర్చిదిద్ది ఓ నగరంగా మార్చిన శక్తిమంతులు ఆయన. ఒకప్పుడు ఇక్కడ ఓ ప్రాథమిక పాఠశాలే వుండేది. హైస్కూలు చదువు కావాలంటే రోజూ మూడు మైళ్ళ దూరం నడిచి పక్క నగరానికి వెళ్ళవలసి వచ్చేది. అలాంటిది ఇప్పుడు ఈ ఊళ్ళో రెండు హైస్కూళ్ళు వచ్చినయ్యంటే అది వారి కృషే. ఊరుకు అన్నివైపులా ఏర్పడిన కర్మాగారాలు కొన్ని వందలమందికి ఉపాధి కలిగించినయి... ఎటుచూచినా పచ్చటి

పొలాలు... తోటలు... ఊరి ప్రజలకు ఆహ్లాదం కలిగించేందుకు రెండు సినిమా హాలులూ..."

మరోసారి జనంనుండి చప్పట్లు.

"ఆయన హృదయం నవనీతం. పురుష అహంకారంతో అణగారిపోతున్న స్త్రీలంటే ఆయనకు ఎంతో జాలి, దయ, కరుణ... తిండిలేక, కట్టుకునేందుకు సరైన బట్టలేక, నివసించేందుకు నీడలేక అధోగతిలో వున్న స్త్రీలను ఆదుకోవాలనే తపనతో ఆయన అహర్నిశలూ శ్రమిస్తున్నారు. అందులో  భాగంగానే ఇప్పుడు అలాంటి అభాగ్యుల ఉద్ధరణకోసం ఈ ఆశ్రమాన్ని స్వంత ఖర్చుతో ప్రారంభిస్తున్నారు.

ఎన్నాళ్ళబట్టో ఆలనా, పాలనా లేకుండా ఉప్పుచవుడు రాలుస్తున్న గోడలతో, కప్పుమీద పెంకులు ఎప్పుడు జారిపడతయ్యా అని భయంపుట్టించే  స్థితిలో వున్న ఈ ఇంటిని ఎంతో డబ్బు వెచ్చించి అందంగా తీర్చి దిద్దారు. ఎవరికీ పట్టని ఈ ఇంటిని ఆశ్రమానికి శాశ్వతంగా బదలాయించేలా చేయాలనేది ఆయన కోరిక. ఆయన నా దగ్గరకు వచ్చి ఎంతో వేదనతో ఆ విషయాన్ని చెప్పి, ప్రభుత్వం దీన్ని స్వాధీనం చేసుకుని, ఈ ఆశ్రమానికి ఉచితంగా దఖలు చేసేలా ఏర్పాటు చేయించమని కోరినప్పుడు, ఆయన మనస్సులోని ఆవేదనను గుర్తించి ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయకుండా, తప్పకుండా ప్రయత్నం చేస్తానని హామీ ఇచ్చాను.

మరల ఆ ఆవరణంతా చప్పట్లతో మారుమ్రోగిపోయింది.

వీరు చేస్తున్న మంచి పనులకు ఈ ఊరి ప్రజలంతా చేయూత నివ్వాలని నేను మనస్ఫూర్తిగా కోరుతున్నాను. దీని నిర్వహణకు నా వంతుగా ఐదువేల నూటపదహార్లు ఇస్తున్నాను. అలాగే మీ ఊరి ప్రజలు కూడా ముందుకు వస్తే ఆయన కోరిక దిగ్విజయంగా నెరవేరుతుంది.

మరో శుభవార్తకూడా. వీరి ఆధ్వర్యంలో ఎంతో వృద్ధిచెందిన ఈ పెద్ద గ్రామాన్ని ప్రభుత్వం పురపాలకసంఘంగా మారిస్తే ప్రజలకు ఎంతో మేలు జరుగుతుందనే ఆశతో దానికోసం ఆయన అహర్నిశలూ కృషిచేస్తున్నారు.  పెద్దలందరినీ కలుస్తున్నారు.

త్వరలోనే విజయం సాధిస్తారు కూడా. అందుకు కృతజ్ఞతగా మీరంతా ముందుకు వచ్చి, వారిని రాబోయే పురపాలక సంఘానికి చైర్మన్‌గా ఎన్నుకుంటే ఆయనకు ఈ ఊరికి మరింత సేవచేసే అవకాశం దక్కినట్లే.

ఇక్కడ ఒక ముఖ్య విషయం చెప్పకుండా ఉండలేకపోతున్నాను. భుజంగంగారు ఎంత నిస్వార్థులు, త్యాగి– అంటే ఇంత మంచి కార్యం నిర్వహిస్తూ కూడా ఇది బయట నలుగురికీ తెలిసి ఆయన్ను అభినందనల వెల్లువలో ముంచేస్తారనే భిడియంతో వీడియోగ్రాఫర్లనుకాని, పత్రికా విలేఖర్లనుగాని ఈ సభకు ఆహ్వానించలేదు. చేసిన పని చేతల్లోనే ఉండాలి కాని, దానికి అనవసరపు ప్రచారం అనవసరమనేది ఆయన భావన. అది ఎంత ఉదాత్తమయినదో, ఆయన ఎంత ఉన్నతుడో చెప్పటానికే ఆయనకు నేను ఇలా చెప్పటం ఇష్టం లేకబోయినా, ఉండబట్టలేక చెబుతున్నాను. ఆ మాట ఆయననుండి విన్నప్పుడు నేను ఎంతగానో ముగ్ధుడనయ్యాను. తను చేసే ఏ మంచిపనైనా తన ఊరి ప్రజలకు తెలిస్తే చాలని, ప్రపంచానికంతా తెలియాల్సిన అవసరం లేదన్నారు ఆయన. అంత గొప్ప మనిషిని నా రాజకీయ జీవితంలో నేనెన్నడూ చూడలేదు.

వారికీ, మీ గ్రామ ప్రజలందరికీ నా శుభాకాంక్షలు."

ఆకాశాన్నంటే కరతాళధ్వనుల నడుమ సభ ముగిసింది. ఆయన పక్కనే కూర్చున్న భుజంగంకు వేదిక వెనుకనుంచీ కొందరు స్త్రీలు వచ్చి పూలహారాలు వేసి, బొకేలు ఇచ్చి అభినందిస్తుంటే ఆయన ముకుళిత హస్తాలతో చిరునవ్వులు చిందిస్తూ లేచి నిలబడ్డాడు.

మరికొందరు ఆడవాళ్ళు వేడివేడి టిఫిన్లు ప్లేట్లలో పెట్టి తీసుకువచ్చి అక్కడున్న అందరికీ ఇవ్వడం మొదలుపెట్టారు.

సరిగ్గా ఆ సమయంలో ఎదురుగా వున్న కోదండరామస్వామి ఆలయ పూజారిగారు స్పీకర్‌లో మాజీ ఎమ్మెల్లేగారి మాటలు వింటూనే కంగారు పడిపోతూ, గుడికి తాళంవేసి, సైకిల్ తీసుకుని చక్రవర్తి దగ్గరకు బయల్దేరాడు.

మొట్టమొదటి సారి చక్రవర్తి ఆ ఇంట్లో కాలు పెట్టటం చూసి తనెలా

ఆపోహపడిందీ గుర్తుకు వచ్చినప్పుడల్లా ఆయన మనస్సు కలత చెందుతుంటుంది. తను అంతకు ముందు ఎన్నడూ రామబ్రహ్మంగారిని చూడకపోయినా తను ఈ గుడికి పూజారిగా వచ్చిన కొత్తల్లోనే ఆయన పేరు వినటం, చాలా మంది ఆ ఇల్లు అలా అవ్వటాన్ని బాధగా చెప్పటం విన్నాడు.

తను ఆపోహ పడ్డందుకు తరువాత చక్రవర్తి గుడికి వచ్చినప్పుడు క్షమాపణలు కూడా చెప్పుకున్నాడు.

ఆయన అక్కడ జరుగుతున్న తతంగాన్ని చూచి ఇక ఆగలేకపోయాడు అక్కడ వాళ్ళు చేయబోతున్న నిర్వాకమేమిటో అర్థమవ్వటంతో.

"ఏమిటి మా తాతగారి ఇంటిని మార్చేస్తున్నారా? పాతవాళ్ళు ఖాళీ చేశారా?" ఆత్రంగా అడిగాడు చక్రవర్తి ఆయన చెప్పిన మాట వింటూనే.

ఆ ఇల్లు తను కొనే ప్రయాత్నాన్ని ఇంతవరకూ ఆ ఊళ్లో ఎవరికీ చెప్పలేదు. పూర్ణచంద్రరావుగారికి, తనకే తెలుసు ఆ విషయం.

"ఏమీ మారలేదు... తెల్లటి కల్లును గాజుగ్లాసులోపోసి పాలుగా అమ్మాలని ప్రయత్నం అది!" అన్నాడు ఆయన చికాగ్గా. "ఇంతకు ముందు ఆ ఇంట్లో ఇద్దరో ముగ్గురో ఉండేవాళ్ళు... ఇప్పుడు శరణాలయం అయిందిగదా ఎంతమందయినా జేరవచ్చు... కొనుగోలు దార్లను బట్టే అమ్మకాలుగూడా!"

ఒళ్ళు కుతకుతలాడిపోయింది చక్రవర్తికి.

* * *

ఉదయం ఎనిమిది గంటలయింది. మాణిక్యం ఇంటి హాల్లో భుజంగమూ, నాగరాజు కూర్చుని వున్నారు.

భుజంగం చేతులో ఆ రోజు వార్తాపత్రిక వున్నది. అందులో మధ్య పేజీల్లో ప్రచురించిన ఫొటోను, దాని క్రిందగా వ్రాసిన వార్తను, కళ్ళనుండి నిప్పులు కురిపిస్తూ చూస్తున్నారు ముగ్గురూ.

అందులో ఇలా వున్నది;

సాయీరాంపురంలో ఆ ఊరి సర్పంచ్ భుజంగంగారు 'అభాగ్య స్త్రీల' కోసం ఓ 'అనాథ స్త్రీ శరణాలయం' స్థాపించారు. దాన్ని మాజీ ఎమ్మెల్లే గారు రిబ్బను కత్తిరించి ప్రారంభించారు. అది స్థాపించిన వారి ఉద్దేశ్యం ఎంతో ఉన్నతమైనదే అయినా, ఆ ఇంట ఉండబోయే స్త్రీల ముఖాలు చూస్తే వాళ్ళు అనాథల్లా కనబడటం లేదని, వారి తళుకుబెళుకులు సంస్థ ఆశయాలకు అనుగుణంగా ఉన్నట్లుగా లేవని ఆ ఊరి ప్రజలు చెవులు కొరుక్కుంటున్నారు. అనాథ స్త్రీలు పెదవులకు లిప్‌స్టిక్‌లు పూసుకోగూడదని ఎక్కడా లేదుగాని, అలా తయారయిన ఆ స్త్రీలను చూసి ప్రజలు గుసగుసలాడుకుంటూ నవ్వుకుంటున్నారనేది దాని స్థాపకులు గుర్తించి సరిచేసుకుంటే వారి ఆశయం సిద్ధిస్తుందేమో?'

**కొసమెరుపు:** సాయీరాంపురంలో మోహినీ మహల్ పేరుతో ఇంతవరకూ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీగా నడిచిన వ్యభిచార గృహాన్ని ఇప్పుడు పబ్లిక్ లిమిటెడ్ కంపెనీగా మార్చారని పేరు చెప్పటానికి ఇష్టపడని కొందరు ఊరి పెద్దలు ఉవాచ!

"నేను ముందే చెప్పాను, వీడియో తీయించవద్దూ, పేపరోళ్ళను పిలవొద్దూ అని!" మాణిక్యం గంయ్‌మన్నది.

"మేం ఎవర్నీ పిలవలేదే అక్కా! అయినా ఈ వార్తా, ఫొటో పేపర్లో ఎలా వచ్చినయ్యో అర్థమే కావటంలేదు!"

భుజంగం మొహమూ జేవురించి వున్నది.

"ఈ సెల్‌ఫోన్లు వచ్చింతరువాత రహస్యమంటూ లేకుండా పోయింది... ఏ దౌర్భాగ్యుడు దీన్ని తీశాడో అర్థం కావటంలేదు... అప్పటికీ మనవాళ్ళందరికీ చెప్పివుంచాను ఎవరైనా ఫొటోలు తీస్తుంటే కనిపెట్టి వుండండిరా అని!" రోషంగా అన్నాడు నాగరాజే మళ్ళా. "మనవాళ్ళని వెంటనే ఆ పనిమీద పెట్టి, ఆ దరిద్రుడిని పట్టుకున్న మరుక్షణమే చిటికేసేస్తాను!"

"దొరికినవాళ్ళంతా దద్దమ్మలు... ఒక్కపనీ సవ్యంగా చేసి చావలేరు!" మాణిక్యం నోరు మూతపడటమే లేదు.

* * *

రాత్రి పదిగంటలప్పుడు హాల్లో వున్న ఫోన్ మ్రోగుతుంటే అప్పుడే పడుకోబోతున్న పూర్ణచంద్రరావుగారు లేచి వెళ్ళి రిసీవరెత్తారు.

"నమస్కారమండి! నేను విజయవాడనుండి ప్రకాశరావుని మాట్లాడుతున్నాను!"

"నమస్కారమండి... చెప్పండి!"

"చక్రవర్తిగారికిచ్చిన జీపీఏను అనివార్య కారణాల వల్ల రద్దు చేసుకోవాల్సి వస్తోంది... నన్ను మన్నించాలి!"

"అదేంవిటి? ఎందుకని?" ఆయన మాట వింటూనే ఉలిక్కిపడ్డట్లుగా ముందుకు వంగాడు. చేయి రిసీవర్ చుట్టూ బిగుసుకుపోయింది.

"మా ఇంట్లో వాళ్ళు ఒప్పుకోవటం లేదండి!" అన్నాడు నసుగుతున్నట్లుగా.

పూర్ణచంద్రరావుగారికి ఆయన మాట వింతగా తోచింది.

"వాళ్ళకు తెలియకుండానే మీరు చక్రవర్తికి జీపీఏ ఇచ్చారా?"

"అప్పుడు ఏ కళనున్నారో సరే అన్నారు... ఇప్పుడేమో రాష్ట్ర రాజధానే మనకు దగ్గరగా వచ్చేస్తోంది... దాంతో ఆ ఇల్లు బంగారపు బిళ్ళతో సమానం... అమ్మటానికి వీల్లేదు అంటున్నారు!"

"రాజధాని సంగతి కొత్త వార్తేం కాదుగదా... రాష్ట్రం విడిపోతే గుంటూరు విజయవాడలకు దగ్గరలోనే వస్తుందని ఎప్పటినుంచో అనుకుంటున్నారు... మీరు జీపీఏ ఇచ్చిన రోజున కూడా అదే మాట విన్నాం!"

"పూర్ణచంద్రరావుగారూ! దయయుంచి నా మాట వినండి... మా వాళ్ళ ఇష్టపడనప్పుడు నేనేమీ చేయలేను... మీరు నన్ను మరో విధంగా తలచవద్దు...

దాన్ని మాత్రం ఇప్పుడు ఎట్టి పరిస్థితులలోనూ అమ్మను... జీపీఏను రద్దుచేసుకుందాం!"

ఆయన మాటలకు పూర్ణచంద్రరావుగారికి కోపమొచ్చింది. "అదేంవిటండీ అలా ఎలా వీలవుతుంది... ఇద్దరు పెద్దమనుష్యుల మధ్య కుదిరిన ఒప్పందాన్ని రద్దు చేయాలన్నా ఇద్దరికీ అంగీకారమవ్వాలి గదా... ఆపైన చక్రవర్తిగారినుండి మీరు లక్ష రూపాయలు ఎడ్వాన్సు తీసుకున్నారు... ఈ విషయంలో మనం లాయరుతో సంప్రదించి నిర్ణయం తీసుకోవాల్సి వుంటుంది!" పూర్ణచంద్రరావుగారు అసహనంగా అన్నారు. "చూడండి ప్రకాశరావు గారూ! మాట తప్పటం అంత తేలిక కాదు, మంచిదీ కాదు, అందునా కాగితాలమీద రాసుకుని దాన్ని రిజిస్టర్ చేయించిన తరువాత... చక్రవర్తిగారేమో తన పూర్వీకుల ఇల్లు కొనుక్కోవాలని తహతహ లాడుతున్నారు... అసలు అది కొనే విషయంలోనే ఎన్ని ఇబ్బందులున్నయ్యో తెలిసి కూడా ఆయన ముందుకు దూకాడు అంటే వారికి ఆ ఇంటిమీద ఎంత ఆత్మీయత వున్నదో అర్థంచేసుకోండి... ఒప్పందం కుదిరిన రోజున ఆయన కొంటానన్నందుకు మీరు ఎంతగానో సంతోషించారు... ఇప్పుడు ఇలా పేచీపెడితే ఎలా... ఇంకా డబ్బుకావాలనుకుంటే చెప్పండి... అది సమంజసం కాకపోయినా నేను నా ప్రయత్నం చేస్తాను!"

"కాదులేండి... కాదులేండి... ఇంట్లోవాళ్ళు అసలు అమ్మకానికే ఒప్పుకోవటం లేదని చెప్పానుగదా!" ఆయన మాటల్లో తడబాటే కాకుండా, కొద్ది విసుగూ ధ్వనించింది.

"నిజం చెప్పండి... మిమ్మల్ని నాగరాజు బెదిరిస్తున్నాడా?" కాస్త కంఠం హెచ్చించి అడిగాడు పూర్ణచంద్రరావుగారు.

"అబ్బెబ్బే అదేం లేదు... అసలు మన మధ్య ఈ ఒప్పందం ఉన్నట్లుగా మరోమనిషికి తెలియనే తెలియదుగదా!" చిరాగ్గా అన్నాడు.

"భుజంగంలాంటి వాళ్ళకు మనం ఎంత రహస్యంగా వుంచినా తెలుసుకోవటం కష్టమేం కాదులేండి... వాళ్ళ వేగులు వాళ్ళకుంటారు ... రహస్యాలను వెలికి తీయటంలో వాళ్ళు నిష్ణాతులు... మీరు మనసులోని మాటను నిజాయితీగా చెబితే, మేం కన్విన్స్

అయితే తప్పకుండా ఒప్పందాన్ని రద్దు చేసుకోవటానికి అంగీకరిస్తాం... లేదంటే అమలుచేసి తీరాల్సిందే... ఇక్కడ చక్రవర్తిగారి ప్రసక్తి తీసేయండి... మీకేం మీరు ఎక్కడో పట్నంలో దూరంగా వున్నారు... ఊరి మధ్యలోవున్న ఆ దరిద్రాన్ని మేం భరించలేకుండా ఉన్నాం... చక్రవర్తిగారయితే ఊరి పెద్దలనందరినీ కూడగట్టుకునయినా పోరాటం సాగించి ఆ ఇంటిని ఖాళీ చేయించి, దానికి పూర్వపు వైభవాన్ని తీసుకు రావాలని ఆరాటపడుతున్నారు!" పూర్ణచంద్రరావుగారు ఫోన్ పెట్టేశారు.

ప్రకాశరావు నిర్ణయానికి ఆయన మనస్సు ఎంతగానో వికలమయింది.

ప్రకాశరావు మాట తీరు చూస్తుంటే నాగరాజు భయపెట్టినట్లే వున్నాడు.

ఆ ఇల్లు అనాథ స్త్రీ శరణాలయంగా మార్చటంలోనే భుజంగం ఏదో కొత్త ఎత్తు వేస్తున్నట్లుగా అర్థమవుతోంది!

* * *

రాత్రి తొమ్మిది గంటలప్పుడు పూర్ణచంద్రరావుగారింటికి వచ్చారు చక్రవర్తి, భ్రమర. అప్పటికే ఆంజనేయులు అక్కడ ఉన్నాడు.

కారణాలు వేరైనా, వాళ్ళ ముగ్గురికీ శత్రువు ఒకడే అని తెలిసిపోవటంతో ఇక ముందు ఏం చేసినా కలిసి ఆలోచించి చేయాలనే నిర్ణయానికి వచ్చారు.

"నేను మాత్రం ఎట్టి పరిస్థితులలోనూ వాడికి నా తోటను ధారాదత్తం చేసే ప్రసక్తే లేదు... నేను ఆంజనేయుల్ని, రామభక్తుణ్ణి... ఇతరులది ఒక్క పైసా ఆశించను... నాది ఒక్క పైసా మరొకరికి ఇవ్వను!" అతడి కళ్ళు ఎర్రగా మండిపోతున్నాయి తన తోట విషయంలో నాగరాజు మాటలు గుర్తుకు వస్తుండటంతో.

పూర్ణచంద్రరావుగారు అనునయంగా చూశాడు అతడి వంక.

"ఆవేశం ఎప్పుడూ అనర్థానికే దారి తీస్తుంది... ఏదైనా ఇలాంటి విషయాలల్లో జాగ్రత్తగా ఆలోచించి చేస్తేనే విజయం సాధించగలిగేది... పేపర్లో మొన్న వచ్చిన అనాధాశ్రమం ప్రారంభోత్సవ ఫొటో ఎవరు తీశారో తెలియాలి. వాళ్ళ దగ్గరే ఇంకా

కొన్ని ఉండివుంటయి. వాటి ఒరిజనల్స్ మనం సంపాదించి లాయరుకు ఇవ్వగలిగితే వాళ్ళను అణగదొక్కేందుకు ఏం చేయాలో ఆయనే చేస్తాడు!"

ఆంజనేయులు పకపకా నవ్వాడు. జేబులోనుంచి ఒక కవరు తీసి పూర్ణచంద్రరావుగారికి ఇస్తూ, "ఇవుగోండి ఆనాడు తీసిన ఫొటోలు... పాతిక దాకా వున్నయి... కొద్దిగా కష్టపడాలేగాని అందులో వున్న ఆడపిల్లల్ని ఎక్కడెక్కడినుంచి పట్టుకువచ్చింది కనిపెట్టవచ్చు... వాళ్ళ ముఖాలకు అనాథలనే ముసుగువేసి ఈ వెధవలు నాటకమాడుతున్నారు!"

"ఎక్కడ దొరికినయి మీకు ఇవి!"

"చెప్పానుగదా నేను ఆంజనేయుల్నని... సప్తసముద్రాల అవతలున్న సంజీవినీ పర్వతాన్నే మోసుకువచ్చిన వాడిని!" అన్నాడు తేలిగ్గా నవ్వుతూ. "నా దార్లు నాకున్నయి... ఆరోజు ఆ ఇంట జరిగే ఫంక్షన్ ఎలాంటిదో నేను ముందే ఊహించాను. ఎవరూ గుర్తు పట్టకుండా మరో ఊరి మనుష్యుల్ని ఇద్దర్ని మాజీ ఎమ్మెల్యే వెనకనే లోపలకు పంపించాను... అక్కడ కాపలా వున్న వాళ్ళంతా వీళ్ళుకూడా ఆయన మనుష్యులే అనుకున్నారు. వాళ్ళ సెల్‌ఫోన్స్‌లో తీసినవే ఆ ఫొటోలు! వీటిని పోలీసులకు ఇచ్చి ఆ పిల్లల వెనుకా ముందూ అంతా తెలుసుకునేలా చేయాలి!... దాంతో ఆ వెధవలు నా తోటనే కాదు, ఈ ఊరునే వదిలి పారిపోతారు!" అన్నాడు కసిగా ఆంజనేయులు.

శనివారం మధ్యాహ్నం స్కూలు అయిపోగానే గుంటూరు లాయరుగారు పూర్ణచంద్రరావుగారికి ఇచ్చిన టైంకు ఆయన దగ్గర ఉండేలా నలుగురూ కలిసి బయల్దేరారు.

అక్కడ పని పూర్తవ్వగానే హైదరాబాద్ వెళ్ళాలనేది చక్రవర్తి ఆలోచన. సోమ, మంగళవారాలు స్కూలుకు శెలవు.అవ్వటం, ఫోన్‌లో పదేపదే తల్లి రమ్మనమని చెబుతుండటంతో ఆ ప్రోగ్రాం పెట్టుకున్నాడు.

అందరూ ఆయన గదిలో కూర్చున్నారు. రఘురాం కూడా వాళ్ళతో పాటు వచ్చి కూర్చున్నాడు.

"భ్రమర విషయంలో మాచర్ల వెళ్ళి ఆమె నాన్నను చంపినందుకు శిక్ష అనుభవించిన ట్రాక్టర్ డ్రైవర్‌ను కలిసి మాట్లాడి వచ్చాం... నిజానికి అతడు కాదు ఆ యాక్సిడెంట్‌చేసి మా బాబాయిని చంపింది... అయినా భుజంగం, నాగరాజుల ఒత్తిడితో ఆ నేరాన్ని తన నెత్తిన వేసుకుని శిక్ష అనుభవించినట్లుగా చెప్పాడు!"

"అసలు చేసింది ఎవరుటా?"

"అతడికీ ఖచ్చితంగా తెలియదు... చదువుకుంటున్న ఎవరో బంధువుల పిల్లవాడి పొరబాటు వలన జరిగింది, అది బయుటకు వస్తే వాడి జీవితం నాశనమయిపోతుంది... ఎలాగైనా వాడిని రక్షించాలి అంటూ భుజంగం ప్రాధేయబడితే తప్పక ఆ పని చేయాల్సి వచ్చిందని చెప్పాడు అతడు... కానీ తరువాత తరువాత విన్న మాటలతో ఆ యాక్సిడెంట్ చేసింది నాగరాజే అయివుంటాడనేది అతడి అనుమానం!"

"కేసును మళ్ళీ రీఓపెన్ చేయించవచ్చా, సార్!"

"క్రిమినల్ కేసుగదా... చేయించవచ్చు... కానీ మనకు ఆ విషయంలో బలమైన సాక్ష్యాలు కావాల్సి వుంటుంది!"

"డ్రైవర్ చెప్పిందే మనకు సాక్ష్యం!" భ్రమర అన్నది.

"అతడు వచ్చి బోనులో నిలబడి ఆ మాటలు చెబుతాడా?" ఆయన అడిగాడు.

కొద్దిక్షణాలపాటు అక్కడ నిశ్శబ్దమేర్పడింది.

"అతడు రాడండి... ఇప్పటికే నానా ఇబ్బందులూ పడ్డాడు... రావటమంటూ జరిగితే వీళ్ళు వాడిని చంపినా చంపేస్తారు!" అన్నది భ్రమర దిగులుగా. "వాళ్ళు మా నాన్నను కావాలనే చంపారనేది నిజం... ఆ మాట తలచుకుంటేనే నా ఒళ్ళు భగభగా మండిపోతోంది... వాడిని కోర్టుకు లాగి ఎలాగైనా కక్ష తీర్చుకోవాలన్నదే నా కోరిక!"

లాయరు నవ్వాడు. "సరైన ఋజువులు లేకుండా మనం కోర్టు తలుపు తట్టలేం... కక్ష తీర్చుకోవటానికే కేసు పెడుతున్నామంటే న్యాయస్థానం అంగీకరించదు!"

"అయితే వాళ్ళను అలా వదిలేయటమేనా?" ఆమె కంఠం దుఃఖంతో జీరబోయింది.

"చూద్దాం... ఇంకేదయినా గట్టి ఋజువు దొరుకుతుందేమో ప్రయత్నించాలి!" ఆయనా ఆలోచిస్తూ ఉండిపోయారు.

"చక్రవర్తి తాతగారి ఇంటివిషయంలో ఇంతకు ముందే వివరంగా చెప్పాను... కలెక్టర్‌గారితో మాట్లాడతానన్నావు కదా మాట్లాడావా?" పూర్ణచంద్రరావుగారు అడిగారు.

"లేదు... స్పష్టమయిన ఋజువులతో ఆయన దగ్గరకు వెళితేనే బాగుంటుందని ఆగాను... మీరు చెప్పేవన్నీ నిజాలే అయినా సరైన సాక్ష్యాధారాలు లేకుండా విజయం సాధించలేం... దాంతో వాళ్ళు మరింత రెచ్చిపోతారు!"

"ఇప్పుడది మోహినీ మహల్ కాదు... అనాథ స్త్రీ ఆశ్రమం!" అన్నాడు నవ్వుతూ. "ఇవుగో మొన్న దాని ప్రారంభోత్సవంనాటి ఫొటోలు... అందులో వున్నది అందరూ ఒకప్పటి వ్యభిచారుణులే అయివుంటారనేది మా అందరి అనుమానం... చాలా తెలివిగా చేశాడు... ఒకనాటి అలాంటి వాళ్ళను ఆదుకుని సభ్యసమాజంలోని వ్యక్తులుగా తీసుకు రావటానికే ఈ ఆశ్రమాన్ని స్థాపించానని డబ్బా కొట్టుకునేటందుకు ఎత్తు వేశాడు... ఎవరూ ఉపయోగించని ఆ ఇంటిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుని తమకు ఉచితంగా ఇవ్వాలనే ప్రతిపాదననూ ఆ మాజీ ఎమ్మెల్లేముందు పెట్టాడు... ఆ ఇంటి యజమానికీ ఏం చెప్పాడో తెలియదు చక్రవర్తిగారికిచ్చిన జీపీఏను రద్దుచేసుకుంటానంటూ ఫోన్ చేశాడు విజయవాడనుంచి ఆయన!"

"కారణం ఏమిటంటాడు?"

"ఇప్పుడు ఇంట్లోవాళ్ళు ఒప్పుకోవటం లేదట... అది వ్రాసుకున్న రోజున వారి అంగీకారంతోటే చేశాడు... ఇప్పుడు ఇక్కడ రాజధాని వస్తున్నదిట గదా ఇంటి విలువ బాగా పెరిగిపోయింది మనమే ఉంచుకుందాం అంటున్నారట వాళ్ళు... అదంతా శుద్ధ అబద్ధం... వీళ్ళే ఆయన్ను బెదిరించివుంటారు!"

రఘురాం అన్నాడు. "సాయీరాంపురంలో పెద్దల్ని కొందరిని మనం కూడగట్టుకుంటే వాళ్ళను అడ్డుకోగలుగుతామేమో?"

"అది మంచి ఆలోచనే కాని... ఎవరైనా అలాంటి దుష్టులకు ఎదురు తరిగి మనకు అండగా నిలబడతారా అని... వాళ్ళంత క్రూరులు మరొకరు ఉండరని అందరికీ తెలిసిన విషయమే!" పూర్ణచంద్రరావుగారు అన్నారు.

"త్వరలోనే సాయీరాంపురాన్ని మున్సిపాలిటీగా చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నదని తెలిసింది... అదయితే మళ్ళా ఎలక్షన్లు వస్తయిగదా... అప్పుడు వీళ్ళ పదవి ఊడిగొట్టేలా చేయాలి!" ఆంజనేయులు కసిగా అన్నాడు.

"అలా కాకపోయినా సర్పంచిగానయినా ఎన్నుకోబడకుండా చూడవచ్చుగదా... దానివలన మన సమస్య తీరుతుందని నేను అనుకోను!" లాయరుగారు అన్నారు వాళ్ళనే చూస్తూ.

"నా తోట విషయంలోనూ నన్ను అన్నివిధాలా బెదిరిస్తున్నాడు నాగరాజు... నేను లొంగకపోవటంతో అక్కడికి దగ్గరలోనే వున్న నా పొలంలో పంటనంతా రాత్రికిరాత్రే నాశనం చేయించాడు!" అన్నాడు తలవంచుకుని ఆంజనేయులు.

తరువాత గంటవరకూ వివిధ రకాలుగా ఆలోచిస్తూనే వున్నారు వాళ్ళను ఎలా కట్టడి చేయగలుగుతామా అన్నట్లుగా.

"ఇక్కడ ఇంకో గమ్మత్తు విషయం చెప్పమంటారా?" ఆంజనేయులు నవ్వుతూ అడిగాడు. "ఆ ఇంటికి వచ్చే విటులకు డబ్బు తీసుకుని రసీదు ఇస్తానంటాడట అవతారం!"

"అతడెవరు?" లాయరు అడిగాడు.

"ఆ అనాథాశ్రమాన్ని నిర్వహిస్తున్నాడులేండి... బహు చతురుడు!"

ఉలిక్కిపడ్డట్లుగా అందరూ అతడివంక చూచారు.

"అనాథ స్త్రీ శరణాలయానికి డొనేషన్ ఇచ్చినట్లుగా ఉంటుంది ఆ రసీదు!... చాలామంది తమ పేరు మీద రసీదు రాస్తే ఎక్కడ బయటపడతావోనని తీసుకోవటంలేదు... ఒకడు కావాలని రాయించి నాకు తెచ్చి ఇచ్చాడు... ఇదుగోండి!"

* * *

బుధవారం... ఉదయం ఏడు గంటలయింది. ఆకాశం బాగా మబ్బులు పట్టి వుండటమే కాకుండా సన్నగా జల్లుగూడా పడుతోంది.

హైదరాబాద్‌నుంచి తెల్లవారుజామున ఐదు గంటలకు రావాల్సిన బస్సు రెండు గంటలు లేటుగా వచ్చింది. ఈదురుగాలితో కూడిన వాన కురుస్తుండటంతో చాలా చిన్నగా వచ్చాడు డ్రైవరు. ఆ వాన థాటికి మధ్యలో చిన్నచిన్న వాగులన్నీ పొంగిపోతూ ఎక్కడ రోడ్డు తెగిందో కూడా తెలియనంత ఇబ్బందిగా మారింది ఆ ప్రయాణం.

తల్లి పదేపదే రమ్మనమనటంతో రెండు రోజులు శెలవు కలిసి వచ్చిందిగదా అని హైదరాబాద్ వెళ్ళాడు చక్రవర్తి. అతడూ తల్లిదండ్రులకు దూరంగా ఇన్నాళ్ళు ఎప్పుడూ ఎక్కడా ఉండలేదు.

అక్కడకు వెళ్ళగానే తండ్రి అడిగాడు. "ఇంటి సంగతి ఏమైంది?" అంటూ.

"అద్దెకున్నవాళ్ళు ఇంకా ఖాళీ చేయలేదు నాన్నా! అది ఖాళీ అయిం తరువాతే, రిజిస్ట్రేషన్ పెట్టుకుంటే ఇంటిని వెంటనే మనం స్వాధీనంలోకి తీసుకుని చిన్నచిన్న రిపేర్లు చేయించి, రంగులేయించుకోవచ్చు... అద్దెకున్నవాళ్ళేమో ఇంకా ఇల్లు దొరకలేదండీ అంటూ నాన్చుతున్నారు... ఆ తలనెప్పి మనకెందుకు... మనం తొందరపడాల్సిందేమున్నది... ఆగుదాం!" అన్నాడు అటూ ఇటూ కాకుండా.

"అదే మంచి పద్ధతి!" తండ్రికూడా అదే అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తున్నట్లుగా తల ఊపాడు.

ఏడవుతున్నా, వాన జోరు తగ్గినా ఇంకా చిరుజల్లు పడుతూనే ఉన్నది. తొమ్మిది గంటలకు స్కూలు తెరిచేలోగా సాయీరాంపురం జేరాలి.

విజయవాడ బస్టాండులో గుంటూరు వెళ్ళే పాసింజరు బస్సు కోసం ఎదురుచూడసాగాడు.

సరిగ్గా ఆ ప్లాట్‌ఫాం మీదకు వచ్చేటప్పటికి అక్కడ భ్రమర కూడా బస్సుకోసం ఎదురుచూస్తూ కనబడింది. చల్లటిగాలికి ఆచ్ఛాదనగా చీరచెంగును తలమీద కప్పుకున్నది. ఆమె శనివారం రాత్రి ఏలూరు వెళ్ళి, బుధవారం తెల్లవారుజామునే మొదటి బస్సులో విజయవాడకు వచ్చింది.

ఒకళ్ళను చూసి ఒకళ్ళు పలకరింపుగా నవ్వుకున్నారు.

"రోడ్లన్నీ అధ్వాన్నంగా ఉన్నయి... ఇంతగా వానలు వస్తయ్యని వెళ్ళేటప్పుడు ఊహించలేదు!" అన్నాడు చక్రవర్తి.

"నా పనీ అలాగే వున్నది... అమ్మ ఈ వానలో వెళ్ళొద్దంటుంది... ఇది ఎప్పటికి తగ్గేనో, ఇంకా పెరిగితే మరీ ఇబ్బందవుతుందని మొండిగా బయల్దేరాను... ద్వారకా తిరుమలకు వెళ్ళి వెంకటేశ్వరస్వామిని నిన్న దర్శించుకోవాలని అనుకున్నాను గాని ఈ వాతావరణంలో వెళ్ళలేకపోయాను!"

ఎర్రబస్సు వచ్చి ప్లాట్‌ఫాం దగ్గర ఆగుతుండగానే ఇద్దరూ దాన్ని ఎక్కేందుకుగాను ముందుకు అడుగులు వేస్తుండగా, "ఏఁవిటీ... ఏదో హనీమూన్ ట్రిప్ వేసినట్లున్నారు!" అన్నమాట వింటూనే ఇద్దరూ ఒకేసారి ఉలిక్కిపడ్డట్లుగా వెనక్కు తిరిగారు.

సోమశేఖరం నవ్వుతూ వాళ్ళ వెనగ్గా నిల్చొని వున్నాడు!

అతడి మాట తీరు, అతడి నవ్వు ఇద్దరినీ ఉక్కిరిబిక్కిరి చేసింది. భ్రమరకయితే ఒళ్ళు మండింది.

"ఏఏ ఊళ్ళు చూసి వస్తున్నారో చెప్పండి...!" అన్నాడు మరింత ఎగతాళిగా సోమశేఖరం, చక్రవర్తిని ఈర్ష్యగా చూస్తూ.

చక్రవర్తి నవ్వేశాడు. "మొన్నరాత్రి ఫ్లయిట్‌లో చెన్నయ్ వెళ్ళాం... అక్కడ కారు ఒకటి మాట్లాడుకుని మధుర మీనాక్షిని దర్శించుకుని, కొడై వెళ్ళి ఒకరోజు ఉండి

చెన్నయ్ వచ్చి మళ్ళా విమానంలోనే గన్నవరంలో దిగి, ఇదుగో మన ఊరు వెళ్ళటానికి ఎర్రబస్సుకోసం ఇక్కడకు వచ్చాం!... అనుకోకుండా మాకా ఆలోచన వచ్చి వెళ్ళాం గాని లేకపోతే మిమ్మల్ని కూడా తీసుకువెళ్ళే వాళ్ళం!" అన్నాడు అతడినే చూస్తూ కొంటెగా నవ్వి.

సోమశేఖరంకు అర్థమయింది అతడి మాటల్లోని ఎగతాళి. ముఖానికి గంటుపెట్టుకున్నాడు.

భ్రమర కోపాన్ని నిగ్రహించుకోలేకపోయింది. "సోమశేఖరంగారు! ఇది వరకు మీకు చాలాసార్లు వార్నింగ్ ఇచ్చాను నా జోలికి రావద్దంటూ... మీరెంత భుజంగంకు తొత్తులయినా నా జోలికి వస్తే మాత్రం ఊరుకోను... చక్రవర్తిగారు హైదరాబాద్‌నుంచి వస్తున్నారు, నేను ఏలూరు మా ఇంటికి వెళ్ళి వస్తున్నాను... అలాంటి మమ్మల్ని ఈ బస్టాండులో చూసి అసభ్యంగా కుంటి కూతలు కూస్తారా?... నేను అసలే మంచిదాన్ని కాదు... మీకు తెలుసో తెలియదో మన జిల్లా పోలీసు సూపరింటెండెంట్ మా మామయ్యే... ఒక్క మాట చెప్పానంటే మీకు చిప్పకూడే గతవుతుంది... జాగ్రత్త!" అన్నది బస్సులో తన ముందు సీట్లో కూర్చున్న అతడికే వినబడేలా ముందుకు వంగి.

జనం అంతగా లేరు. చక్రవర్తి రెండు సీట్ల అవతల కిటికీ పక్కగా కూర్చున్నాడు అద్దం లాగి– సోమశేఖరం వాగుడుకు ఎలా అడ్డుకట్ట వేయాలా అన్నట్లుగా ఆలోచిస్తూ.

* * *

సాయంత్రం అయిదు గంటలకు స్కూలు అయిపోయింతరువాత అలవాటుగా హెడ్మాస్టర్‌గారికి చెప్పివెళ్ళేందుకుగాను ఆయన గదిలోకి వెళ్ళాడు చక్రవర్తి. అప్పటికే అక్కడవున్న సోమశేఖరాన్ని చూస్తూ ముఖం చిట్లించాడు.

అతడి మూలంగానే తనూ భ్రమరా దేశమంతా చుట్టివచ్చినట్లుగా నలుగురూ చెవులు కొరుక్కోవటం మహా అసహ్యం కలిగిస్తోంది. భ్రమరయితే విజయవాడ బస్టాండులోనే దులిపేసింది. అయినా చర్మం మందమవ్వడంతో భ్రమర కనబడితే నవ్వుతూనే పలకరిస్తున్నాడు. చక్రవర్తి అయితే అతడితో మాట్లాడటానికి ఏమాత్రం

చొరవ చూపించటంలేదు. అతడు మాట్లాడించినా ముక్తసరిగా సమాధానం చెప్పి ఊరుకుంటున్నాడు.

నిన్న భ్రమర చెప్పింది. "సోమశేఖరంగాడు ఏడుపు మొహం పెట్టాడు... నేనో రస్సా ఇచ్చానుగదా ఎస్పీ మా మామయ్యేనని... అదేంటండీ ఇక్కడ ఉన్నాయన బెంగాలీటగదా మీ మామయ్య ఎలా అయ్యాడు అంటూ... నేను వెంటనే గొంతు పెంచేసి, 'తెలియకపోతే తెలియనట్లుండు... అంతేగాని పిచ్చివాగుడు వాగవద్దు... నేను మీతో చెప్పిన మరునాడే ఆయన రిలీవ్ అయి వెళ్ళిపోతే ఈ బెంగాలీ ఆయన వచ్చాడు' అన్నాను... అంటే నేనన్నమాటను భుజంగానికి చేరవేశాడన్నమాట!"

చక్రవర్తిని చూస్తూనే సోమశేఖరం లేచాడు 'వెళతానండీ' అంటూ.

"నేనూ వస్తానండి!" అన్నాడు చక్రవర్తి పూర్ణచంద్రరావుగారితో.

"ఒక్క అయిదు నిముషాలు కూర్చో... వెళదాం!" అంటూనే ఒక్కక్షణమాగి, "నువ్వు మాయింటికి ఈ రాత్రికి భోజనానికి రావాలి!" అన్నాడు సోమశేఖరం వెళ్ళింతరువాత.

"ప్రత్యేకత ఏమైనా వున్నదా?" కూర్చుంటూ అడిగాడు.

"భోజనం అంటే భోజనం కాదు... ఇవాళ గురువారం కదా... మా ఆవిడ పెసరట్లు చేస్తానన్నది... ఆవిడగారు వెన్నరాసి పెసరట్లను అద్భుతంగా చేస్తుందిలే... ఆలాంటి రోజున ఓ అతిథిని ఆహ్వానించటం నాకు అలవాటే!"

"తప్పకుండా వస్తాను... నాకూ పెసరట్లంటే ఇష్టమే! మా అమ్మగూడా చాలా రుచిగా చేస్తుంది... అవునూ... నేనొక్కడినేనా? ఇంకా ఎవరైనా ఉన్నారా?" నవ్వుతూ అడిగాడు చక్రవర్తి, సోమశేఖరాన్ని కూడా పిలిచాడేమో అన్న అనుమానం రాగా.

"నువ్వొక్కడివే... అందునా చేతులు కాల్చుకుండే వాళ్ళనే నేను పిలిచేది... ఒకటి గుర్తుంచుకోవయ్యా చక్రవర్తీ! చిన్నవయినా ఇలాంటి కోరికలు తీరాలీ అంటే వెంటనే పెళ్ళి చేసుకోవాలి... ఇంటికి సౌభాగ్యం ఇల్లాలేగదా... ఎన్నాళ్ళీ

నలభీమపాకం!"

– అంటే ఇప్పుడు ఈయన పెసరట్లు తినటానికంటూ పిలవటం మూడు రోజులబట్టీ సోమశేఖరం ధర్మమా అని స్కూలు వరండాల్లో టీచర్ల నడుమ నానుతున్న వదంతులకు పర్యవసానం కాదుగదా!

అతడు రోజూ సాయంత్రంపూట స్నానంచేసి కోదండరామస్వామి మందిరానికి వెళ్ళటం, స్వామిని దర్శించుకుని, పూజారిగారితో ఓ అరగంట పిచ్చాపాటీ మాట్లాడటం, అలాగే వస్తూ పోతూ ఒకచూపు తన తాతగారి ఇంటిమీద వేయటం అలవాటుగా చేసుకున్నాడు.

ఎనిమిది గంటలవుతుండగా పూర్ణచంద్రరావుగారింటికి వెళ్ళాడు చక్రవర్తి.

చక్రవర్తిని చూస్తూనే, "సరస్వతీ! మాష్టారు వచ్చారు... మంచినీళ్ళిచ్చి ఇక నువ్వు నీ కార్యక్రమాన్ని మొదలుపెట్టవచ్చు!" అంటూ పెద్దగా చెప్పారు.

చక్రవర్తి వెళ్ళి పక్కగావున్న కుర్చీని ఆయనకు దగ్గరగా లాక్కుని కూర్చున్నాడు. 'బహుశః ఇంటి విషయంలో ఆయనకు మరేదైనా ఆలోచన వచ్చిందేమో!' అనే మరో ఆలోచనతో.

"రాత్రి భ్రమర తల్లి ఫోన్ చేసింది!" మరే ఉపోద్ఘాతం లేకుండా సూటిగా విషయంలోకి దిగాడు ఆయన.

ఆయన వంక విచిత్రంగా చూచాడు చక్రవర్తి.

అప్పుడే ఆయన భార్య మంచినీళ్ళతో వచ్చింది.

'సోమశేఖరం చేసిన వెధవపని ఆమె దాకా వెళ్ళిందా?' కించిత్ కలవరపడ్డాడు.

"ఏమని?"

"కూతురు పెళ్ళి విషయంలో ఆమె ఆదుర్దా పడుతున్నది!"

ఆయన మాటలకు తన అనుమానం నిజమవుతుందేమోనన్న భయమేసింది.

భ్రష్టుడు... సమాజానికి చీడపురుగు... వాడి నైజమే వాడికి తృప్తి కలిగిస్తుండవచ్చు!

"వెంటనే మిమ్మల్ని సంబంధాలు చూడమంటున్నదన్నమాట!" అన్నాడు తేలిగ్గా నవ్వుతూ.

"మొన్న ఏలూరు వెళ్ళినప్పుడు తన పెళ్ళి విషయం తల్లి తీసుకువస్తే భ్రమర చెప్పిందట- చక్రవర్తిగారికి అభ్యంతరం లేకపోతే వెంటనే పెళ్ళి చేసేసుకుంటాను అంటూ!"

"ఆమె పెళ్ళి చేసుకోవటానికి నా అభ్యంతరం దేనికి?" అన్నాడు నుదురు ముడివేసి చక్రవర్తి,

ఆయన నవ్వేశాడు.

"నేను చూచానుగదా పంతుళ్ళు ఏదీ సూటిగా మాట్లాడరు... నీకభ్యంతరం అంటే ఆమె పెళ్ళికి నీ అభ్యంతరం అని కాదు... ఆ అమ్మాయిని భార్యగా చేసుకోవటానికి నీకేమైనా అభ్యంతరమా అని?" పూర్ణచంద్రరావుగారి భార్య నవ్వుతూ అన్నది.

అప్పటికే ఆమె ఒక వరస చెరి రెండు పెసరట్లూ పెట్టి ప్లేట్లు ఇచ్చింది.

"మాస్టారు మీరు పెసరట్లు అద్భుతంగా చేస్తారని చెబితే ఏదో గొప్పలు చెప్పారులే అనుకున్నాను... ఉల్లిపాయ పెసరట్లంటే మీరు చేసినవే తినాలి పిన్నిగారూ!" అన్నాడు మాట మారుస్తూ చక్రవర్తి. "అవునూ వారికి నేనెలా తెలుసట?"

"వాళ్ళమ్మాయి మీ గుణగణాలన్నీ చెప్పివుంటుంది... ఆయన ఓకే అంటే నేనూ ఓకే అని ఈవిడగారు అనివుంటుంది... ఆ అమ్మాయి తత్వం నీకు తెలిసిందే కదా... ముక్కుసూటి మనిషి!"

ఆలోచిస్తున్నట్లుగా మౌనం వహించాడు కొద్దిసేపు చక్రవర్తి.

"అది మా ఆవిడ చేసిన పెసరట్లు బాగున్నాయి అని చెప్పినంత తేలికకాదు, అన్నివిధాలా ఆలోచించి చేయాల్సిన పని!... ముందు నీకిష్టమయితే మీ వాళ్ళతో

మాట్లాడు... వాళ్ళు ఓకే అంటే మొదటి అంకానికి తెరదింపినట్లే. ఆమె రెండు మూడు రోజుల తరువాత మళ్ళా ఫోన్ చేస్తానన్నదిలే!"

"పిన్నిగారూ! సిగ్గులేకుండా అడుగుతున్నాడని అనుకోకుండా మరోరెండు తెచ్చిపెట్టండి... అల్లప్పచ్చడిగూడా ఇంకాస్త వేయండి!" అన్నాడు పెద్దగా నవ్వుతూ చక్రవర్తి. "ఆ రెండూ తింటే ఇంకా ఈ రాత్రికి భోజనం చేయాల్సిన పని ఉండదు... అరిగి మళ్ళా ఆకలవ్వటానికి కనీసం పన్నెండు గంటలు పడుతుంది... ఈలోగా మీ ప్రశ్ననూ జీర్ణించుకుని ఓ నిర్ణయానికి వస్తాను!"

పూర్ణచంద్రరావుగారు అతడి సమాధానానికి తృప్తిగా పకపకా నవ్వారు. "భేష్! సరస్వతీ!... రెండు కాదు మూడు పట్టుకురా... వాటిని హరాయించుకోవటానికి ఇంకా కొంత సమయమిద్దాం!"

* * *

మరునాడు ఉదయం స్కూల్లో కాలుపెడుతుండగానే కనబడింది భ్రమర. ఆమె ముఖం తనను చూస్తూనే కాస్తంత ఎర్రబడటం గమనించాడు చక్రవర్తి. పెదవులు చిరునవ్వుతో మెరిసినయి.

"సోమశేఖరంలాంటి వెధవలకు మరో ఛాన్స్ ఇద్దామనుకుంటున్నాను!" అన్నాడు ఆమెనే కన్నార్పకుండా చూస్తూ దగ్గరకల్లా వచ్చి చక్రవర్తి.

ఆమెకు అతడి మాట అర్థం కాలేదు. "ఏ విషయంలో?"

"ఏ విషయంలోనో దేనికి, మన విషయంలోనే... ఈ రోజు మీ ఇంట విందు భోజనం చేయాలనిపిస్తోంది,,, రాత్రి పూర్ణచంద్రరావుగారింట్లో రుచికరమైన పెసరట్లు తిన్నప్పటినుంచి!"

"ఇంత సడన్‌గా చెబితే ఎట్లా... ఇంట్లో కూరలున్నట్లు లేవు!" అని నీరసంగా అన్నా ఆ మాటల్లో కొంటెతనమున్నది.

"పీడా పోయింది... రెండు నిముషాలు కూర్చొని కబుర్లు చెప్పి వెళ్ళి

పోతానులేండి... ఓ కప్పు టీ మీకు త్రాగే అలవాటు లేకపోయినా నాకివ్వండి... చాలు!"

"స్వాగతం!" అన్నది కళ్ళు పెద్దవి చేసుకుని అతడినే చూస్తూ.

మాటల్లోనే సోమశేఖరం వచ్చాడు అటుపక్కకు. "రండి మాస్టారూ! భ్రమరగారు వాళ్ళింటికి సాయంత్రం టీకి రమ్మనమంటున్నది... మీరు కూడా వస్తారేమిటి?" అన్నాడు కళ్ళు చికిలించి అతడినే చూస్తూ.

"నాకు పెళ్లాం, పిల్లలూ ఉన్నారండీ బాబు!" అన్నాడు అతడిని ఎగతాళి చేస్తున్నట్లుగా, ఆమె ఇంట కాలుపెడితేనే తన సంసారం కూలిపోతుందని భయపడుతున్నట్లుగా ముఖంపెట్టి.

చక్రవర్తి వెంటనే, రెండు చేతులూ జోడించి, "భార్యకు భయపడే మగవాళ్ళంటే నాకెంతో గౌరవం... అలా ఉంటేనే సంసారాలు మూడు పువ్వులూ, ఆరుకాయల్లా వెలిగిపోయేది!" వాత పెడుతున్నట్లుగా అన్నాడు.

సోమశేఖరం ముఖం ముడుచుకుని చకచకా వెళ్ళిపోతుంటే భ్రమర పకపకా నవ్వింది.

"అవునూ... నాకు తెలియక అడుగుతాను మీరు చాలా సూటి మనిషిగదా ఎందుకు డొంకతిరుగుడు పనులు చేస్తారు అప్పుడప్పుడు!" చక్రవర్తి ఆమెనే చూస్తూ అడిగాడు.

సరిగ్గా అదే సమయంలో గంట మ్రోగటం పూర్ణచంద్రరావుగారు తన గదిలోంచి ప్రార్థనా కార్యక్రమం కోసం బయటకు రావటం ఒకేసారి జరిగినయి. వెంటనే ఇద్దరూ అక్కడనుండి కదిలారు.

సాయంత్రం ఐదు గంటలప్పుడు హెడ్మాస్టర్ గారి రూంలోకి వెళుతూ పక్కగా వస్తున్న చక్రవర్తితో, "ఎనిమిదింటికల్లా రండి!" అన్నది చిన్నగా.

చక్రవర్తి మామూలుగా కోదండరామస్వామి గుడికి వెళ్ళి పూజారిగారితో కబుర్లలో

పడ్డాడు.

"ఈసారి గుళ్ళో శ్రీరామనవమి చాలా ఘనంగా జరపాలని ఆంజనేయులు గారు ఉత్సాహపడుతున్నారు!" అన్నాడు ఆయన.

"ఎప్పుడేం?" అడిగాడు చక్రవర్తి.

"ఇంకా చాలా సమయమున్నదిలేండి... చైత్ర మాసంలో అవుతుంది!"

"ఎన్నాళ్ళు చేస్తారు?"

"ఆయననటం ఈసారి రెండు రోజుల ముందే కార్యక్రమం ప్రారంభించి, ఆగమశాస్త్రప్రకారం శాస్త్రోక్తంగా నవమినాడు స్వామివారి కళ్యాణంతో పూర్తిచేయాలని... ఆ మూడు రోజులూ హరికథలు, పాటకచ్చేరీలు, ధార్మిక ఉపన్యాసాలు ఏర్పాటుచేయాలని... ఆఖరి అంశంగా చివరి రోజున ఊరేగింపుంటుంది!"

"బాగుంది... తప్పకుండా చేద్దాం!"

"మీలాంటి నలుగురూ ముందుకు వస్తే ఇంకా కావాల్సిందేమున్నది... ఇదుగో ఈ కులాలవారీ రామాలయాలు మరో రెండు ఈ ఊళ్ళో ఏర్పడటంతో రెండేళ్ళబట్టీ ఊపుతగ్గింది... డబ్బిచ్చే దాతలూ చీలిపోయారు... ఈ సంవత్సరమయితే ఆంజనేయులుగారు ముందుకు దూకుతున్నారు... వారికి తోటమీద బాగా లాభమొచ్చిందట... ఘనంగా చేయటమే కాకుండా, చివరి రోజున అన్నదానం కూడా చేయాలంటున్నారు... దాని ఖర్చంతా ఆయనే భరిస్తారట! ఆ కార్యక్రమానికి మీ అమ్మగారిని, నాన్నగారిని గూడా రమ్మనమనండి!"

"మా తాతగారి ఇల్లు ఇలా అవ్వటం వాళ్ళు చూస్తే భరించలేరు... దానిమీద వారి ఆత్మీయతకు విఘ్నం కలిగించటం నాకిష్టంలేదు!'" అతడి కంఠంలోని వేదనను గుర్తించాడు పూజారి. "చూద్దాం ఏ రోజు ఎలా ఉంటుందో ఎవరూ చెప్పలేరుగదా!" అన్నాడు గుంభనగా.

చక్రవర్తి భ్రమర ఇంటికి వెళ్ళేటప్పటికి సరిగ్గా ఎనిమిది గంటలయింది. అప్పటికే ఈయన ఇంకా రాలేదేమిటా అన్నట్లుగా ఎదురుచూస్తూ వాకిట్లోనే నిల్చొని వున్నది ఆమె. తనని చూస్తూనే వీధి దీపం వెలుగులో ఆమె ముఖం సంతోషంతో విశాలమవ్వటం గమనించి ఎంతో తృప్తి చెందాడు.

అతడు లోపల కాలుపెట్టగానే గేటు వేసి వచ్చి ముందుగదిలో తలుపు పక్కగా కుర్చీవేసింది.

"ఇప్పుడు చెప్పండి... పొద్దున స్కూల్లో ఏమిటి అన్నారు... ముక్కుసూటి మనిషి అయివుండీ ఈ డొంక తిరుగుడు వ్యవహారం ఎందుకు చేశాననా?"

ఆ ప్రశ్న ఎప్పుడు వేద్దామా అని ఆతురత పడుతున్న ఆమె ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయలేదు. అతడు ఆ మాటను ఏ విషయంలో అన్నాడో తెలిసినా అడక్కుండా ఉండలేకపోయింది.

చక్రవర్తి పకపకా నవ్వాడు. "నిజం కాదా?"

"మీరు ఎందుకన్నారో చెప్పండి ముందు!"

"మన మధ్యకు పూర్ణచంద్రరావుగారిని ఎందుకు లాగారా అని... సూటిగా నానుండే తెలుసుకోవచ్చుగదా!"

భ్రమర ముఖం ఎర్రబడింది. "అంటే నేను మీ ముందు నిలబడి– అయ్యా మీరు నన్ను పెళ్ళి చేసుకుంటారా అని దేబిరిస్తూ అడగాలా?" నవ్వాపుకుంటూ ముఖం పక్కకు తిప్పుకున్నది.

చక్రవర్తి ఆమె మాటకు తడబడ్డాడు. "అని కాదు... చూచాయగా నైనా మీ మనస్సులోని మాటను నాముందు వెల్లడించినట్లయితే నా అభిప్రాయం మీకే సూటిగా చెప్పివుండేవాడని!"

"అలాంటి విషయాలల్లో ఆడపిల్లలు చొరవ తీసుకోవటం సంస్కారం కాదు. గౌరవంగా ఉంటుందనే ఈ మార్గాన్ని ఎంచుకున్నాను... మీ అభిప్రాయం ఏమిటో

మీరు వారింటినుంచి వెళ్ళిన కొద్ది నిముషాలల్లోనే చరవాణి ద్వారా నాకు తెలిసిపోయింది!” అన్నది స్త్రీ సహజమైన సిగ్గుతో తలవంచుకుని.

చక్రవర్తి చటుక్కున పక్కన కుర్చీలోనే కూర్చున్న ఆమె చేతిమీద తన చేతిని ఆత్మీయంగా వేశాడు.

“సరస్వతిగారు చేసిన పెసరట్లను ఎంత ఇష్టంగా తిన్నానో, పూర్ణచంద్రరావుగారి మాటలనూ అంత ఆనందంగా స్వీకరించాను!” కళ్ళుమూసుకు తెరుస్తూ చిరునవ్వుతో అన్నాడు. “మీ అమ్మగారి అంగీకారం ఇప్పటికే మీరు తీసేసుకున్నారు గనుక మా ఇంట నా వంతు కృషి నేను చేయాల్సివుంటుంది!”

ఆమె తృప్తిగా ఒకసారి అతడి వంక చూచి, “ఒక్క నిముషం!” అంటూ లేచి వంటింట్లోకి వెళ్ళి ఓ ప్లేట్లో స్వీటూ, హాటూ పెట్టుకు వచ్చింది.

ఈసారి చక్రవర్తి ఆమెను చూస్తూ నవ్వాపుకోలేకపోయాడు. “ఒకే ప్లేటు తెచ్చారంటే ఇద్దరం కలిసి తినాలని మీరు కోరుకుంటున్నారన్నమాట... మరో శుభవార్త... ఇక్కడకు వచ్చేముందు గుడికి వెళితే పూజారిగారు చెప్పారు... ఈసారి ఆంజనేయులుగారు శ్రీరామనవమి ఉత్సవాలను గుళ్ళో మూడురోజులు ఘనంగా జరపాలని అనుకుంటున్నారని... ఆ క్షణాననే నా కనిపించింది ఆ కళ్యాణం ఖర్చంతా నేను భరిస్తే ఎలా ఉంటుందా అని!”

“మనం భరిస్తే ఆనందంగా ఉంటుందని అని ఉంటే నేను ఇంకా సంతోషించి ఉండేదానిని!”

“ఒకే,,, నాకూ అంతకు మించిన ఆనందం మరొకటేమున్నది... నాకు ఇంకో ఆలోచన కూడా వచ్చిందిగాని అది జరుగుతుందనే నమ్మకంలేదు... స్వామివారి కళ్యాణానికి మనమూ ఎందుకు పీటలమీద కూర్చోగూడదా అని! కానీ దానికో సమస్య వున్నది... అలా అంటూ జరగాలంటే ముందు మా తాతగారిల్లు నా పరం అవ్వాలి!”

"అదేంవిటి... అది మీకెలా వస్తుంది!"

"ఆ నిజాన్ని తెలుసుకోబోతున్న మూడో వ్యక్తి ఈ ఊళ్ళో మీరే!"

"ఏమిటది?"

"ఆ ఇంటిని నేను కొనాలనుకుంటున్నాను... కానీ ఎంతవరకూ విజయం సాధిస్తానో తెలియకుండా వున్నది... దానికి చాలా అడ్డంకులున్నాయి... అది నా చేతిలోకి వచ్చిన తరువాతనే మా వాళ్ళను ఈ ఊరికి తీసుకు రాగలిగేది... అవునూ... ఈ స్వీటూ హాటుతోనే నన్ను ఇంటికి పంపించాలనా... భోజనం ఏర్పాట్లేమైనా ఉన్నయ్యా!" కవ్విస్తున్నట్లుగా  అడిగాడు.

"ఇంకో గంటాగితే విందుభోజనమే మీకు!" నవ్వుకుంటూ కుర్చీలోనుంచి లేచింది భ్రమర.

* * *

జనవరి ఇరవై ఆరుకు ప్రతిసారి లాగానే ఈ సంవత్సరమూ విదార్థులకు పోటీలు పెట్టారు అన్ని విభాగాల్లోను. ఈసారి అదనంగా డ్రాయింగ్‌కూడా చేర్చారు చక్రవర్తి సలహాతో. సంక్రాంతి వెళ్ళిన తరువాత శని ఆదివారాలల్లో రెండు రోజులు ఆ కార్యక్రమాన్ని నిర్వహించారు.

ఆ ఊరి పెద్దలు చాలామంది ఆ రెండు రోజులూ స్కూలు ఆవరణకు వచ్చి పిల్లల పోటీ కార్యక్రమాలను ఉత్సాహంగా చూశారు. పీటీ సారే కాకుండా ఈసారి చక్రవర్తి, భ్రమర, చిదంబరం, మరికొంతమంది టీచర్లు ఉత్సాహంగా పాల్గొని ఆ కార్యక్రమాలను ఎంతో విజయవంతంగా జరిపారు.

మార్చి ముప్ఫయి ఒకటో తేదీన పూర్ణచంద్రరావుగారి పదవీవిరమణ జరగబోతుండటంతో ఈసారి రిపబ్లిక్ డేకు ముఖ్య అతిథిగా బయటవారిని ఎవరినీ పిలవ గూడదని, హెడ్మాస్టర్‌గారి చేతనే జండా వందనం చేయించాలని టీచర్లంతా ఏకగ్రీవంగా తీర్మానించుకున్నారు. ఆయనంటే అందరికీ గౌరవమూ, భక్తి.

స్వాతంత్ర్యదినోత్సవం రోజులాగానే ఈసారీ భుజంగాన్ని ఆహ్వానించనందుకు సోమశేఖరం గునుస్తునేవున్నా ఎవరూ పట్టించుకోలేదు.

"మీరు నాకంటే పాతికేళ్ళముందు రిటయిరవుతారు... ఆ సంవత్సరం నేను దగ్గరుండి మీచేతే జండా ఎగరేయిస్తాను!" అన్నది నవ్వుతూ భ్రమర సోమశేఖరాన్ని చూస్తూ కవ్విస్తున్నట్లుగా.

"అవసరంలేదు... నాకు ఊరిపెద్దలకు గౌరవం ఇవ్వటమే ఇష్టం!" అన్నాడు ముఖం ముడుచుకుంటూ.

"అంటే మిమ్మల్ని సర్పంచ్‌గా చేయాలన్నమాట... మీలో అందుకు కావాల్సిన లక్షణాలు చాలా ఉన్నయ్... గుడ్‌లక్!" అన్నది పకపకా నవ్వుతూ.

సోమశేఖరం విసురుగా అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

పోటీలు జరిగిన రాత్రి తొమ్మిదిగంటలప్పుడు చక్రవర్తి తల్లి ఫోన్‌చేసింది.

"వెళ్ళగానే చేయటమే... మళ్ళా వారమయినా ఫోన్ చేయలేదు... ఎలా ఉన్నావ్?"

అతడు సంక్రాంతికి హైదరాబాద్ వెళ్ళి వచ్చాడు.

"రిపబ్లిక్ డే సందర్భంగా పిల్లలకు చాలా రకాల పోటీలు పెట్టామమ్మా ... దాంతో నేనూ భ్రమరా బిజీ అయిపోయినాం!" అన్నాడు నవ్వుతూ. "అందుకే ఫోన్ చేయలేదు!"

"అది పల్లెటూరు జాగ్రత్త... ఇక్కడిలాగా ఎవరి జీవితం వారిది కాదు... ఆ అమ్మాయిని ఎంత వివాహం చేసుకోవాలని నిర్ణయించుకున్నా పెళ్ళికాకుండా రోడ్లమ్మట తిరిగితే ఎవరూ మెచ్చకపోంగా అవాకులూ చెవాకులూ పేలుతుంటారు... గౌరవ ప్రదమైన వృత్తిలో ఉన్నావ్! కళంకం తెచ్చుకోబోకు!"

ఎప్పుడయితే పూర్ణచంద్రరావుగారు కల్పించుకుని భ్రమర తల్లి ఉద్దేశ్యం

తెలియబరిచారో, ఆ తరువాత అతడు హైదరాబాద్ వెళ్ళిన వెంటనే తల్లికి ఆ సంగతి చెప్పాడు, 'నాకయితే అభ్యంతరం లేదమ్మా, నీకూ, నాన్నకూ అంగీకారమయితే మనం ముందుకు వెళ్ళవచ్చు... పెద్దల మీ నిర్ణయమే నాకు శిరోధార్యం!'

"సరేలే... ఇక్కడ నీకు వరసయిన వాళ్ళు ఎవరూ లేరుగా అడ్డుపడతా రనుకునేందుకు... ఎట్లాగయినా బయట సంబంధానికి వెళ్ళవలసిందే... అన్నీ కలిసొస్తే అలాగే చేసుకుందువుగాని... ఒకసారి నాన్నను వాళ్ళ ఊరు వెళ్ళి ఆ కుటుంబ పరిస్థితి ఏమిటో చూసి రమ్మనమంటాను!" అన్నది ఆమె కొడుకు మాటలకు తృప్తిగా.

ఓ పావుగంట సేపు తల్లీ కొడుకులు మాట్లాడుకున్న తరువాత,"ఉంటానమ్మా!" అన్నాడు గడియారం వంక చూసుకుంటూ. ఇంకా భోజనం కాకపోవటంతో.

"అరేయ్ ఒక్క పనిచేయరా!... స్కూలు పిల్లలకు ఆటల పోటీలే కాదు, శాస్త్రీయ సంగీతంలో కూడా పోటీలు నిర్వహించండిరా... వాళ్ళు గొప్పగా పాడాలనేం లేదు... పాడాలనే ఉత్సాహాన్ని వాళ్ళలో కలిగిస్తే కొంతమందయినా ముందు ముందు రాణించగలుగుతారు!"

"నువ్వొచ్చి ఆ పోటీలకు జడ్జిగా వుంటానంటే హెడ్మాస్టర్‌గారి చేత రేపుదయాన్నే సర్క్యులర్ ఇప్పిస్తాను!" అన్నాడు పకపకా నవ్వుతూ.

"సంతోషించారులే తెలివికి... అవన్నీ నాన్న రిటయిరయింత మేం ఆ ఊరు వచ్చి సెటిల్ అయితే అప్పుడు చేద్దువుగానిలే... అవునూ! ఆ ఇంటి ఓనర్‌తో మాట్లాడావా... వెంటనే అద్దెకున్న వాళ్ళను ఖాళీ చేయించమని చెప్పకపోయినావా... బయానా ఇచ్చి అప్పుడే నాలుగు నెలలు దాటలా... ఇల్లు మన చేతికొస్తే ఎండకాలం శెలవల్లో దగ్గరుండి బాగుచేయించి రంగులేయించుకోవచ్చు... మీ పెళ్ళయితే ఆ ఇంట్లోనే గృహప్రవేశం జరుపుదాం!"

"చూద్దాంలే... ఏ పనులు ఎప్పుడవ్వాలో అప్పుడే అవుతయి... తొందరపడితే ఎలా?"

"చూద్దామంటే కాదు వెంటనే మాట్లాడు... లేకపోతే నాన్నను పంపేదా?"

"వద్దమ్మా... ఇంత చిన్న విషయానికి ఆయన అంత దూరంనుంచి రావటం దేనికి? రేపు పూర్ణచంద్రరావుగారిని మాట్లాడమని చెబుతానులే!"

ఫోన్ ఆఫ్‌చేశాడు ఇక ఆ విషయం పొడిగించటం ఇష్టం లేనట్లుగా.

* * *

శనివారం ఉదయాన తూర్పున వెలుగు విచ్చుకుంటున్న సమయంలో, కురుస్తున్న మంచును కూడా లెక్కచేయకుండా సాయిరాంపురంలో జనమంతా ఊరిబయటవున్న ఆంజనేయులు తోటవైపుకు పరుగులు తీయసాగారు.

నాగరాజు స్కూల్లో పనిచేస్తున్న రంజని టీచర్ ఆ తోటలోని పనసచెట్టు కొమ్మకు చీరచెంగుతో మెడకు ఉరేసుకుని ఆత్మహత్య చేసుకున్నదనే వార్త దావాలనంలా ఊరంతటినీ వ్యాపించింది.

ఆంజనేయులు కంగారు పడిపోయాడు. అతడూ భార్యను తీసుకుని వెంటనే తన తోటవైపుకు పరుగులు తీశాడు. అతడు వచ్చేటప్పటికే అక్కడ చాలామంది జనం జేరారు. తోటచుట్టూ ఉన్న వాళ్ళను తోసుకుంటూ ముందుకు వెళ్ళారు ఆ దంపతులు.

పనసచెట్టు కొమ్మకు వ్రేలాడుతున్నది రంజని శరీరం!

పాతికా, ముప్ఫయి సంవత్సరాల మధ్యలో వుంటుంది వయస్సు. చామన చాయే అయినా, ఒడ్డూ పొడుగ్గావుండి చూడటానికి చక్కగా వుంటుంది. గులాబీరంగు నైలాన్ చీర కట్టుకుని వున్నది.

జుట్టురేగి, ముఖం ఉబ్బి, కళ్ళు ముందుకు పొడుచుకువచ్చి చూచేవాళ్ళకు భయం కలిగించేలా వున్నది ఆ క్షణాన ఆ ఆకారం.

కాస్త పక్కగా ఆ తోట కాపలా మనిషి భార్యా పిల్లలతో దిగులుగా నిల్చుని ఉన్నాడు. వాళ్ళు అక్కడే నైరుతీ దిక్కుగా వున్న ఓ గుడిశెలో ఉంటారు. అతడి పదిహేనేళ్ళ

పెద్దకొడుకే వెళ్ళి ఆంజనేయుల్ని పిలుచుకు వచ్చింది.

ఆంజనేయులుకి రంజనితో దూరపు బంధుత్వమున్నది. సాయీరాంపురంలో రెండు సంవత్సరాల క్రితం ఉద్యోగంలో జేరినప్పటినుండి రెండు కుటుంబాలూ మరింత దగ్గరయినయి. ఒకళ్ళింటికి ఒకళ్ళ రాకపోకలు ఎక్కువయినయి. రోజూ మంగళగిరినుంచి వచ్చి పోతుంటుంది స్కూలుకు. ఇంకా పెళ్ళి కాలేదు. ఏ రోజైన ఏదైనా ఇబ్బంది వచ్చినా, వాతావరణం బాగుండకపోయినా ఆ రాత్రి ఆంజనేయులు ఇంట్లోనే ఉండి మరునాడు స్కూలుకు వస్తుంది. ఆమె తండ్రి మంగళగిరి పొగాకు కంపెనీలో పనిచేస్తుంటాడు. మధ్యతరగతి క్రిందస్థాయి కుటుంబం.

ఆమెకు ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరం ఏమొచ్చిందో ఎవరికీ అర్థం కావటంలేదు. మంచి తెలివిగలదని, స్కూల్లో ఆమె బోధన బాగుంటుందనే పేరూ ఉన్నది.

ఆ ఊళ్ళోనే ఉన్న ఆ స్కూలు టీచర్లంతా ఒక్కొక్కళ్ళే వస్తున్నారు. విషణ్ణ వదనాలతో చెట్టుకు వ్రేలాడుతున్న రంజితనే చూస్తున్నారు.

ఆంజనేయులు ఏంచేయాలో తెలియనట్లుగా బిక్కముఖం వేసుకుని కొయ్యబొమ్మలా నిల్చుండిపోయాడు. అతడి భార్యకయితే కంటివెంట నీరు ఆగటమే లేదు. క్రితం సాయంత్రం రంజని తన క్లాసు పిల్లవాడి చేత కబురు పంపిస్తే ఆంజనేయులు స్కూలు వదిలే సమయానికి వెళ్ళాడు.

“అమ్మ నిన్నొకసారి రమ్మనమంది, బాబాయ్! నాన్నకు రెండు రోజులబట్టీ కడుపులో నొప్పి వస్తున్నది... విజయవాడ తీసుకు వెళ్ళి ఎవరికైనా పెద్ద డాక్టరుకు చూపిస్తే బాగుంటుందనుకుంటున్నది!”

“అలాగేనమ్మా! పొద్దున్నే పూజ అవ్వగానే బయల్దేరి వస్తానని చెప్పు!”

ఇద్దరూ మెయిన్ రోడ్డు వైపుకు నడవసాగారు. సెంటర్‌లో ఆమె మంగళగిరి బస్సెక్కుతుంది.

"నమస్కారమండీ!"

మెడ వెనక్కు తిప్పి చూచాడు ఆ మాట వింటూనే ఎవరా అన్నట్లుగా ఆంజనేయులు.

అభివాదం చేసింది సోమశేఖరం. "వచ్చే నెలలో రెండు నేషనల్ సేవింగ్స్‌సర్టిఫికెట్లకు ఆయస్సు తీరుతుంది... మీరే డబ్బు తెచ్చిపెట్టాలి!" అన్నాడు నవ్వుతూ ఆయన.

"తప్పకుండా... నాలుగు రోజులు ముందు వాటి వెనకాల సంతకం చేసి నాకివ్వండి... తెచ్చిపెడతాను!"

"అలాగే!" అతడు వెళ్ళిపోయాడు.

"నీకు ఈ ఊళ్ళో తెలియనివాళ్ళంటూ ఎవరూ లేరా, బాబాయ్!"

"నా వృత్తే అలాంటిదమ్మా... ఇన్స్యూరెన్స్ ఏజెంటును... రెండు చిట్‌ఫండ్ కంపెనీలకు మెంబర్లను జేర్చేది నేనే... ఇక పోస్టాఫీస్ సేవింగ్స్ స్కీమ్స్ అన్నిటిలోనూ నా ద్వారానే జేరతారు... ఎవరికైనా ఏదైనా గవర్నమెంటు ఆఫీసులో పనిబడితే నాకే చెబుతుంటారు... కాళ్ళూ చేతులూ ఆడినంతవరకయినా కష్టపడాలి కదా! అందరితో కలివిడిగా వుంటేనే నా చేతిలో నాలుగు పైసలు పడేది!"

ఆమె నవ్వుతూ, "వస్తాను బాబాయ్! రేపుదయం మాత్రం గుర్తుంచుకుని రా!" అన్నది.

రంజిత బస్టాండు వైపుకు వెళ్ళింది. ఆంజనేయులు కోదండరామస్వామి గుడికి వెళ్ళాడు. అతడి ఆలోచనలన్నీ రాబోయే శ్రీరామనవమి పండగమీదే ఉన్నయి. ఎలాగైనా ఘనంగా ఆ వేడుకను చేయాలనేది అతడి కోరిక.

నాగరాజు వచ్చాడు. "సారీ ఆంజనేయులుగారూ! మీ బంధువు ఇలా చేసిందేమిటి... కుటుంబ సమస్యలేమైనా ఉన్నయ్యా! నా దృష్టికి తెచ్చినా నేను చేయగలిగిన సాయం చేసేవాణ్ణిగదా... ఇలా మా స్కూలు ఓ మంచి టీచర్ని

పోగొట్టుకోవటం నాకెంతో బాధ కలిగిస్తోంది!"

ఆంజనేయులు తలెత్తితే ఆయన పక్కనే వున్న భుజంగమూ కనబడి చేయిజాచాడు, "సారీ!" అంటూ.

వాళ్ళు మాట్లాడుకుంటుండగానే పోలీసులూ వచ్చారు. అప్పుడే వాళ్ళ దాకా ఆ విషయం ఎలా వెళ్ళిందా అని కించిత్ ఆశ్చర్యపోయాడు ఆంజనేయులు.

"ఏమైంది... ఇప్పుడే ఫోన్ వచ్చింది... ఎవరండీ ఆమె భుజంగంగారు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఆయన్ను చూస్తూనే దగ్గరకు వచ్చి.

"ఆమె టీచరుగా నాగరాజు స్కూల్లోనే పనిచేస్తున్నది... ఎందుకు చేసిందో ఇలాంటి పిచ్చిపని అర్థం కావటంలేదు... చాలా మంచిమనిషి... నాకీ విషాదవార్త తెలియగానే తట్టుకోలేకపోయాను... ముందు మీకు చెప్పటం నా విధిగా భావించి ఫోన్ చేశాను... వీరు ఆంజనేయులుగారని, ఈ తోట యజమాని!"

"ఈ ఊళ్లో ఇన్ని తోటలున్నయి... వీరిదే దొరికిందా... వీరితో పరిచయమున్నదా ఆమెకు?"

"ఉరేసుకోవాలంటే ఏదో ఒక చెట్టుకావాలిగదండీ... ఊరికి మొదట్లోనే ఉన్న ఈ తోట ఆమెకు సానుకూలంగా కనబడి ఉంటుంది... దురదృష్టవశాత్తు అది వీరిదైంది!" అన్నాడు తలవంచుకుని నాగరాజు నిర్లిప్తంగా.

"మీకు ఇంతకుముందే తెలుసా ఆమె?" ఆంజనేయుల్ని చూస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఆమె మాకు బంధువండి!"

ఇన్‌స్పెక్టర్‌తో వెంట వచ్చిన పోలీసులే పనసచెట్టుకు వ్రేలాడుతున్న రంజని శవానికి ఫోటోలు తీశారు. తరువాత చెట్టునుంచి దించి వెనగ్గా వచ్చిన అంబులెన్స్‌లోకి ఎక్కించారు.

"ఆంజనేయులుగారూ! మీరూ మాతో రండి... వారి కుటుంబసభ్యులు ఇక్కడ వుంటే వారిని కూడా రమ్మనమనండి... వారింటి సమస్యలేమిటో తెలుసుకోవాలి... ఆ అమ్మాయికి పెళ్ళయిందా? తోట యజమానిగా మీది, వాళ్ళది స్టేట్‌మెంటు తీసుకుందాం... వెధవది ఎలాంటి బాధకర సంఘటనకైనా మా రూల్సంటూ మాకు ఏడుస్తయికదా, తప్పదు... ఆ తరువాత వీలైనంత తొందరగా పోస్ట్‌మార్టం చేయించి బాడీని ఇప్పిస్తాను!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"పెళ్ళి కాలేదండి... ఆ అమ్మాయి అమ్మా, నాన్న మంగళగిరిలో ఉంటారు... చెప్పాను విషయం వారికి ఫోన్ చేసి ఇక్కడకు వస్తూనే!" అన్నాడు ఆంజనేయులు దిగులుగా. "ఈ పాటికి వస్తుండాలి వాళ్ళు!"

"మీ తోటకు కాపలా మనిషంటూ ఎవరూ లేరా?"

"ఉన్నాడండి... అక్కడ కర్రపట్టుకు నిల్చున్న ముసలతను, అతడే!"

అతడిని దగ్గరకు పిలిచాడు.

"తెల్లవార్లూ మెళుకువతోవుండి కాపలాకాస్తావా... లేకపోతే గుడిశెలో పడుకుని నిద్రపోవటమేనా?"

"పదింటికి గేటుకు తాళమేసి వెళ్ళి పడుకుంటానయ్యా... మెళుకువ వచ్చినప్పుడల్లా లేచి ఒకసారి నాలుగువైపులా చూసి వస్తాను!" వినయంగా చెప్పాడు.

"ఆ అమ్మాయి తోటలోకి రావటం గమనించలేదా?"

"లేదయ్యా!"

"ఎన్ని గంటలప్పుడు చూశావ్ ఆ అమ్మాయిని ఆ స్థితిలో!"

"నేను రోజూ ఐదింటికే లేస్తానయ్యా... మోటరేసి, నీళ్ళు పెట్టేందుకు చెట్లలో ట్యూబు పడేస్తానయ్యా... అప్పుడు కనబడింది ఆ అమ్మాయి అలా చెట్టుకు వ్రేలాడుతూ... భయం పుట్టి పెద్దగా కేకలు వేయటంతో పక్క తోటల వాళ్ళు పరుగెత్తుకుంటూ

వచ్చారయ్యా నాకేమైందో అనుకుంటూ, ఊరిమొదట్లోనే ఉన్నది కదయ్యా తోట... ఇళ్లల్లో వాళ్ళు, పొలాలకు వెళుతున్నవాళ్ళు పరుగుపరుగున వచ్చారయ్యా... మా పెద్దాడిని వెంటనే అయ్యగారికి చెప్పి రమ్మనమని పంపించానయ్యా!" అతడికి గొంతు తడిసి ఏడుపు కూడా వస్తోంది.

"సరేలే... ముందు స్టేషన్‌కు పద... ఆంజనేయులుగారూ మీరూ పదండి!" అన్నాడు అతడి చేయి పట్టుకుని జీపెక్కిస్తూ.

ఆంజనేయులు కలవరపడ్డాడు అతడి ప్రవర్తనకు.

రంజిత శవంతో అంబులెన్సు, దానివెనగ్గా జీపు వెళ్ళిపోవటంతో అక్కడ గుమికూడిన జనమూ ఇక ఉండి చూసేందుకు ఏమీ లేదన్నట్లుగా ఒక్కొక్కళ్ళే వెళ్ళిపోయారు.

మధ్యాహ్నం పన్నెండు గంటలయ్యేటప్పటికల్లా సాయిరాంపురంలో మరో వార్త గుప్పుమన్నది– ఆ తోట యజమాని ఆంజనేయుల్ని పోలీసులు అరెస్ట్ చేశారంటూ!

* * *

మధ్యాహ్నం పన్నెండు గంటలప్పుడు సాయిరాంపురం పోలీస్ స్టేషన్‌ముందు ఎర్రమారుతీ సుజీకీ వచ్చి ఆగింది. అందులోనుంచి లాయర్ విశ్వనాథం దిగాడు.

అప్పటికే స్టేషన్‌ముందు ఆ ఊరి జనం చాలామంది ఉన్నారు. రంజని తల్లిదండ్రులు, తమ్ముడు ఉన్నారు. పూర్ణచంద్రరావుగారు, చక్రవర్తి, భ్రమర కూడా అక్కడే ఉన్నారు. కోదండరామస్వామి గుడి పూజారిగారు గూడా వచ్చారు.

టీచరు మరణించటంతో ఆ ఊళ్ళోని రెండు స్కూళ్ళకూ ఆరోజు శెలవు ప్రకటించారు.

లాయరు విశ్వనాథాన్ని చూస్తూనే పూర్ణచంద్రరావుగారు, చక్రవర్తి, భ్రమర కారు దగ్గరకు వచ్చారు. ఆంజనేయుల్ని అరెస్ట్ చేశారు అనే విషయం తెలియగానే పూర్ణచంద్రరావుగారే విశ్వనాథానికి ఫోన్ చేసి వెంటనే రమ్మనమని చెప్పారు. ఆ

సమయంలో కోర్టులో వున్న ఆయన రఘురాంకు, మరో ఇద్దరు జూనియర్లకు అక్కడ పనులు అప్పజెప్పి వెంటనే బయల్దేరాడు.

పూర్ణచంద్రరావుగారు ఆంజనేయుల్ని తోట విషయంలో అంతకు ముందే ఒకటి రెండు సార్లు ఆయన దగ్గరకు తీసుకు వెళ్ళాడు.

"మీరు ఇక్కడే ఉండండి... నాకు ఫోన్‌లో వివరాలు చెప్పారు కదా... ఇన్‌స్పెక్టర్‌ని కలిసి మాట్లాడి ఆయనేమంటాడో చూద్దాం... ఆ అమ్మాయి వీరి తోటలో ఉరేసుకున్నంత మాత్రాన ఆయన్ను అరెస్టుచేయాల్సిన అవసరమేమున్నది?" అంటూ ఆయన స్టేషన్‌లోకి వెళ్ళాడు.

విశ్వనాథంగారిని చూస్తూనే ఇన్‌స్పెక్టర్ కించిత్ కలవరపడ్డాడు. ఆయన గుంటూరులో పేరొందిన లాయరు. ఎక్కువగా క్రిమినల్ కేసులే చూస్తుంటారు. ఇప్పుడెందుకొచ్చాడో అర్థంకాలేదు. ఆయనతో చాలా జాగ్రత్తగా మాట్లాడాలి అనుకున్నాడు.

"నమస్కారమండి... చాలా దూరం వచ్చారు... ఫోన్ చేస్తే నేనే వచ్చేవాడిని కదా!" అన్నాడు వినయంగా.

"ఆంజనేయులుగారిని ఎందుకు అరెస్ట్ చేశారో తెలుసుకోవాలని వచ్చాను!" అన్నాడు సూటిగా.

తడబడ్డాడు ఇన్‌స్పెక్టరు. "లేదండి... అరెస్ట్ చేయలేదు... అసలు అలా చేయాలనీ అనుకోవటమూలేదు... వారి తోటలోనే రంజని అనే టీచరు ఆత్మహత్య చేసుకున్నది... ఆ తోట యజమానిగా స్టేటుమెంట్ తీసుకోవాలని నాతోపాటే జీపులో తీసుకువచ్చాను!"

"స్టేట్‌మెంటు తీసుకోవటానికి పిలుచుకు వచ్చినప్పుడు ఆయన్ను సెల్‌లో ఎందుకు ఉంచారు?... అక్కడ బెంచీ మీద కూర్చోబెట్టవచ్చుగదా!" అన్నాడు కాస్త పక్కగా వున్న సెల్ కటకటాల వెనుక తలవంచుకు నిలబడివున్న ఆంజనేయుల్ని చూస్తూ.

మళ్ళా తడబడ్డాడు. "వారిని బెంచీమీద కూర్చోమన్నానండి... కానీ ఒకటి

రెండు సార్లు ఇక్కడనుండి వెళ్ళిపోవటానికి ప్రయత్నించారు... దాంతో నేను ఇబ్బందుల్లో పడతానేమోనని భయమేసి సెల్‌లో ఉంచమన్నాను!"

"ఓకే... దెన్ ఆల్‌రైట్... ఎవరైనా అదే పనిచేస్తారులేగాని... వీరెవరు?" అంటూనే ఇన్‌స్పెక్టర్ ఎదురుగ్గా కూర్చున్న వ్యక్తివంక చూశాడు.

అది గమనించి వెంటనే, "వీరు నాగరాజుగారని... చనిపోయిన టీచర్ పనిచేస్తున్నది వీరి స్కూల్లోనే... తొందరగా పోస్ట్‌మార్టం చేయించి బాడీనీ ఇస్తే వారి స్కూలుకు తీసుకువెళ్ళి విద్యార్థులు, వారి తల్లిదండ్రులు చూసేందుకు వీలుగా అంత్యక్రియలకు ముందు అట్టిపెట్టాలని ఆనుకుంటున్నారు వారు... ఆమెకు స్కూల్లో టీచర్‌గా మంచి పేరున్నదట!" అన్నాడు చిన్నగా.

"అవునండీ! మా స్కూల్లో రంజితటీచరంటే విద్యార్థులందరికీ ఎంతో అభిమానం... స్కూలు దగ్గర జేరి అంతా గోలచేస్తున్నారు... ఆలస్యమయితే స్కూలును ఎక్కడ ధ్వంసం చేస్తారో అనే భయంతో వీరిని త్వరగా పోస్ట్‌మార్టమ్ చేయించి బాడీని ఇప్పించమని సాయం కోరేందుకు వచ్చాను!"

ఇన్‌స్పెక్టర్ పెద్దగా కానిస్టేబుల్‌తో చెప్పాడు. "ఆంజనేయులుగార్ని తీసుకువచ్చి ఆ బెంచీమీద కూర్చోబెట్టు!... మంచినీళ్ళు కావాలేమో అడిగి ఇవ్వు!... సార్! మీరు కూర్చోండి!"

విశ్వనాథ్ నవ్వాడు. "నిజమే ఎవరి జాగ్రత్తలో వారుండక తప్పదు... ఈరోజున పిల్లలు ఎట్లా వున్నారు... పిడుగులు... వారి భయం వారిది... ఆంజనేయులుగారు పారిపోతాడేమోనని మీ భయం మీది... కానీ నాకు ఒక్కటే అర్థంకాకుండా ఉన్నది... మీరు ఆంజనేయులుగారిని స్టేట్‌మెంటు తీసుకోవటానికే తీసుకువచ్చారు... ఆయన ఈ ఊళ్లో పదేళ్ళబట్టీ ఉంటున్నారు... పెళ్ళాం పిల్లలూ ఉన్నారు... పొలాలు, తోట ఉన్నయి... ఆయన తోటలోనే ఆ అమ్మాయి హత్య చేసుకున్నంత మాత్రాన ఆ పెద్దమనిషిని పారిపోతాడనే భయంతో సెల్‌లో కూర్చోబెట్టటమనేది ఎంతవరకు సమంజసం... ఆ లెక్కన చూస్తే చచ్చిన ఆ అమ్మాయి పనిచేస్తున్న స్కూలు వీరిదే...

ఆ అమ్మాయి ప్రవర్తనమీద వీరి దగ్గరా స్టేట్‌మెంటు తీసుకోవాలి... మీరు పిలిపించకపోయినా వారే వచ్చారు... మీరు స్టేట్‌మెంట్ ఇవ్వమని అడిగితే వీరూ పారిపోవచ్చు... వీరినీ సెల్‌లో పెట్టవచ్చుగదా... అంహాం... అలా పెట్టమని నేను అనటంలేదు... ఆంజనేయులిగారి విషయంలో మీ ఆలోచనా విధానాన్నే నేను ప్రశ్నిస్తున్నాను!"

లాయర్ మాటలతో ఇన్‌స్పెక్టర్ ముఖమే కాదు, నాగరాజు ముఖమూ నల్లగా మాడిపోయింది.

"చిన్న వయసులోనే విషాదకర పరిస్థితులలో చచ్చిపోయిన ఆమె కుటుంబానికి న్యాయం చేయాలనే తపనలో చిన్న తప్పు జరిగింది!" ఇన్‌స్పెక్టర్ తలవంచుకుని అన్నాడు.

"ఎఫ్ఐఆర్ వ్రాశారా?"

"లేదండి!"

"ఎందుకని?"

"స్పాట్‌కు వెళ్ళటం, రాగానే బాడీని పోస్ట్‌మార్టంకు తీసుకువెళ్ళే హడావుడిలో ఇంకా రికార్డ్ చేయలేదు!"

"ఆ అమ్మాయి రాత్రి ఎప్పుడో- ప్రస్తుతానికి మీ ఉద్దేశ్యంలోలాగా ఆత్మహత్యే అనుకుందాం... చేసుకుంది... తెల్లవారు తుండగానే మీకు ఆ వార్త అంది... అవునూ మీకా విషయం ఎలా తెలిసింది?"

"ఈఊరి సర్పంచ్‌గారే ఫోన్ చేసి చెప్పారండి!"

"ఊరి పెద్దగా ఆయన డ్యూటీ ఆయన నిర్వహించారన్నమాట... ఎఫ్ఐఆర్ వ్రాయటానికి ఎంతసేపు పడుతుంది... ఇప్పుడు రాద్దామన్నా మీకు ఫోనొచ్చిన టైం కూడా మర్చిపోయివుంటారు... దాన్ని ఎలా రాయాలో ఎవరైనా వచ్చి డిక్టేట్ చేయాలా?" నవ్వుతూనే అడిగాడు.

ఇన్‌స్పెక్టర్ లోలోనే ఆయన మాటలకు కుతకుతలాడిపోతున్నాడు.

"లేదండి...లేదండి... నేనే స్వయంగా నిజాల్ని మాత్రమే రాస్తాను... అలాంటి విషయాలల్లో నేను చాలా స్ట్రిక్ట్‌గా ఉంటాను... చూడండి నా రైటింగ్ ప్యాడ్‌మీద ఫోనొచ్చిన టైం రాసిపెట్టుకున్నాను... సరిగ్గా ఆరూ ఇరవై ఆరుకు ఫోనొచ్చింది!"

"అప్పుడు స్టేషన్‌లో ఎందుకున్నారు మీరు? చూడు ప్రకాష్... అవునూ మీ పేరు ప్రకాషేగదూ!"

"అవునండీ!" కంగారుపడిపోయాడు ఇన్‌స్పెక్టరు. "నేను ఇంట్లో పడుకుని ఉన్నప్పుడే వచ్చింది. ఫోన్ రాగానే టైం చూసి డ్రస్ చేసుకుని స్టేషన్‌కు వచ్చి మళ్ళా మర్చిపోతానేమోనని ప్యాడ్‌మీద వ్రాసి నలుగురు కానిస్టేబుల్స్‌ని తీసుకుని ఆంజనేయులుగారి తోటకు వెళ్ళాను!"

నాగరాజు చికాగ్గా కుర్చీలోనుంచి లేచాడు. "నేను వెళతానండి మరి... హాస్పిటల్‌లో బాడీ ఇవ్వగానే నాకు ఫోన్ చేస్తారా... నేను అంబులెన్స్‌ను తయారుగా ఉంచుతాను బాడీని స్కూలుకు తీసుకువెళ్ళేందుకు!"

"నా హడావుడిలో నేనుంటాను... వీలుంటుందో ఉండదో... మీ మనిషిని ఎవరినన్నా హాస్పిటల్ దగ్గర ఉంచండి!"

"ఓకే... అలాగే!"

అతడు అటు వెళ్ళగానే, "చూడు ప్రకాష్... ఇతడు ఆంజనేయులుగారి తోటను తను కొనుక్కోవాలని చూస్తున్నాడనుకుంటాను... నీకు తెలుసా ఆ విషయం?"

"లేదండి... నాకు తెలియదు!" అన్నాడు నంగినంగిగా.

ఇన్‌స్పెక్టర్ నాటకమాడుతున్నాడని విశ్వనాథంకు తెలిసిపోయింది.

"వెంటనే నాగరాజుగారిని పిలిపించి ఆ అమ్మాయి ఆత్మహత్య విషయంలో అతడి ఉద్దేశ్యమేమిటో వెంటనే రికార్డ్ చేయండి... రెండోది... నేను

ఆంజనేయులుగారితో మాట్లాడాలి... మీకేమైనా అభ్యంతరమా?" ఇన్‌స్పెక్టర్‌నే తదేకంగా చూస్తూ అడిగాడు.

"అయ్యయ్యో నాకభ్యంతరమేమున్నదండి... నేను హాస్పిటల్‌కు వెళ్ళి అక్కడ సంగతేమిటో చూసివస్తాను... ఈలోగా మీరు మాట్లాడండి ఆంజనేయులు గారితో!" అతడు హడావుడిగా వెళ్ళిపోయాడు.

– కానీ ఆక్షణాన అతడు ఊహించలేకపోయాడు– సూర్యాస్తమయంలోగా తను ఆ స్టేషన్‌నుంచి ఆ జిల్లాలో మారుమూల ఉన్న ఓ చిన్న ఊరుకు బదిలీ అవుతాడని, కొత్తగా వచ్చిన ఇన్‌స్పెక్టర్‌కు చార్జి వెంటనే ఇవ్వవలసివస్తుందని!

* * *

రాత్రి తొమ్మిది గంటలయింది. చీకటి చిక్కగా అలుముకున్నది మాణిక్యం ఇంటి ఆవరణనంతా. దొడ్లో జీరోవాట్ బలుబు దిగులుగా వెలుగుతోంది.

భుజంగం, నాగరాజు అప్పటికే రెండు రౌండ్లు పూర్తిచేశారు. ఆ కార్యక్రమం మొదలుపెట్టకముందు లొడలొడా వాగిన నాగరాజు ఎవరో నోటిని కుట్టేసినట్లుగా బిగుసుకు కూర్చున్నాడు. భుజంగం అదో రకం మనిషి తినటం ఎక్కువ త్రాగటం తక్కువ. దానితో పొట్ట బానలా తయారయింది.

లోపల మాణిక్యం ఆమ్లెట్లు వేస్తూ నోరు మూతపడకుండా ఎవరినో తిట్టిపోస్తోంది. శాపనార్థాలు పెడుతూనే ఉన్నది.

ఇప్పటివరకూ వాళ్ళు ఎలాంటి వెధవపనిచేసినా కంటికి రెప్పలా చూచుకున్న ఇన్‌స్పెక్టర్ క్షణాలల్లో బదిలీ అయి వెళ్ళిపోయాడు. కనీసం వీళ్ళకు మాటమాత్రం కూడా చెప్పకుండా. అతడూ ఈ స్టేషన్‌నుంచి అయిష్టంగానే వెళ్ళాడు.

ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయిన సంగతి నాగరాజు దిగులుగా చెబితే మాణిక్యం చప్పరించేసింది. 'ప్రతిదానికీ భయపడితే ఎలా... ఆ కొత్తోడిని మనింటికి ఓ రాత్రి పిలు... వాడికి కావాల్సిన సీసాలు ముందుపెట్టు... కిర్రెక్కించేలా ఇద్దరు పిటపిటలాడే

పిల్లల్ని పంపమని అవతారానికి ఫోను కొట్టు... నేనున్నానుగా వాడిని దారిలో పెట్టేటందుకు... పెద్దపెద్దవాళ్ళనే నా కొంగున ముడేసుకున్న దాన్ని వీడో లెక్క!" అంటూ అతి తేలిగ్గా మాట్లాడేసిందికాని రెండు రోజులకే తెలిసిపోయింది ఆ కొత్తగా వచ్చిన ఇన్‌స్పెక్టర్ ఓ కొరకరాని కొయ్య అని.

అయినా మాణిక్యం భయపడలేదు. 'వీడి బాబుల్నే చూశాను చాలామందిని... నేనొకసారి వెళ్ళొచ్చేదేమిటి వాడింటికి... పెళ్ళాం బిడ్డల్ని తెచ్చాడా, లేకపోతే ఇంకా ఒంటరిగానే ఏడుస్తున్నాడా?'

'తెచ్చినట్లులేదు!" నసిగాడు నాగరాజు.

ముఖాన్ని విశాలం చేసుకున్నది. 'ఇంకేం వాడు మనూళ్ళో ఉన్నంతకాలం కాపురం పెట్టకుండా చేసే బాధ్యత నాది... ఊరికినే కంగారుపడబోకు!"

"సరే! అయితే వాడిని నీ కొదిలేస్తానుగాని... నేను పొద్దున్నే గుంటూరు వెళు తున్నాను... టెన్త్ క్లాసు పరీక్షలు దగ్గరకు వస్తున్నయి... ఈ సారి మనకు దగ్గరలో వున్న మరి కొన్ని గ్రామాలకి గూడా మన స్కూలుని సెంటర్ చేయాలి... ఆ బోడి గవర్నమెంటు స్కూలుకంటే మన స్కూల్లోనే పరీక్షలు నిర్వహించేందుకు హంగులన్నీ వున్నయ్యని పైవాళ్ళందరికీ నచ్చజెప్పిరావాలి... నాల్రూపాయలు చేతిలో పడే సమయం ఇదే!"

"మళ్ళా పేపరు లీక్ చేయించాలనా?... ఒకసారి చేతులు కాల్చుకున్నావ్, జాగ్రత్త!"

"ఈసారి దాని జోలికి వెళ్ళనులే... అంతకంటే మనకు కావాల్సిన పిల్లల్ని కాపీ కొట్టించుకోనీయటమే తేలిక... మన స్కూల్లో అయితే అది చేతులో పనే!"

"ఎంత వసూలుచేస్తున్నావురా ఒక్కొక్కళ్ళ దగ్గర?"

"ఎంతక్కా! పేపరుకు రెండు వేలు... అన్ని పేపర్లకూ అయితే కొద్దిగా కన్సెషన్ ఇచ్చి పదివేలు తీసుకుంటాను... అయినా, అందులో మనకెంత మిగిలి చస్తుందని...

దాన్ని ఎంత మందికి పంచిపెట్టాలి... వాచర్ల ఊరికినే మన మాట వింటారా?"

మాణిక్యం పకపకా నవ్వింది. "నువ్వా ఇచ్చేది... తీసుకోవటమేగాని ఇవ్వటం తెలుసా నీకు!"

"ఆఁ... ఇవ్వకపోతే ఊరికినే చేస్తారు పనులు... ఎవడూ చెవిలో పువ్వులు పెట్టుకుని లేడు... అసలు ఇంకా కొన్ని స్కూళ్ళను మన దాంతో కలపాలంటే నేనెంత ఖర్చుపెట్టాలో తెలుసా... ఇంత శ్రమపడితే మనకు చివరకు మిగిలేది రెండుమూడు లక్షలకంటే ఎక్కువ ఉండదు!"

"సరేలే... ముందు ఓ ఇల్లు కట్టుకుని, పెళ్ళి చేసుకో!" అన్నది నవ్వి.

"హాయిగా బ్రతుకుతున్నవాడికి అదో లంపటం దేనికి?"

భుజంగం అక్కా తమ్ముళ్ళ మాటలు వింటున్నాడు గాని నోరు తెరిచి కల్పించుకోలేదు.

"మాణిక్యం! మరో రెండు ఆమ్లెట్లు వేయి... నువ్వు చేసినవి తింటుంటే ఎన్ని తిన్నదీ లెక్క కుదిరిచావదులే!"

పదోతరగతి పబ్లిక్ పరీక్షలు వస్తున్నయ్యంటే నాగరాజుకు డబ్బేడబ్బు. చదువురాని అడ్డగాడిదల చేత ఇష్టమొచ్చినట్లుగా కాపీకొట్టించి పాసు చేయించటం అతడికి వెన్నతో పెట్టిన విద్య. ఆ విషయంలో ఎవరెవరు తనకు సాయం చేసేది ముందుగానే నిర్ణయించుకుంటాడు. ఆ కార్యక్రమం ప్రతి సంవత్సరం చాలా సాఫీగా జరిగిపోతోంది. అతడి ఆశ ఒక్కటే– ఇంకా ఎక్కువమంది పిల్లలకు తన స్కూలు సెంటరయితే తనకింకా ఎక్కువ ఆదాయం వస్తుందని. వీర్రాజులాంటి బ్రోకర్లు ఉండనే ఉన్నారు!

పదిగంటలవుతుంటే భుజంగం లేచాడు ఇంటికి వెళ్ళేటందుకు.

"బావా! గాలివార్తలు రోజురోజుకూ ఎక్కువవుతున్నయి... మన ఊరు మున్సిపాలిటీ కాకుండా చూసుకోవాల్సిన బాధ్యత నీదే... నీ ప్రయత్నాలల్లో నువ్వుండు... సర్పంచ్‌గా గెలవటమే తేలిక!"

భుజంగం వెళ్ళిపోయాడు.

నాగరాజు అక్క పక్కన జేరి, "ఈసారి పరీక్షలకు వచ్చే డబ్బుతో మరో నాలుగు గేదెలు కొనుక్కుంటావా, లేకపోతే నెక్లెస్ చేయించుకుంటావా?" చిన్నగా అడిగాడు.

కొద్ది క్షణాలు ఆలోచనలో పడింది. "చూద్దాంలే... దానికి ఇంకా సమయమున్నదిగా... రంజని విషయంలో మన స్కూలుకేం చెడ్డపేరు రాదుగదా!" అన్నది నుదురు ముడివేసి.

* * *

రాత్రి పదిగంటలప్పుడు విజయవాడనుండి ప్రకాశరావు పూర్ణచంద్రరావుగారికి ఫోన్ చేశాడు. ఆయన అప్పుడే ఇక పడుకుందాం అన్నట్లుగా బెడ్‌రూంలో లైట్ ఆర్పి చిన్న దీపం వెలిగించాడు.

"నమస్కారమండీ! ప్రకాశరావును మాట్లాడుతున్నాను... నేను చెప్పిన విషయం ఏం చేశారు... జీపీఏను ఈవారంలో రద్దు చేయించాలండి... చక్రవర్తిగారికి చెప్పి రిజిస్ట్రారాఫీసుకు తీసుకురావాలి!" అన్నాడు.

పూర్ణచంద్రరావుగారికి చికాకు వేసింది ఆయన మాటలకు. "ఇంకా అతడు లాయర్‌తో మాట్లాడలేదటండి!"

'ఆయన ఎవరితో మాట్లాడినా, మాట్లాడకపోయినా ఇక ఆగలేనండి... పిల్లలు నన్ను నిద్రపోనీయటంలేదు!" అన్నాడు విసురుగా.

"మీరు పెద్దవారు... అలా కాదు మాట్లాడవలసింది... ఎగ్రిమెంట్ అయ్యేటప్పుడే అన్నీ ఆలోచించుకుని దిగాలి... ఇప్పుడు పిల్లలు వద్దంటున్నారు, బార్య వద్దంటున్నది... ఇక్కడ ఆంధ్రప్రదేశ్ రాజధాని వస్తున్నది లాంటి కారణాలతో ఒప్పందాన్ని రద్దు చేయాలనటం న్యాయం కాదు!"

"అయ్యా! నేను ఇంతకుముందే చెప్పాను మీకు నా ఇబ్బందులు... చాలా ఇరకాటంలో వున్నాను... మిత్రులుగా మీరే నాకు సాయం చేయాలి!"

"నిజమే... మిత్రులుగా మీకు సాయం చేయవచ్చు... కానీ అవతల మనిషికూడా దానికి అంగీకరించాలి కదా... మధ్యవర్తిగా వున్న నా పరువేం కావాలి. చూడండి ప్రకాశరావుగారూ! చక్రవర్తి ఎంతో ఆత్మీయమయిన తాతగారింట్లో అలాంటి పరమ ఛండాలపు పనులు జరుగుతుండటం చూడలేకనే, ఆ పాత ఇంటిని మీరడిగినంత డబ్బు ఇచ్చి కొనటానికి సిద్ధపడ్డాడు... ఆనాడు మీరు దానికి మనస్ఫూర్తిగా అంగీకరించటమే కాకుండా, ఎంతో సంతోషించారు కూడా! గుర్తున్నదికదా?"

"మీరు చెప్పింది నిజమే నేను కాదనటంలేదు... కాని పరిస్థితులు మారినప్పుడు ఏం చేయాలి మరి?"

"ఏం మారినయ్యండి పరిస్థితులు... ఈయన ఆ ఇంటిని కొంటున్నాడని తెలిసి ఊళ్ళో పెద్దలు ఎంతగా సంతోషించారో తెలుసా... ఇప్పుడు మీరు అమ్మనూ అంటే అందరూ కలిసికట్టుగా మీమీద ఒప్పందాన్ని ఉల్లంఘిస్తున్నందుకు దావా వేయాలని చూస్తున్నారు... అలాంటిదే జరిగితే మీరేం చేస్తారో ఆలోచించండి... అన్నిటికంటే ముఖ్యమయిన విషయం మీరు ఒప్పందాన్ని రద్దుచేయటానికి చెబుతున్న కారణాల్లో ఒక్కటీ కోర్టులో నిలబడేది కాదు... అంతకు మించి ఒప్పందం ప్రకారం మీరు ఆ ఇంటిని అద్దెకు తీసుకున్న వారినుండి ఖాళీ చేయించాలి... ఇంతవరకూ మీరు ఆ పని చేయలేకపోయారు... తప్పు మీ వైపే ఉన్నది!"

"పూర్ణచంద్రరావుగారూ!" ఆయన ఒక్కసారిగా భోరుమని ఏడ్వటం మొదలు పెట్టాడు. "చక్రవర్తిగారిది తప్పు అని నేను ఎన్నడూ అనలేదు... ఆ ఇల్లును నేను కొనటం, తరువాత నేను దాన్ని అద్దెకివ్వటం అంతా నా ఖర్మకొచ్చింది... ఆ ఒప్పందం రద్దుకాకపోతే నాకు ఆత్మహత్య తప్ప మరో దారి లేదు!"

ఆ మాటతో ఆయన ఎందుకు ఇప్పుడు ఇల్లు అమ్మనంటున్నాడో కారణం తెలుసుకునేందుకు ఇదే అనువయిన సమయం అనిపించింది పూర్ణచంద్రరావుగారికి.

"అలా ఎప్పుడూ అనవద్దు... మీరు బాధ పడటం నాకూ బాధే... తక్కువ రేటుకు ఒప్పందం కుదుర్చుకున్నామని ఇప్పుడు చింతించ వద్దు... డబ్బు ఈనాడు

వస్తుంది రేపు పోతుంది... మీరు చెప్పండి కావాలంటే ఇంకో లక్ష ఆయన చేత ఇప్పిస్తాను!"

ప్రకాశరావు ఏం మాట్లాడాలో తెలియనట్లుగా మౌనంగా ఉండిపోయాడు.

"సరే! అదీ మీకు అంగీకారం కాదంటారా... ఈ విషయంలో మిమ్మల్ని మానసికంగా వేదనకు గురిచేయటం నాకంతగా ఇష్టంలేదు... అలాగే కుదుర్చుకున్న ఒప్పందం రద్దు చేయటానికి చక్రవర్తి కాళ్ళు పట్టుకునయినా అంగీకరించేలా చేస్తాను... అయితే..." ఒక్కక్షణమాగాడు ఆయన. ఇంకో రస్నా ఇస్తేనేగాని అసలు కారణం ఆయన నోటినుండి బయటకు రాదు అని అనుకున్నాడు మనస్సులోనే.

"చెప్పండి... చెప్పండి... మీరు ఏం చేయమంటే అది చేస్తాను... బయానాగా ఇచ్చిన లక్షమీదా వడ్డీగూడా ఇస్తాను!" అన్నాడు ఆయన త్వరత్వరగా.

"వడ్డీ వద్దులేండి గాని ఒక్క పనిచేయండి... ఆ ఇంటిని ముందు ఖాళీ చేయించండి చాలు... దానివలన చక్రవర్తి ఎంతగానో తృప్తిపడి మీరు కోరినట్లుగా ఆ ఒప్పందాన్నీ రద్దు చేస్తాడు!"

– ఆయనకు తెలుసు అది ప్రకాశరావు వల్ల అయ్యేపని కాదని!

మరోసారి అటు పక్క నిశ్శబ్దమేర్పడింది.

"రాజధాని వస్తున్నది కాబట్టి ఆ ఇంటి విలువ పెరుగుతుందనేది మీ పిల్లల అభిప్రాయం అంటున్నారు కదా... అది నిజమే అవ్వవచ్చు కూడా... మీకు మరింత లాభం వస్తున్నప్పుడు నేనెందుకు అడ్డుపడాలి... బాధపడితే చక్రవర్తి బాధపడతాడు... అతడితోకంటే మీతోనే నాకు పరిచయం ఎక్కువ!"

అటు పక్కనుంచి ఎలాంటి సమాధానమూ రాలేదు.

"తొందరేం లేదు... మీరు ఆలోచించుకునే నిర్ణయం తీసుకోండి!" అన్నాడు పూర్ణచంద్రరావుగారు అనునయంగా.

“అది నావల్ల అయ్యే పని కాదండి!” చాలా నీరసంగా అన్నాడు ప్రకాశరావు నిముషం తరువాత లోగొంతుకతో.

“మరి ఎక్కువ రేటు వస్తుందనుకుంటున్నప్పుడు అద్దెకున్న వాళ్ళ చేత ఇల్లు ఖాళీ చేయించకపోతే కొనేటందుకు ఎవరొస్తారండి... మాట్లాడేదాంట్లో అర్థం ఉండాలికదా!” కంఠం హెచ్చించారు పూర్ణచంద్రరావుగారు అతడి బలహీనత చేతిలో చిక్కటంతో.

కొద్దిక్షణాలు ఆగి, “అలా ఖాళీ చేయించగలవాళ్ళకే అమ్ముతాను!” అన్నాడు చిన్నగా.

పూర్ణచంద్రరావు పకపకా నవ్వాడు. “ప్రకాశరావుగారు! మిమ్మల్ని చూస్తుంటే నాకు జాలి వేస్తోంది... తుచ్ఛులకు, నీచులకు భయపడితే ఎలాగండి? ఇప్పుడు నాకు అర్థమవుతున్నది మీ మాటల వెనుక నాగరాజు ఒత్తిడి ఎక్కువగా వున్నదని... అదే నిజమయితే ఆ ఒప్పందాన్ని రద్దు చేసే ప్రసక్తేలేదు... ఆ విషయంలో ఈ ఊరి పెద్దలంతా చక్రవర్తి వెనుకే నిలబడతారు!”

మరోసారి ఏడుపు వచ్చినంత పనయింది ప్రకాశరావుకు. “ఒకప్పుడు ఆ ఇంటిని నేను కొన్నది లక్షకి... అదే మొత్తానికి దాన్ని తనకు దఖలు చేయకపోతే నన్ను, నా కుటుంబాన్ని సర్వనాశనం చేస్తానంటున్నాడు వాడు... అందుకే ఇంట్లోవాళ్ళు కూడా రద్దుచేయమని బలవంతం చేస్తున్నది!” వడివడిగా ఎవరైనా ఆ మాటలు వింటారేమోనన్నంత భయంగా గొణుగుతున్నట్లుగా అన్నాడు ప్రకాశరావు.

“మీరు ఇన్నాళ్ళూ నాకా మాట చెప్పకుండా ఏవేవో కబుర్లు చెప్పారు... అలాంటిదుంటే వెంటనే పోలీసు కంప్లెయింట్ ఇవ్వండి... పోనీయ్ చక్రవర్తి చేత ఇప్పించేదా?”

“వద్దు... వద్దండీ వద్దు!” కంగారు పడిపోయాడు. “పోలీసులతో ఆ పని అవుతుందనుకుంటే ఎప్పుడో చేసి ఉండే వాడినండి... నన్ను మన్నించి ఆ ఒప్పందం రద్దు చేయించండి... వారి డబ్బు వారికిచ్చేస్తాను... దయతో నాకీ నిద్రలేని రాత్రులను దూరం చేయండి... మీ మేలు జీవితంలో మర్చిపోలేను!” ప్రకాశరావు మరో మాట

మాట్లాడకుండా ఫోన్ ఆఫ్ చేసేశాడు.

* * *

మంగళవారం బందుకు పిలుపు ఇవ్వటంతో సాయిరాంపురంలో వీధులన్నీ విద్యార్థులతో నిండిపోయినయి.

రంజనీ మేడమ్ చనిపోయి పదిహేను రోజులయినా ఆమె మరణానికి కారణాల్ని, కారకుల్ని కనిపెట్టలేకపోయిన పోలీసుల అలసత్వాన్ని, అసమర్థతను ఎండగడుతూ విద్యార్థులచేత ధర్నా చేయించటానికి చక్రవర్తి, భ్రమర, ఆంజనేయులు నిర్ణయించారు. దానికి పూర్ణచంద్రరావుగారి ఆశీస్సులు ఉండనే వున్నయి.

రంజని పనిచేసిన నాగరాజు స్కూల్లో ఆమె మీద సానుభూతి వున్న టీచర్లతో రహస్యంగా చర్చించాడు ఆంజనేయులు. తన తప్పు లేకపోయినా తనని పోలీసులు సెల్‌లో పెట్టటాన్ని భరించలేకపోతున్నాడు అతడు. అది నాగరాజు పనే అయివుండాలి. అతడి అనుమానాన్ని బలపరుస్తూ రంజనిది ఆత్మహత్యకాదు, హత్యేనని పోస్ట్‌మార్టమ్ రిపోర్టువచ్చింది.

ఆమె చనిపోయిన క్రితంరోజు సాయంత్రం రంజని ఆంజనేయులుతో కలిసి స్కూలునుంచి వెళ్ళటం చాలామంది చూచారు. అది అవకాశంగా తీసుకుని ఇన్‌స్పెక్టర్‌కు ఎవరో ఎక్కించారు. కానీ విశ్వనాథంలాంటి పేరున్న సీనియర్ లాయర్ వస్తాడని ఆ ఇన్‌స్పెక్టర్ ఊహించలేకపోయాడు. ఎఫ్పైయార్ రాయకపోవటంతో ఆయన ప్రశ్నలకు గిలగిలలాడి ఆంజనేయులుని వదిలిపెట్టవలసి వచ్చింది. లేకపోతే అతడిమీద హత్యానేరం తిరుగులేని విధంగా మోపబడేది!

పదయ్యేటప్పటికి స్కూలు పిల్లలంతా రోడ్లమీదకు వచ్చేశారు. అందులో నాగరాజు స్కూల్లో చదువుతున్న విద్యార్థులే కాదు, కొంతమంది టీచర్లు కూడా ఉండటం భుజంగాన్ని అసహనానికి గురిచేసింది. వెంటనే పోలీస్ స్టేషన్‌కు ఫోన్‌చేసి ఈ ధర్నా హింసాత్మకంగా మారుతుందేమో జాగ్రత్తగా ఉండమని ఆ ఊరి సర్పంచ్‌గా చెప్పి వెళ్ళి మాణిక్యం ఇంట్లో కూర్చున్నాడు.

“ఆ ఏర్పాట్లేవో చేశానుగాని, మీరు టెన్షన్ పడబోకండి!” ఇన్‌స్పెక్టర్ చిన్నగా నవ్వి అన్నాడు.

వాళ్ళకు ఆ ఇన్‌స్పెక్టర్‌తో ఇంకా బాగా చనువు ఏర్పడలేదు. అతడి తీరు తమని దూరంగా ఉంచ ప్రయత్నిస్తున్నాడా అన్న అనుమానాన్ని కలిగిస్తోంది భుజంగానికీ, నాగరాజుకి. పాత అతనయితే తమకు చెప్పకుండా ఏ చిన్నపనీ చేసేవాడు కాదు.

వరుసల్లో నడుస్తున పిల్లల ముందు చక్రవర్తి, ఆంజనేయులు, భ్రమరా నడుస్తున్నారు. చాలామంది పిల్లల చేతుల్లో స్లోగన్స్ వ్రాసిన అట్టలు ఉన్నయి.

‘రంజనీ మేడమ్‌ను హత్య చేసిన హంతకుల్ని వెంటనే పట్టుకోండి!’

‘హంతకులకు ఉరిశిక్ష విధించాలి!’

‘అసమర్థ పోలీసులను శిక్షించండి!’

‘రంజని మేడమ్ అమర్ రహే’ అంటూ అందరూ అరుస్తున్నారు.

నాగరాజు ఆదివారం రాత్రి హైదరాబాద్ వెళ్ళాడు. ఎయిడెడ్ పోస్టులకు రావాల్సిన గ్రాంటు మూడు నెలలబట్టీ ప్రభుత్వాన్నించి రావటంలేదు. స్కూలువారు పంపిన వినతుల మీద రకరకాల అభ్యంతరాలు రాస్తూ డైరక్టరేట్‌లో ఆపేశారు. జిల్లా కేంద్రంవారు కూడా హైదరాబాద్‌నుంచి అనుమతి వస్తేనేగాని తామేం చేయలేమని చెబుతున్నారు. ఆపైన మరి కొన్ని ఊళ్ళలోని విద్యాలయాలకు గూడా రాబోయే పదోతరగతి పరీక్షలకు తమ స్కూలును కేంద్రంగా చేయాలని నాగరాజు కోరుకుంటున్నాడు. దానికీ ప్రభుత్వ అనుమతి కావాలి. పరీక్షలు దగ్గరకు వస్తున్నయి. ఇవన్నీ చూసుకుని రెండు మూడు రోజుల్లో వస్తానని నాగరాజు వెళ్ళటాన్ని ఆంజనేయులూ మంచి అవకాశంగా తీసుకున్నాడు.

రెండు స్కూళ్ళ పిల్లలూ కలిసి ఐదారు వందలమంది దాకా ఉన్నారు.

గత ఇరవై సంవత్సరాలుగా ఏకఛత్రాధిపత్యంగా భుజంగం ఆధ్వర్యంలో ఏలుబడి సాగుతున్న సాయిరాంపురంలో ఇంతవరకూ ఎప్పుడూ ఇలాంటి బంద్ జరగలేదు.

దాంతో చాలామంది ఊరి జనం ఇళ్ళల్లోనుంచి బయటకు వచ్చి కళ్ళు పెద్దవి చేసుకుని వింతగా చూడసాగారు. నాగరాజు, భుజంగం అంటే పడని జనం ఆ ఊళ్లో చాలా మంది వున్నారన్న నిజాన్ని ఆరోజు సంఘటన రుజువు చేస్తోంది. అప్పటికే రంజని విషయంలో నాగరాజు హస్తం ఉన్నదంటూ ఆంజనేయులు ఊరంతా గుప్పుమనిపించాడు.

మాణిక్యం వెంటనే హైదరాబాద్‌లో వున్న తమ్ముడికి ఫోన్ చేసి ఇక్కడ జరుగుతున్న గొడవంతా చెప్పింది.

స్కూలు పిల్లలంతా ఓ గంటపాటు ఊరి వీధులన్నీ తిరిగి చివరకు పోలీస్ స్టేషన్‌ముందు రోడ్డుమీద అరుస్తూ కూర్చున్నారు.

ఆ సమయంలో ఇన్‌స్పెక్టర్ స్టేషన్‌లో లేడు. పై అధికారులు రమ్మనమంటే జిల్లా కేంద్రానికి వెళ్ళాడు.

స్టేషన్‌ముందు జరుగుతున్న ధర్నా గురించి హెడ్ కానిస్టేబుల్ ఫోన్‌లో చెప్పటంతో వెంటనే బయల్దేరి వచ్చాడు జీపులో ఇన్‌స్పెక్టర్. ఆంజనేయుల్ని చూస్తూనే అరవటం మొదలుపెట్టాడు.

పది నిముషాల తరువాత అనునయంగా, "మీ అదృష్టం బాగుండి కటకటాల వెనుక కూర్చోకుండా బయట తిరుగుతున్నారు... ఇప్పుడు గోలచేయవద్దు... రెండు మూడు రోజుల్లో నిజాలన్నీ బయటకు వస్తయి... నేను ఆ పనిమీదే గుంటూరు వెళ్ళింది కూడా!" అని చెప్పాడు.

తరువాత ఐదు నిముషాల్లోనే లాయర్ విశ్వనాథం మాట్లాడాడు ఆంజనేయులుతో ఫోన్‌లో. ఆయన సలహాతో పిల్లలనందరినీ ఇంటికి పంపేశారు.

మరునాడు తెల్లవారుజామున ఐదు గంటలప్పుడు నాగరాజు హైదరాబాద్‌నుంచి వచ్చాడు ఎక్కడ పనులు అక్కడే వదిలేసి అక్క సలహామీద.

"ఏమైంది... వెంటనే వచ్చేయమంటూ ఫోన్ చేశావ్!... చేసుకోనీయ్ గోల...

ఏమౌతుంది?" ఇంట్లోకి వస్తూనే చిరాకు పడ్డాడు అక్కమీద.

"వాళ్ళ గోలకు భయపడి కాదు నిన్ను రమ్మనమన్నది... నిన్న రాత్రి ఏడు గంటలప్పుడు కొత్త ఇన్‌స్పెక్టర్ ఇంకెవరో నలుగుర్ని ఏసుకువచ్చి, హెడ్‌మాస్టర్‌గారిని బలవంతాన స్కూలుకు తీసుకువెళ్ళి ఆఫీసు తెరిపించి ప్రతినెలా టీచర్లకు జీతాలిచ్చే రిజిస్టర్లను, మిగతా ఎకౌంట్ పుస్తకాలను జీపులో వేసుకు వెళ్ళాడుట!" అన్నది గుసగుసగా. "ఫోన్‌లో చెబితే అంత దూరాన వున్న నువ్వు కంగారు పడతావని చెప్పలేదు!"

"బావగారు ఏం చేస్తున్నారు... నీతో ముచ్చట్లాడుతూ చూస్తూ కూర్చున్నాడా?" అరుస్తున్నట్లుగా అడిగాడు.

"సర్పంచ్‌గారికి తెలియకుండా ఆ సమయంలో స్కూలు తెరవనని హెడ్మాస్టరుగారు అన్నా, పిచ్చివేషాలు వేస్తే బొక్కలో వేస్తానని దబాయించి ఫోన్ చేయటానికి వీల్లేకుండా ఆయన సెల్ కూడా లాక్కొని, తీసుకువెళ్ళి తాళాలు తీయించి రికార్డులన్నీ తీసుకు వెళ్ళాడట... ముందస్తుగా మీ బావగారికీ ఆ విషయం తెలియదు!" అన్నది భయంభయంగా తమ్ముడి వంక చూస్తూ. "వాడు రాక్షసుడిలా వున్నాడు... మనకు తెలియకుండానే చేస్తున్నాడంటే మన చేతికి చిక్కేలా లేడు!"

"ఏం చేస్తాడుట రికార్డ్సన్నీ తీసుకువెళ్ళి... అవి పక్కాగా వున్నయి... పదిహేనురోజుల క్రితమే జిల్లా కేంద్రంనుంచి విద్యాశాఖవారు వచ్చి లెక్కలన్నీ తనిఖీచేసి, చక్కగా రాస్తున్నామని మెచ్చుకుని మరీ వెళ్ళారు... వాడి బొంద... వాడికి అందులో దొరికేదేమీ లేదు!" అన్నాడు విసురుగా.

"అందుకే ఎందుకైనా మంచిదని నిన్ను వెంటనే రమ్మనమన్నది... రేపెళ్ళి మన పుస్తకాలన్నీ తీసుకు వచ్చేసేయ్... నీకు తెలుసుగదా ఎవడిని ఎలా తెలివిగా బుట్టలో వేసుకోవాలో!" అన్నది కళ్ళు చికిలించి తమ్ముడినే చూస్తూ. "బావగారు కాస్త మెతకరా ఇలాంటి విషయాలల్లో... నువ్వు వెనుక ఉంటేనేగాని ఆయనేం చేయలేడు!... అసలు అదికాదు నాకాశ్చర్యం కలిగిస్తోంది... ఇంత గొడవ జరిగినా మనవాడొక్కడూ మనింటికి

వచ్చి చావలేదు ఇంతవరకూ!"

"వాళ్ళెక్కడ తాగి తందనాలాడుతున్నారో... అయినా నిన్నగాక మొన్న వచ్చినవాడు తోక ఝూడిస్తుంటే చూస్తూ కూర్చుంటామనుకుంటున్నాడా... వాడి సంగతి నేను చూస్తాలే... కాదంటే చిటికేయటమే!"

* * *

పదవుతుండగా నాగరాజు భుజంగంతో కలిసి స్టేషన్‌కు వెళ్ళి కొత్త ఇన్‌స్పెక్టర్ సుభాష్‌ను కలిశాడు.

జేరింతరువాత ఇంతకు ముందే ఒకసారి ఆయన్ను మర్యాదపూర్వకంగా కలిసి ఉండటంతో వాళ్ళను చూస్తూనే గుర్తుపట్టాడు అతడు.

"రాత్రి మా స్కూలుకు వెళ్ళి ఎకౌంట్స్ పుస్తకాలన్నీ తీసుకు వెళ్ళారట!" అన్నాడు నాగరాజు. "నన్ను తెచ్చి చూపించమన్నా చూపించేవాడినే కదా... మూసిన స్కూలును తెరిపించి మరీ బలవంతాన ఎందుకు తీసుకు వెళ్ళవలసి వచ్చింది!" ఎంత నిగ్రహించుకోవాలనుకున్నా కంఠంలో తీవ్రతను అదుపులో పెట్టుకోలేకపోతున్నాడు.

సుభాష్ చిరునవ్వు నవ్వి, "ముందు కూర్చోండి... మీరు ఊళ్ళో లేరని తెలియటంతో హెడ్మాస్టర్‌ని తీసుకు వెళ్ళవలసి వచ్చింది... దానికి కారణం గుంటూరు నుంచి వచ్చిన ఏసీబీ టీం అప్పటికప్పుడు ఆపని జరగాలనటమే!"

"వాళ్ళెందుకు వచ్చారు?" అసహనంతో కంఠాన్ని మరింతగా హెచ్చించి అడిగాడు నాగరాజు.

"అది నాకెలా తెలుస్తుంది... వాళ్ళకు సాయంగా ఈ యేరియా ఇన్‌స్పెక్టర్‌గా నన్ను రమ్మనమని కోరారు, వెళ్ళాను... మీ రికార్డ్సన్నీ వాళ్ళే పట్టుకువెళ్ళారు... మీరు గుంటూరు వెళ్ళి దానికి కారణాలేమిటో తెలుసుకోండి!"

"వాళ్ళకేముంటుంది అవసరం నా పుస్తకాలతో?" నీరసంగా అన్నాడు.

"తెలియదు!... మీరున్నట్లయితే తెలుసుకుని ఉండేవారు!"

"మన ఊరుమీద దాడి చేసి ఓ అత్యున్నతమైన స్కూలు రికార్డులన్నీ బయట వాళ్ళెవరో వచ్చి పట్టుకు వెళుతుంటే ఈ యేరియా పోలీసు ఆఫీసరుగా అడ్డుపడకపోంగా, వివరాలు గూడా తెలుసుకోలేదంటే నాకు చాలా అవమానంగా వున్నది!" నిస్సహాయతలోనుంచి కోపం పుట్టుకు వచ్చింది నాగరాజుకు అతడు చెప్పిన సమాధానం తీరుకు.

పక్కన కూర్చున్న భుజంగం అతడిని అనునయిస్తున్నట్లుగా మీద చేయివేస్తే విసురుగా తోసి వేశాడు.

"మాకు కొన్ని వృత్తి ధర్మాలుంటయి... మాకు కాని విషయాలల్లో మేం జోక్యం చేసుకోం... అందునా వచ్చింది మా తోటి విభాగం వారు... చెప్పాలనుకుంటే వాళ్ళే చెప్పివుండేవాళ్లు!" నాగరాజును కత్తిరిస్తున్నట్లుగా అన్నాడు.

"నిన్నటికి నిన్న ఆ వెధవలు ఎవతో ఎక్కడో ఆత్మహత్య చేసుకున్నదని బందు పిలుపునిచ్చి ప్రశాంతంగా ఉన్న ఊరుని నలుగురు నోళ్ళలో నానేలా చేస్తే ఉతికి ఆరేయాల్సిందిబోయి బ్రతిమిలాడి పంపిస్తారా?" లేచి నిలబడ్డాడు విసురుగా నాగరాజు. "అది చచ్చింది... తీసుకు వెళ్ళి పాతిపెట్టారు... ఇక మిగిలిందీ, మీరు చేసేది ఏమున్నది?"

"మొదటిది నా దగ్గరున్న రికార్డ్స్ ప్రకారం అది ఆత్మహత్య కాదు, హత్య... రెండోది ప్రశాంతంగా జరుపుతున్న చిన్న పిల్లల నిరసన మీద కఠినంగా ప్రవర్తించి ఊరి ప్రశాంతతను చెడగొట్టలేను!" అతడి కంఠంలోనూ నాగరాజు కరుకు మాటలతో సౌమ్యత తగ్గుతున్నది.

"అంటే అలాంటి వెధవలు ఊరిని అల్లకల్లోలం చేస్తున్నా చూస్తూ ఒత్తాసు పలుకుతారన్నమాట!"

"నేను ఎలాంటి వెధవలకు సపోర్ట్ చేయాలనుకోను... చేయను!" చిరునవ్వే

నవ్వాడు సుభాష్.

అతడి నవ్వుకు నాగరాజుకు ఒళ్ళు సలసలా కాగిపోయింది. "మరేంటండి మీరు చేసింది... క్రితంరోజు ఆ ఆంజనేయులుగాడు మా స్కూలుకొచ్చి ఏవేవో మాటలు చెబుతూ మా టీచర్‌ను వెంటబెట్టుకు వెళ్ళాడు... తెల్లవారేటప్పటికి ఆ అమ్మాయి శవమై వాడి తోటలోనే తేలింది... అది హత్యో, ఆత్మహత్యో దేవుడికి తెలుసు... వాడిమీద ముందు కేసు బుక్‌చేసి కటకటాల వెనక్కు తోయకుండా, వాడు రోడ్డెక్కి వీరంగం వేస్తుంటే అన్నీ సర్దుకుంటయి రెండు రోజులు ఆగండి అనటంలో అర్థమేమిటి?... ఇదా మీరు ఈ ఊరుకు చేసే న్యాయం!"

"మాట్లాడుతూ తీసుకు వెళ్ళినంత మాత్రాన అతడే ఆమె చావుకు కారణం అని ఎలా అంటారు?... అయినా ఆమెకు బంధువయిన అతడే ఆమెను చంపితే తన తోటలోని చెట్టుకే ఆ శవాన్ని ఎందుకు వ్రేలాడదీస్తాడు!"

"ఇలాంటి అనుమానాన్నే ప్రజల్లోనూ, న్యాయమూర్తికి కలిగించాలనే ఉద్దేశ్యంతో...!" ఆ మాత్రం ఊహించలేరా అన్నట్లుగా నిరసనగా అంటూ లేచి నిలబడ్డాడు నాగరాజు.

భుజంగమూ లేచాడు. "ఈ ఊరి సర్పంచ్‌గా నేను మీనుండి కోరుకునేది ఒక్కటే... ఇంతవరకూ ఈ ఊళ్ళో ఏ అవాంఛనీయ సంఘటనా జరగకుండా, ప్రశాంతంగా జరిగిపోయేలా నేను చూస్తున్నాను. దాన్ని మీరు విచ్ఛిన్నం చేయబోకండి!"

సుభాష్ గుండెల్లో భుజంగం వ్యంగ్యపు మాటలకు, కోపం గుప్పుమన్నది. కానీ వయస్సు తెచ్చిన అనుభవంతో, పెదవులకు చిరునవ్వు పులుముకుని, "నా కోరికా అదే!" చేయిజాచాడు చేయి కలపండి అన్నట్లుగా చూస్తూ..

బావా, బావమరుదులిద్దరూ బయటకు వచ్చేశారు.

జీపు ఆ వీధి మలుపు తిరిగింతరువాత, "కోపంతో పనులు కావు... దేన్నయినా సానుకూలంగా చేసుకురావాలి... ప్రతిదానికీ గంతులేస్తే నష్టపోయేది ఎవరు...

మనమే!" అన్నాడు భుజంగం.

"వాడొట్టి వెధవలాగున్నాడు... వాడి సంగతేదో నేను చూస్తానులే... అన్నీ ప్రశాంతంగా జరగాలంటే జరగవు... నాకు బోడి సలహాలు ఇవ్వబోకు... రేపు టెన్త్ క్లాసు పరీక్షలలోగా వాడినిక్కడనుంచి లేపేయాలి... అప్పుడే ఆ పరీక్షల్లో నాలుగు రూపాయలు మనకు దక్కేది!"

అతడి మాటలకు భుజంగానికీ చర్రున కోపమొచ్చింది. "తోట విషయంలో ఆంజనేయులు శత్రువయ్యావు... ఇంటి విషయంలో చక్రవర్తి జీపీఏను రద్దు చేసుకోనంటూ భీష్మించుకు కూర్చున్నాడు... అటు భ్రమర ఈ ఊరెందుకొచ్చిందో అర్థంకాకుండా వున్నది... వీళ్ళందరికీ ఆ ముసలాడు పూర్ణచంద్రరావు మద్దతున్నట్లుగా అనిపిస్తున్నది... ముచ్చుముఖం వెధవ... సంవత్సరాలుగా వస్తున్న ఆచారానికి భిన్నంగా స్వాతంత్ర్య దినోత్సవానికి జండా ఎగరవేయటానికి నన్ను పిలవలేదు... ఎవడో అనామకుడిని తీసుకు వచ్చి ఎగరేయించాడు... సోమశేఖరం చెప్పేదాని ప్రకారమయితే రేపు రిపబ్లిక్‌డేకి గూడా పిలవడు... రిటయిరవ్వబోతున్న ఆయనగారే ఎగరేస్తాడట... ఏద్వనీ... తొందరగా రిటయిరయితే పీడా పోతుంది... ఆపైన ఇన్నాళ్ళూ వున్న ఆ ఇన్‌స్పెక్టర్ మనవాడవ్వటంతో మనకు ఏం చేసినా చెల్లుబాటయింది... ఈ కొత్తవాడూ మన దారిలో పడిందాకానైనా మన జాగ్రత్తలో మనం ఉండి లౌక్యంగా మెలగటం తెలుసుకోవాలి... మన ఊరు మున్సిపాలిటి అయినా కాకపోయినా వచ్చే సంవత్సరమే ఎన్నికలు వస్తయి! నా బోడి సలహాలు అవసరం లేదనుకుంటే నన్నెప్పుడూ ఎక్కడికీ తీసుకు వెళ్ళబోకు!" గొంతు పెంచి అరుస్తున్నట్లుగా అన్నాడు.

"నువ్వేం రానక్కరలేదులే... నాకు తెలుసు ఎప్పుడు ఎవరిని ఏం చేయాలో!" గీరగా అన్నాడు నాగరాజు.

* * *

"మీ కాబోయే అత్తగారు రాత్రి ఫోన్ చేసిందయ్యా, చక్రవర్తి!"

మధ్యాహ్నం పన్నెండు గంటలప్పుడు క్లాసుకు, క్లాసుకూ మధ్య ఖాళీ సమయంలో

ఆయన గదిలోకి వచ్చిన అతడితో పూర్ణచంద్రరావుగారు అన్నారు. ఆ సమయంలో ఆ గదిలో వాళ్ళిద్దరే ఉన్నారు.

"ఏమిటిట... కూతురు వివాహానికి తొందరపడుతున్నదటనా?" నవ్వుతూ అడిగాడు.

"వచ్చే శనాదివారాలల్లో భ్రమర ఏలూరు వెళుతున్నదట... నిన్ను గూడా వాళ్ళమ్మాయితో కలిసి రమ్మనమని చెప్పమన్నది!" అన్నాడు ఆయన. "నిన్ను చూస్తుందట!"

కొద్దిక్షణాలపాటు ఆలోచిస్తున్నట్లుగా ఆగిపోయాడు.

రెండు రోజుల క్రితమే రిపబ్లిక్‌డే ఉత్సవాలు ఘనంగా జరిగినయి. పూర్ణచంద్రరావుగారే జండా ఎగరేశారు. తరువాత వివిధ పోటీల్లో విజేతలకు ఆయన చేతుల మీదగా బహుమతి ప్రదానం జరిగింది.

ఈ కార్యక్రమాల ఏర్పాట్లలోనే భ్రమర గత నెలంతా ఏలూరుకు వెళ్ళకుండా ఉండిపోయింది.

"వెళ్ళటంలో తప్పులేదుగాని... మా అమ్మా నాన్నల అనుమతి లేకుండా వెళ్ళటం నాకు భావ్యంకాదు!"

"భేష్! అదయ్యా సంప్రదాయమంటే... అందుకే నువ్వు నాకు నచ్చేది... నువ్వు ఆ అమ్మాయితో పెళ్ళికాకుండానే ఆ ఊరు వెళ్ళటం నాకూ మనస్కరించటంలేదు... అయినా నీ అభిప్రాయం తెలుసుకుని ఆమెకు చెప్పాలనే ఉద్దేశ్యంతో నిన్ను అడిగి చెబుతాలే అని చెప్పాను!" అన్నాడు తృప్తిగా, అభిమానంగా చక్రవర్తి వంక చూస్తూ ఆయన.

"అన్నీ బాగుండి అనుకున్నది అనుకున్నట్లుగా అయితే రేపు శ్రీరామనవమికల్లా మా తాతగారిల్లు నా స్వంతమవ్వాలి... అప్పుడు మా వాళ్ళంతా ఇక్కడకు వస్తారు... అదే సమయంలో భ్రమర తల్లినీ, మిగతా కుటుంబసభ్యులనీ రమ్మనమంటే

సరిపోతుంది!"

"భేష్! మంచి ఆలోచనే... అలాగే చెబుతాను!"

చక్రవర్తి ఆగలేదు. "అలా కాని పక్షంలో, మా తాతగారి గుండెల్లో ఎంతో ఆత్మీయంగా వున్న స్వర్గంలాంటి ఆ ఇంటి చిత్రం మీద నెత్తుటి జల్లు పడుతుంటే చూస్తూ నేనీ ఊళ్ళో ఉద్యోగం చేయలేను... బదిలీ చేయించుకుని మరెక్కడికయినా వెళ్ళిపోతాను... అప్పుడు భ్రమర నా సహచరణి కావాటమా లేదా అనేది ఆమె నిర్ణయానికే వదిలేస్తాను!"

ఆ మాటలు వింటూనే కళ్ళు మూసుకు తెరిచాడు పూర్ణచంద్రరావుగారు, 'ఎట్టి పరిస్థితులలోనూ అట్లా కాగూడదు' అన్నట్లుగా.

చక్రవర్తి బయటకు వచ్చేశాడు. సరిగ్గా ఆ సమయంలోనే భ్రమర హెడ్మాస్టర్‌గారి గదిలోకి వస్తూ ఎదురుబడింది.

ఆమెను చూస్తూనే ఆగి, దగ్గరకు రాగానే చిన్నగా, "ఎందుకో నిన్ను తిట్టాలనిపిస్తోంది... రేపు రాత్రి మీ ఇంటికి భోజనానికి వచ్చేదా?" అన్నాడు నవ్వుతూ.

"ఏం... ఈరోజుకేమైంది... తిథి బాగాలేదా?"

"అదేంకాదు... నేను వస్తున్నానంటే స్పెషల్స్ చేయకుండా వుండవుకదా... రేపు రెండో శనివారం మనకు శెలవని... తీరిగ్గా చేసే అవకాశముంటుందని!"

"ఓకే... ఫైన్... నన్ను ఏ విషయంలో తిట్టాలనుకుంటున్నదీ చెబితే అంబులపొదిలో కావాల్సిన బాణాలను సమకూర్చుకుని మిమ్మల్ని ఎదుర్కొనేందుకు సిద్ధంగా వుంటాను!" అన్నది నవ్వుతూ.

"కాబోయే మొగుడనైనా చూడకుండా నా మీద బాణాలు వేయటానికి సిద్ధపడతావా, సరే... రేపు చిన్నచిన్న బంగాళదుంపలు తెచ్చి వేపుడు చేయి!"

"వాటితో నన్ను కొట్టాలనా?"

"నాకిష్టమయిన వాటిని తింటూ నీ మీద కోపాన్ని తగ్గించుకుందామని!" వడివడిగా అడుగులు ముందుకు వేశాడు, దూరంగా తమవైపుకు సోమశేఖరం రావటాన్ని చూస్తూనే.

ముఖం వెనక్కు తిప్పి మురిపెంగా చక్రవర్తిని చూస్తూ ఉండిపోయింది భ్రమర!

* * *

రాత్రి ఏడుగంటలప్పుడు సాయిరామపురంలోని 'అనాథ స్త్రీ శరణాలయం' వాకిటిముందు ఓ వ్యక్తినిలుచొని తలుపు తట్టాడు.

ఎదురుగా ఉన్న కోదండరామస్వామి దేవాలయపూజారి అప్పుడే నైవేద్యం పెట్టి హారతిచ్చి గుడిమూసి, సైకిల్‌ను బయటకు తీసుకు వస్తున్నాడు. ఆయనా పెద్దవాడయ్యాడు. అప్పుడు బయల్దేరితేనే మూడు కిలోమీటర్ల దూరంలో వున్న తను ఉండే ఊరికి ఎనిమిదలోపు జేరగలిగేది.

బయటకు వస్తూనే ఎదురింటిముందు నిలుచున్న ఆ కొత్త మనిషిని చూసి ముఖం చిట్లించి, 'దరిద్రం... దరిద్రమని... ఎప్పటికి వదులుతుందో ఈ పీడా ఈ వీధికి' అనుకుంటూ సైకిలెక్కి విసురుగా వెళ్ళిపోయాడు.

ఆ ఇంటి తలుపు తెరుచుకున్నది. అవతారం అలవాటుగా తలుపు కొద్దిగా తెరిచి 'ఎవరా వచ్చింది' అన్నట్లుగా చూచాడు.

తెరిచిన తలుపు వెనుక వున్న అవతారాన్ని చూస్తూనే ఆ అగంతకుడు, "నమస్కారమండి... నేను హైదరాబాద్‌లోని ఒక సేవాసంస్థ ప్రతినిధిని... ఈ అనాథాశ్రమాన్ని నడుపుతున్నది మీరేగదా... మీతో మాట్లాడాలి... లోపలికి రావచ్చా?" అన్నాడు చేతిలో సంచీ వున్నా అలాగే ఎత్తి ఆయనకు నమస్కరిస్తూ.

"అయ్యో! అదేమిటి... ఆనందంగా రావచ్చు!" అంటూ తలుపులు రెండూ బార్లా తెరిచి, "రండి... రండి!" అంటూ అతడు లోపలకు రాగానే తలుపులు మళ్ళీ మూసి ఘడియపెట్టాడు. "ఏం పనిమీద వచ్చారు!"

"కూర్చుని మాట్లాడుకుందామా?"

"అలాగే... నా ఆఫీసు గది ఎప్పుడూ ఖాళీగానే వుంటుంది!" అంటూ తన గదిలోకి తీసుకు వెళ్ళాడు అవతారం.

ఆ గదిలో ఓ టేబులు, కుర్చీగాకుండా ఓ మంచమూ, పరుపూ, దానిమీద తెల్లటి దుప్పటీ వేసివున్నయి.

"ఎన్నాళ్ళయిందీ ఈ ఆశ్రమాన్ని మీరు ప్రారంభించి?"

"ఎక్కడండీ నాలుగు నెలలే అయింది!"

"ఎంతమంది ఉన్నారు ఇందులో?"

"డబ్బులిచ్చే దాతలు లేక ఇప్పటికి పదిమందినే ఉంచగలిగాం!"

"నేను చెప్పాను గదా ఓ సేవాసంస్థకు ప్రతినిధిగా వచ్చానని... నాపని జిల్లాలో వున్న ఇలాంటి అనాధాశ్రమాల వివరాలు సేకరించి వాటికి ధనసాయం చేయటమే నా విధుల్లో ముఖ్యమైనది!"

"ఇంకేం... మాకు కావాల్సిందికూడా మీలాంటి వారే... మా దగ్గరున్న అనాధలను ఇంటర్వ్యూ చేస్తానంటే ఒక్కొక్కరినీ పిలుస్తాను... వారి దీనగాధలు వింటే మీ గుండె తరుక్కుపోతుంది!"

"అక్కర్లేదండి... పెద్దవారు మీరు చెబుతున్నారు చాలు... మీ ఆశ్రమ పూర్తి వివరాలు వ్రాసి ఇవ్వండి... మీకు సంవత్సరానికి ఎంత ఖర్చవుతుంది, ఇప్పుడున్న వనరులేమిటి... మేం ఎంత సాయం చేస్తే మీకు వెసలుబాటుగా వుంటుంది లాంటి విషయాలతో పాటు మీ బ్యాంక్ ఎకౌంట్ నంబరు కూడా ఇవ్వండి. నేను నా అభిప్రాయాన్ని దానికి జతచేసి హైదరాబాద్‌లోని మా సంస్థ ఆఫీసుకు పంపిస్తాను... అప్లికేషన్ అందిన పదిహేనురోజుల్లోగా వాళ్ళు ఎంత ఇవ్వగలిగేది మీకు తెలియబరుస్తూ ఆ సొమ్మును మీ బ్యాంకు ఖాతాలో జమచేస్తారు!"

"చాలా ఆనందమండి... మొత్తం వివరాలన్నీ ఓ అరగంటలో వ్రాసి ఇస్తాను!"

"అంత హడావుడేంలేదు... మీ ఊళ్ళో మంచి హోటల్ ఏదో చెప్పండి... రాత్రికి అక్కడ బసచేసి ఉదయాన్నే మళ్ళా వస్తాను!"

అవతారం నవ్వుతూ, "ఇది మీలాంటి వారు ఉండేటంత హోటళ్ళున్న ఊరు కాదండి... అయినా హోటల్ దేనికండి... నా గదిలోనే ఈ మంచంమీదే పడుకోవచ్చు... ఇక భోజనమంటారా నాతోపాటే మీరూ చేయవచ్చు... పొద్దున్నే లేచి టిఫిన్ తిని, కాఫీ త్రాగి నేను వ్రాసిన వివరాలు తీసుకుని వెళ్దురుగాని... మీకు మంచి హోటలే కావాలనుకుంటే మాత్రం అటు విజయవాడగాని, ఇటు గుంటూరుగాని ఇంత రాత్రిపూట వెళ్ళకు తప్పదు... అలా వెళ్ళాలన్నా రవాణా సౌకర్యమూ అంతగా లభించదు!" అన్నాడు వినయంగా. ఎట్లాగయినా రాత్రికి ఆయన్ను ఇక్కడే వుంచి, అన్ని సదుపాయాలు ఏర్పాటు చేస్తే, సంబరపడి వీలయినంత ఎక్కువ సొమ్మును తమకు వచ్చేలా చేయవచ్చు!

చివరకు అతడు అక్కడ ఉండటానికే అంగీకరించటంతో సంపెంగకు, సన్నజాజికి, మల్లెతీగకు, అతడికి చేయాల్సిన మర్యాదలు గురించి చెప్పి, తను ఆశ్రమం గురించిన వివరాలు రాయటంలో నిమగ్నుడయ్యాడు అవతారం.

ఆ అగంతకుడూ తను వచ్చిన పని తేలిగ్గా అవుతుండటంతో సంతోషించాడు.

అవతారం ఆ గదిని అతడికి వదిలేసి ఆ రాత్రి మరో గదిలో పడుకున్నాడు.

తెల్లవారుజామున మూడు గంటలప్పుడు చలిగాలి విపరీతంగా వీస్తున్న సమయంలో ఆ అనాథాశ్రమ ఇంటితలుపు మీద దడదడా శబ్దమయింది. అవతారం చికాగ్గా మంచంమీదనుండి లేచాడు. అతడికి అలవాటే అర్ధరాత్రప్పుడు, అపరాత్రప్పుడు అతిథులు ఆ ఇంటికి రావటం తెల్లవారిందాకా ఉండి వెళ్ళిపోవటం.

కొద్దిగా తెరిచి ఎవరో పాతకాపే అయివుంటాడులే అన్నట్లుగా చూచాడు బయటకు.

అతడు తలుపు తెరుస్తుండగానే బయటనుంచి బూటు కాలుతో ఒక్క తన్ను తన్నటం జరిగింది. అసలే అవతారం ముసలివాడు, పీలగా వుంటాడు ఆ తాపుకు వెనక్కు తూలిపోతూ తలుపును గట్టిగా పట్టుకున్నాడు.

వాకిటి ముందు పోలీసు వ్యాన్!... అవతారం కంగారు పడిపోయాడు.

"ముందు వీడిని రెండు చేతులూ కట్టేసి వ్యాన్‌లో పడేయండి. జేబులో సెల్‌ఫోనుంటే తీసేసుకోండి!" అంటూ అతడు వడివడిగా లోపలకు వచ్చాడు. అతడి వెనుకగా మరో పదిమంది కానిస్టేబుల్సు చేతిలో లాఠీలతో ఇంటిని చుట్టివేశారు.

తరువాత అరగంటలోనే ఆ ఇంట్లోని ఆడా, మగా అందరూ పోలీసు వ్యాన్‌లోకి ఎక్కటమే కాకుండా, ఆ ఇంట్లో ఉన్న సామాన్లన్నిటినీ ఆ వ్యానుకు వెనగ్గా వున్న రెండు లారీల్లోకి ఎక్కించి, ఆ ఇంటికి తాళంవేసి సీల్ వేశారు పోలీసులు.

అవతారం నోరు తెరుచుకుని, కన్నార్పకుండా జరుగుతున్నవన్నీ చూస్తునే ఉన్నాడు. నోరు తెరిస్తే అతడికి అటూ ఇటూ నిలుచున్న పోలీసుల చేతుల్లోని లాఠీలకు పనితగులుతుందనే విషయం అతడికి తెలుసు!

రాత్రి హైదరాబాద్‌లో వున్న ఓ సేవాసంస్థకు ప్రతినిధిగా వచ్చానన్న వ్యక్తి పోలీసు మనిషని, అతడు రహస్యంగా ఆ ఇంట్లో వున్న అందరి ఫొటోలను తీసి, వాటిని ఎప్పటికప్పుడు తన సెల్‌నుంచి గుంటూరులోని కంట్రోల్‌రూంకు మెయిల్ చేశాడని అవతారం ఊహించలేకపోయాడు!

* * *

సూర్యోదయం అయిన అరగంటలోనే పాత కోదండరామస్వామి ఆలయం ఎదురుగ్గా వున్న అనాథ స్త్రీ శరణాలయంలోని అందరినీ అర్థరాత్రప్పుడు పోలీసులు పట్టుకెళ్ళటమే కాకుండా అందులోని సామాన్లన్నీ లారీలల్లోకి ఎక్కించి ఆ ఇంటికి సీలువేశారని సాయీరాంపురంలోని అందరికీ తెలిసిపోయింది.

మాణిక్యం ఫోన్‌చేసింది భుజంగాన్ని వెంటనే రమ్మనమంటూ.

అది ఎలా జరిగిందో అర్థంకాక ముగ్గురూ తలకాయలు పట్టుకు కూర్చున్నారు. “అవతారాన్ని కూడా తీసుకు వెళ్ళారుగదా... ఆయన్ను కలిస్తేనేగాని మనకు పూర్తి వివరాలు తెలియవు!” అన్నాడు భుజంగం. అందులో అతడికి కల్పించుకోవటం ఇష్టంలేదు. నాగరాజు ఫోన్‌చేసివుంటే అసలు వచ్చేవాడు కాదు అక్కడికి. మొన్న నాగారాజు తనను తీసేసినట్లుగా మాట్లాడినప్పడినుంచి ఒళ్ళు మండిపోతోంది.

“వాడిని కాదు కలవవలసింది... ముందు సుభాష్‌గాడి తాటతీయాలి... వాడిని గురించి వాడేమనుకుంటున్నాడో... మనం వాజమ్మలుగా కనబడుతున్నామా... ఇరవై నాలుగు గంటల్లోగా వాడిని మన్యంకు ట్రాన్స్‌ఫర్ చేయించకపోతే నా పేరు నాగరాజు కాదు... అలా ట్రాన్స్‌ఫర్ కాలేదో ఇరవై అయిదో గంటలో వాడిని చిటికేయటమే!”

“చూడు నాగరాజు! ప్రతి దాంట్లోను ఆవేశం పనికి రాదని నేను ముందే చెప్పాను... సామరస్య పూర్యకంగా మాట్లాడి వాడిని వశం చేసుకోవాలి... అంతేగాని ప్రతిదీ ఒక సమస్యగా మార్చి నలుగురు నోళ్ళలోనూ మన పేర్లు నానేలా చేయవద్దు!”

“అయితే ఏమంటావ్ ఇప్పుడు?” విసురుగా అడిగాడు నాగరాజు. “నువ్వు ఏమీ చేతకాని వాడివి కాబట్టే మన పనులు ఇలా చచ్చుబడి చస్తున్నయి... నేనంటూ లేకపోతే నీ పనులు ఏవీ జరగవు... నీవు సర్పంచ్‌వే అయినా ఎవరిమీద పట్టున్నదని?” ఎగతాళిగా అన్నాడు.

“నువ్వు నోర్మూసుకుని బావగారు చెప్పిన మాటవిను!” మాణిక్యం తమ్ముడి వంక కోపంగా చూస్తూ అన్నది.

కొద్ది నిముషాలపాటు అక్కడ నిశ్శబ్దమేర్పడింది.

“దీంట్లో మనం కల్పించుకోకుండా ఉండటమే శ్రేయస్కరం!” చాలా నెమ్మదిగా అన్నాడు భుజంగం.

“అంటే వాడికి లొంగిపోవాలనా నీ ఉద్దేశ్యం... భయపడుతున్నావా?”

“భయం కాదు... ఆ వ్యభిచార గృహం మనదేనని ఊళ్ళో అందరికీ తెలుసు...

అయినా ఇంతవరకూ మన పేర్లు పోలీసు రికార్డులలో ఎక్కకుండా సమర్థించుకుంటూ వస్తున్నాం... ఇప్పటికే నువ్వు ఇన్‌స్పెక్టర్‌తో ఎక్కువగా వాదన పెట్టుకున్నావు... ఇక అది మనదేనని తెలిస్తే అతడి చేతికి మనం తాడందించినట్లే!" విసురుగా అన్నాడు.

"అయితే ఏమంటావ్?" గంయ్‌న లేచాడు నాగరాజు.

"అనేందుకు ఏమున్నది... సర్పంచ్‌కి, వ్యభిచారి గృహానికి సంబంధం వున్నది అన్నది పోలీసు రికార్డులలో ఎట్టి పరిస్థితులలోనూ ఎక్కగూడదు!... ఎక్కనివ్వను!" చాలా దృఢంగా అన్నాడు.

"అవతారాన్ని మా ఊరునుంచి నేను తీసుకు వచ్చాను... అతడిని పట్టనట్లుగా వదిలేసి జైలుపాలు చేయటం నాకు ఎంతో బాధకలిగిస్తుంది! అలా అంటే ఎలా... అంతేకాదు ఆ పిల్లల మీద ఎంత ఖర్చుపెట్టామో గుర్తుంచుకోండి!" చాలా చిన్నగా అనునయంగా అన్నది భుజంగంతో.

"నిజమే కాదనను... త్వరలో ఎలక్షన్లు రాబోతున్నయి... వెధవ వ్యభిచారకొంపలు నడుపుతున్నట్లు నా మీద కేసు బనాయించారంటే నా నామినేషన్ కూడా చెల్లుబాటుకాకుండా పోతుంది... గెలవటం సంగతి తరువాత!"

"అంత భయపడేవాడివి నువ్వు రావద్దు... నేనే వెళ్ళి మాట్లాడతాను!" నాగరాజు లేచాడు.

మాణిక్యం కూడా తమ్ముడికి అనునయంగా చెప్పింది. "తొందరపడి వెధవ్వాగుడు వాగి వాడిని శత్రువును చేసుకోబోకు... ఎంత కావాలో అడిగి డబ్బు తీసుకెళ్ళు... ఎట్టి పరిస్థితులలోనూ కేసు కాగూడదు!"

"ఇందులో ఆ ఇంటి ఓనరు ప్రకాశరావు చేయి వున్నదేమోనని అనుమానంగా వున్నది!" భుజంగమే అన్నాడు. "మనం ఇంటిని ఖాళీ చేయమంటే చేయటం లేదు... వాడు అడిగిన రేటు ఇచ్చి రిజిస్టరు చేయించుకుందామంటే నువ్వేమో మొండిగా ఆ ఇంటిని వాడు కొన్న రేటుకంటే పైసా ఎక్కువిచ్చేది లేదని కూర్చుంటివి... కాలదా

ఎవడికైనా... చేసే పనులేవో తెలివిగా చేయాలి... వచ్చే చోట గుంజాలి... వదలాల్సిన చోట  వదలాలి!"

"వాడి బొంద... బక్క వెధవ... ఒక్క పీకు పీకానంటే కృష్ణ ఒడ్డే వాడికి శాశ్వత నివాసమవుతుంది... నాతో మాట్లాడటానికే భయపడి చస్తాడు!"

"నీతో మాట్లాడటానికి భయపడుతున్నాడు కాబట్టే వెనుకనుంచి ఇలా గోయి తీసివుంటాడు!" ఎగతాళిగా అన్నాడు భుజంగం నాగరాజు వంక చూడకుండానే.

"వాడు అంత ఘనుడేం కాదులే... ఆ బోడి గవర్నమెంటు స్కూల్లో ఈ సంవత్సరం కొత్తగా  లెక్కల టీచరుగా జేరాడు చూడు... చక్రవర్తో, చెక్కవర్తో... ఎప్పుడో గతంలో ఆ ఇంటి యజమాని అయిన చచ్చిన రామబ్రహ్మం మనవడట వాడు... వాడే ఆ ప్రకాశరావుగాడి దగ్గర జీపీవో తీసుకున్నాడు ఇల్లు కొనేందుకు... వాడే  చేసివుంటాడు ఇదంతా... హైదరాబాద్‌నుంచల్లా వచ్చాడుకదా, పెద్దవాళ్ళతో పరిచయాలున్నయ్యేమో!"

భుజంగం మాట్లాడలేదు.

"అదే నిజమైతే వాడీ ఊరునుంచి మళ్ళా వెళ్ళడు!" ఆ మాట అంటూనే విసురుగా లేచి పెద్దపెద్ద అంగలేసుకుంటూ, వాకిట్లో ఉన్న జీపెక్కి ఒక్కడే స్టేషన్‌కు వెళ్ళాడు. వెళ్ళిన పావుగంటలోనే గోడకు కొట్టిన బంతిలా తిరిగి వచ్చాడు.

"ఏమైంది?" మాణిక్యం అడిగింది ఆత్రంగా.

"నిన్న సాయంత్రం అసిస్టెంట్ కమీషనర్ ఫోన్‌చేస్తే గుంటూరు వెళ్ళాడట... ఎప్పుడొస్తాడో తెలియదట... ఇవాళ రేపు కోర్టుకు శెలవలు... అందుకే వాళ్ళు కావాలని మనవాళ్ళను అర్ధరాత్రప్పుడు తీసుకువెళ్ళారు!" నీరసంగా వస్తున్న ఆ మాటలు చూస్తుంటే అతడూ అయోమయంలోనే ఉన్నట్లనిపిస్తోంది.

"ఇప్పుడేం చేద్దాం మరి?" అక్కే అడిగింది మళ్ళా.

"గుంటూరు వెళ్ళి వస్తాను... అసలు ఎవరు పట్టుకు వెళ్ళారో తెలియాలి ముందు... మన లాయర్‌తో కూడా మాట్లాడతాను... ఆయనే చెబుతాడు ఏం చేయాలో!"

నసుగుతున్నట్లుగా అన్నాడు అక్కనే చూస్తూ. "డబ్బెంతుంది ఇంట్లో!"

"పాతిక వేలదాకా ఉంటుంది... ఇస్తాను తీసుకు వెళ్ళు!"

భుజంగం అక్కా తమ్ముళ్ళ మాటలు వింటూనే లేచి నిలబడ్డాడు. "ఈ విషయంలో నన్ను మరోసారి పిలవద్దు... నాపేరు తీసుకురావద్దు!" బయటకు వచ్చి జీపెక్కేశాడు.

* * *

భ్రమర ఇంట్లో ఎనిమిది గంటలప్పుడు చక్రవర్తి కాలుపెడుతుండగానే అడిగింది. "ఏమిటి పూజారిగారు గుడిముందు పిల్లలచేత దీపావళి సామాన్లు కాల్పించారట!"

"ఆ వీధి దరిద్రం వదిలినందుకు ఆనందాన్ని అలా వ్యక్తపరిచారు ఆయన!" చెప్పాడు చక్రవర్తి.

"కాలం కాని కాలంలో ఆ సామాన్లన్నీ ఎక్కడ దొరికినయ్యండి బాబూ, ఆయనగారికి?"

చక్రవర్తి పకపకా నవ్వుతూ, "నేనూ ఆంజనేయులు గారూ మంగళగిరి వెళ్ళి ఆయనకు తెలిసిన ఓ కొట్టు గోడౌన్ తెరిపించి మరీ వాటిని తీసుకువచ్చి పూజారిగారికిచ్చాం!"

"అంటే ఇది మీ ఘనకార్యమేనన్నమాట!... నా శుభాకాంక్షలు... ఇక తదుపరి కార్యక్రమం నాకు అక్షింతలు వేయటం కదా... తెస్తాను!" అంటూ వెనక్కు తిరిగింది భ్రమర.

"ఇప్పుడు కాదు... ముందు భోజనం చేయాలి... తమలపాకులు అంటూ ఉంటే, వాటిని నీ చేత్తో చుట్టి ఇస్తుంటే వేసుకుంటూ ఆ పని చేస్తాను!"

రాత్రి తొమ్మిదిగంటలయింది భోజనాలయ్యేటప్పటికి.

"అడిగినట్లుగా ఆలుగడ్డ వేపుడు చేశాను. శుభ్రంగా తినిగూడా వేస్తానన్న అక్షింతలు వేయలేదంటే నా మనస్సు మహా ఆతృతపడుతున్నది సారూ నేను చేసిన తప్పేమిటో

తెలుసుకోవటానికి!" అన్నది భ్రమర వచ్చి ఎదురుగ్గా కూర్చుంటూ.

"నేను మీ ఊరు రావాలనుకుంటున్న దానివి నన్ను సూటిగా అడగలేవా, మీ అమ్మచేత పూర్ణచంద్రరావుగారికి ఫోన్ చేయించాలా?" ఆమె వంక సీరియస్‌గా చూస్తూ అడిగాడు. "ఈసారి ఏలూరు వెళ్ళినప్పుడు ఓ సీసానిండా ఆవకాయ పట్టుకురా... తిని చాలా రోజులయింది!"

"అన్నం తినాలి అంటే బియ్యాన్ని వండాలి!" అన్నది పకపకా నవ్వుతూ. "ఆ శ్రమంతా దేనికని బియ్యమే తింటే కడుపులో నొప్పి వస్తుంది! ఆవకాయ అంటారా... సీసాడేం ఖర్మ... పెద్ద జాడీడే తెస్తాను!"

నోరంతా తెరిచి నవ్వుతున్న ఆమెను తన్మయంగా చూస్తూ ఉండిపోయాడు చక్రవర్తి.

"నాకు వందో సంవత్సరం వచ్చిందాకా అలా నవ్వుతున్న నిన్ను చూస్తూ ఉండాలనేదే కోరిక!... మీ ఆవకాయ తిన్న తరువాత అభినందనలు చెప్పాలో, మరోసారి అక్షింతలు వేయాలో అప్పుడు చెబుతాను!"

"నాకు ఇంకో కోరిక కూడా వున్నది!... అక్షింతల విషయంలో కాదులేండి!"

"నా నవ్వు నీ నవ్వంత అందంగా వుండదు, రాణీ!"

"నేను కోరుకుండేది అది కాదు... ఎప్పటికయినా సరే... మనిద్దరి నవ్వులూ ఒక్క క్షణంలోనే ఆగిపోవాలిగాని, ముందూ వెనుక కాగూడదని!... అవునూ నాకు తెలియక అడుగుతాను... మధ్యాహ్నం పెద్దాయనతో ఏదో పిచ్చవాగుడు వాగారట... అక్షింతలు నేను వేయాలి!" అంటూ కుర్చీలోనుంచి విసురుగా లేవబోయింది.

చటుక్కున ఆమె చేయిపట్టుకున్నాడు. "ఆగాగు... ఏం వాగానబ్బా?" గుర్తుకు తెచ్చుకోవటానికి తల గోక్కోసాగాడు.

"మీ తాతగారిల్లు మీది కాకపోతే ఈ ఊరునుంచి వెళ్ళిపోవటమే కాకుండా, నేను మీతో రావాలో వద్దో నేనే నిర్ణయిమచుకోవాలన్నారట!"

"ఇప్పుడు అది అయిపోబోతున్నది కదా... ఇంకా ఆ వెధవ ఫ్లాష్‌బ్యాక్ దేనికి?"

"నో... నేను అంగీకరించను... మాటలకు ఎప్పటికీ జీవం ఉంటుంది... నిరాశే మనిషిని కృంగ దీసేది, అపజయం పాలు చేసేది... అది నా నిఘంటువులోనే లేదు... నేను ఏ ఉద్దేశ్యంతో ఈ ఊరు వచ్చానో మీకు చెప్పాను... అది చేసి తీరతాను... విజయం మనదే అనే ధృఢనిశ్చయంతో అడుగువేయటమే నా ధ్యేయం!"

* * *

రాత్రి పది గంటలప్పుడు పూర్ణచంద్రరావుగారు విజయవాడలోని ప్రకాశరావుకు ఫోన్ చేశారు.

"అయ్యా! శుభవార్త... రాత్రి ఇక్కడ మీ ఇంటిని పోలీసులు ఖాళీ చేయించారు!"

"మీరు పోలీసు రిపోర్టు ఇచ్చారా?" భయపడుతూ అడిగాడు.

పూర్ణచంద్రరావుగారు నవ్వారు. "ఏదో తిప్పలు పడ్డాంలేండి... దాన్ని గురించి ఇక మర్చిపోండి!"

"పోలీసు రిపోర్టు ఇస్తే వాడొచ్చి నా ప్రాణం తీస్తాడండి బాబు... వాడసలే మూర్ఖుడు!" మరింత కంగారుగా అన్నాడు. "నా ప్రాణానికి ఆ ఇల్లు ఓ పెద్ద తద్దినమయి కూర్చున్నది!"

"మీరు భయపడాల్సిందేమీలేదు... ఎవ్వరూ ఇక మీ జోలికి రారు... ఇప్పుడు మీరు చేయాల్సినవి రెండు పనులున్నయి... మొదటిది మీరు ఆ ఇంటిని చక్రవర్తి కోరిన వ్యక్తి పేరున రిజిస్టర్ చేయించటం... రెండు వెంటనే ఓ లాయర్ను సంప్రదించి మీరు మీ ఇంటిని వ్యభిచారగృహానికి అద్దెకివ్వటంలో మీ ప్రమేయం లేదని ఎలా సమర్థించుకోవాలో ఆలోచించుకోవటం!"

"అదేమిటి నేను కోర్టుకెళ్ళాలా?" హడావుడిగా అడిగాడు.

"మరి... తప్పు చేయటం ఎంత నేరమో, తప్పుచేసే వాళ్ళకు నీడనివ్వటమూ

అంతే నేరం!”

“వాళ్ళు అందుకోసం తీసుకుంటున్నారని ఆ ఇల్లు అద్దెకిచ్చేటప్పుడు నాకు తెలియదండీ... తెలిసింతరువాత ఖాళీచేయమని ఎన్నిసార్లు చెప్పినా చేయలేదు!”

“అదే మీ లాయరుచేత కోర్టులో గట్టిగా చెప్పించాలి,,, ఓ మంచి లాయర్ను సంప్రదించి మీ అమాయకత్వాన్ని ఋజువు చేసుకొని, ఆ ఇంటికి పోలీసులు వేసిన సీల్‌ను తీయించాలి!”

“అయ్యబాబోయ్! ఈ కోర్టులూ, పోలీసులతో నాకు అనుభవం లేదండీ బాబు... ఇంతవరకూ జీవితంలో నేను ఏ లాయరు దగ్గరకూ వెళ్ళలేదు!” ఆయనకు భయంతో ఏడుపు వస్తున్నది.

పూర్ణచంద్రరావుగారు చెప్పేదంతా నిజమే అయినా కావాలని కొంత భయపెడుతున్నట్లుగా మాట్లాడుతున్నారు ఆయన. ఇప్పుడు ఇల్లు ఖాళీ అయింది కాబట్టి మళ్ళా తోక ఝాడించి రాజధాని వస్తుండటంతో రేటు పెరిగింది, మా పిల్లలు అమ్మొద్దంటున్నారు, మా ఆవిడ వద్దంటున్నది అంటూ వంకలు చెప్పకుండా ఆయన వెంటనే రిజిస్ట్రేషన్ చేసేలా చూడాలి!

“ప్రకాశరావుగారూ! మీరు ఒక పనిచేయండి... మీకు లాయర్లెవరూ తెలియకపోతే రేప్పొద్దున్నే సాయీరాంపురం రండి... ఇద్దరం కలిసి గుంటూరు వెళ్దాం... అక్కడ నాకు తెలిసిన సీనియర్ లాయరు ఒకరున్నారు వారితో మాట్లాడదాం!”

“నేను మీ ఊరు రానండి బాబు, వాడు నన్ను చూశాడంటే పోలీసులకు నేనే చెప్పానని పొడిచి చంపినా చంపేస్తాడు!”

“అయితే ఒక పని చేయండి... మీరు పదింటికల్లా గుంటూరు బస్టాండులో వుండండి... నేనూ చక్రవర్తి అక్కడకు వస్తాం... ముగ్గురం కలిసి లాయరు దగ్గరకు వెళ్దాం!” అంటూ ఆయనకు మరో మాటకు అవకాశమివ్వకుండా ఫోన్ ఆఫ్ చేసి వెంటనే చక్రవర్తికి కాల్ చేశాడు.

"రేపు పదింటికల్లా మనం గుంటూరులో ఉండాలి!"

"అలాగేనండి!"

"అంతేగాదు... మీ వాళ్ళకు ఫోన్‌చేసి ఇంటి విషయంలో డబ్బును రెడీ చేసి పెట్టుకోమను... వీలయినంత త్వరగా రిజిస్టర్ చేయించేద్దాం!"

* * *

సోమవారం ఉదయం పది గంటలప్పుడు ఇన్‌స్పెక్టర్ సుభాష్ భుజంగం ఇంటికి వచ్చాడు. ఆయన్ను చూస్తూనే కంగారు పడ్డాడు.

"ఫోన్‌చేస్తే నేనే వచ్చేవాడిని కదా మీదగ్గరకు!" అన్నాడు మర్యాదగా.

"మీరు ఈ ఊరికి సర్పంచ్... గౌరవనీయులు... మిమ్మల్ని స్టేషన్‌కు రమ్మనమనటం నాకు భావ్యం కాదు... అర్జంటుగా ఓ సమాచారం కావాల్సి వచ్చాను!"

"చెప్పండి!" అన్నాడు నీరసంగా. అతడు తనను అనాధ స్త్రీ ఆశ్రమ విషయంలో ఎట్టి పరిస్థితులలోనూ ఇరికించకుండా వుండేలా చూసుకోవాలి!

"నాలుగయిదు సంవత్సరాల క్రితం పంచాయితీ డిపార్టుమెంటు ఆడిటర్ భానుమూర్తి అనే ఆయన మీ రికార్డులు తీసుకు వెళుతున్న సమయంలో అటుగా వస్తున్న ట్రాక్టర్‌కు బ్రేక్స్ ఫెయిలయి అతడిని గుద్దింది. ఆ యాక్సిడెంట్‌లో ఆయన చనిపోయాడు... గుర్తున్నది కదా!"

అతడి మాటలు వింటూనే భుజంగం ముఖం నల్లబడిపోయింది. తత్తరపడ్డాడు.

"ఆ కేసులో కోర్టు అప్పుడే తీర్పు ఇచ్చిందికదా డ్రైవర్‌కు శిక్ష విధిస్తూ!"

"నిజమే... ఆ శిక్షను అనుభవించి బయటకు వచ్చాడు కూడా అతడు!"

"ఇప్పుడు ఎందుకొచ్చింది ఆ కేసు విషయం?" నంగినంగిగా అడిగాడు.

"మా రికార్డ్స్ ప్రకారం అతడి పేరు వెంకటస్వామి... జైలునుంచి విడుదలయింతరువాత అతడు తిరిగి ఈ ఊరు రాలేదు... అతనికి శిక్ష పడిన కొద్ది

రోజులకే అతడి కుటుంబమూ ఈ ఊరునుంచి వెళ్ళిపోయింది!"

"నిజమేనండి... తరువాత నాకూ అతడుగాని, అతడి కుటుంబ సభ్యులుగాని ఎవ్వరూ కనబడలేదు!"

"అదేమిటి... అతడు మీ దగ్గరే పనిచేసేవాడు కదా!"

"అవ్వచ్చు గాని తరువాత ఏమయ్యాడో ఏమో!"

"జైలునుంచి బయటకు వచ్చాడనైనా తెలుసా?" కాస్త ఎగతాళిగా అడిగాడు అతడు నిజాల్ని దాస్తున్నాడని అర్థమవ్వటంతో.

"ఊళ్ళోవాళ్ళు అనుకుంటుండంగా విన్నాను!"

"పోనీయ్ నాగరాజుగారికి తెలుసేమో కనుక్కుంటారా?"

"ఇప్పుడెందుకొచ్చిందండీ వాడితో పని?" ఆదుర్దాగా అడిగాడు.

"తెలియదు... అసిస్టెంటు కమీషనర్‌గారు ఫోను చేసి, ఆ కేసు రికార్డ్సును, అతడిని తీసుకుని వెంటనే తన దగ్గరకు రమ్మనమన్నారు! మొత్తానికి రెండు రోజులు వెతికి రికార్డులనయితే పట్టుకున్నాను గాని ఆ మనిషి ఎంత ప్రయత్నించినా ఎక్కడున్నాడో తెలియలేదు!"

భుజంగం నోరు తెరుచుకుని సుభాష్‌నే చూస్తూ ఉండిపోయాడు ఏం మాట్లాడాలో తెలియనట్లుగా.

"ఒక పనిచేయండి... మీరు నాగరాజుగారితో మాట్లాడి వారికేమైనా అతడి వివరాలు తెలుసేమో కనుక్కుని చెప్పండి... రేప్పొద్దున్నే నేను అసిస్టెంట్ కమీషనర్ గారికి ఆ వివరాలు తప్పనిసరిగా అందివ్వాలి!'

"మీరే అతడిని పిలిపించి అడగ్గూడదు!" నసుగుతున్నట్లుగా అన్నాడు.

సుభాష్ ఒక్కక్షణం కూడా ఆలస్యం చేయలేదు. "అతడి మాట చాలా దురుసుగా వుంటుంది... మా పోలీసుల సంగతి మీకు తెలిసిందేకదా... అతడి మాటలకు

నేనూ సంయమనం కోల్పోయానంటే సెల్‌లో పడేసి మా రీతిలో సమాధానం రాబట్టాల్సివస్తుంది... ఓ స్కూలుకు కరస్పాండెంట్ అయిన ఆ పెద్దమనిషికి అలా జరగ్గూడదనే నేను మిమ్మల్ని మాట్లాడమని కోరుతున్నది!" ఆ మాట చెబుతూనే సుభాష్‌లేచి బయటకు వెళ్ళి జీపెక్కాడు.

మాణిక్యం తనకెంత సుఖాన్నిచ్చిందో, నాగరాజు అంతకు రెట్టింపు హాని కలిగించేలా ఉన్నాడు!

భుజంగానికి నాగరాజుతో మాట్లాడటం ఇష్టం లేదు. అనాథాశ్రమ విషయంలో తన పేరును బయటకు తీసుకు రావద్దని చెప్పినప్పటినుండి అతడు మరింతగా రెచ్చిపోతున్నాడు.

కానీ ఇప్పుడు తప్పక సెల్ తీసుకుని అతడి నంబరుకు కాల్ చేశాడు.

"చెప్పు... చాలా బిజీగా వున్నాను... టెన్త్ పరీక్షలు వస్తున్నయిగదా ఈ సారి మన జిల్లాలో మన స్కూలే ప్రథమ స్థానంలో ఉండాలి!"

"ఇన్‌స్పెక్టర్ సుభాష్ వెంకటస్వామి ఎక్కడున్నదీ నిన్నడిగి తెలుసుకోమన్నాడు!"

"ఎవడా వెంకటస్వామి?" చికాగ్గా అడిగాడు.

"పాత మన ట్రాక్టర్ డ్రైవరు!"

"మన అనబోకు... ఆ ట్రాక్టర్ నాదికాదు నీది!" కోపంగా అన్నాడు.

"ఎవరిదయితేనేంలే... అతడు ఎక్కడున్నదీ కావాలిట!"

"ఇప్పుడు దేనికిట?... నన్ను ఆయనగారే అడగవచ్చుగదా... నీచేత ఎందుకడిగిస్తున్నాడు?"

"నాకు తెలియదన్నానని, నీకు తెలుసేమో కనుక్కోమన్నాడు!"

"నీకు తెలియకుండా నాకు మాత్రం ఎలా తెలుస్తుంది?"

"నేను చెప్పాను... నీకూ తెలియదని... అయినా ఒకసారి కనుక్కుని చెప్పండి

అన్నాడు!"

"అసలు దేనికిట ఆవిషయం అతడికి?"

"తెలియదు... వాళ్ళ అసిస్టెంట్ కమీషనర్ అతడిని ఆ యాక్సిడెంట్ రికార్డ్సును, తీసుకుని రేప్పొద్దున రమ్మనమన్నాడట!" గొణుగుతున్నట్లుగా అన్నాడు.

"దాన్ని మళ్ళా తెరిచినా, మూసిన నాకు అనవసరం... ఒకటి గుర్తుంచుకో... అది నీకు సంబంధించిన విషయం... ఆ ఆడిటర్ నీ ఎకౌంట్స్ చూడటానికి వచ్చి నీ రికార్డ్సన్నీ పట్టుకు వెళుతున్నాడు... నీ ట్రాక్టర్‌కు బ్రేక్స్ ఫెయిల్ అవ్వగా నీ డ్రైవర్ దాన్ని అదుపు చేయలేక అతడిని గుద్దాడు... నీ పుస్తకాలన్నీ నీళ్ళ కుంటలో పడి నాశనమయినయి... మధ్యలో దానికీ నాకూ సంబంధమేమున్నది! ఆ వివరాలు నాకు తెలయాల్సిన అవసరమేమున్నది... దీంట్లోకి నన్ను లాగి నా పరువు తీయబోకు! నేనో హైస్కూలు స్వంతదారుడిగా ఈ ఊళ్ళో గౌరవంగా బ్రతుకుతున్నాను!"

"నాకూ లాగాలని లేదు... కానీ ఆనాడు ఆసమయంలో ట్రాక్టర్ నడిపింది నువ్వు అని గుర్తుంచుకో... బ్రేక్స్ ఫెయిల్ కాకపోయినా కావాలని గుద్ది అతడిని చంపావు గనుక నిన్ను అడుగుతున్నాను!" కోపం గుండెల్లోనుంచి ఎగతన్నుతుండగా కరుకుగా అంటూనే భుజంగం సెల్‌ను ఆఫ్ చేశాడు.

* * *

పదోతరగతి పరీక్షలు మొదలయిన మూడో రోజు పదకొండు గంటలప్పుడు నాగరాజు స్కూలుముందు ఒక జీపు, ఓ మెటడారు, వాటి వెనగ్గా ఓ పోలీసు వ్యాను ఆగినయి.

వాటిల్లోనుండి ఓ ప్రత్యేక బృందం దిగుతూనే స్కూలు గదుల్లోకి దూసుకుపోయారు.

వరండాల్లో టకటక బూట్ల చప్పుళ్ళు...

గదుల్లోకి ప్రవేశిస్తూనే అక్కడ పుస్తకాలు బాహాటంగా పెట్టుకుని పరీక్షలు వ్రాస్తున్న

చాలామంది విద్యార్థులు కనబడటంతో ముందుకు దూకుతూ, వారినుండి వాటిని, వ్రాస్తున్న సమాధాన పత్రాలను లాక్కుంటుంటే ఏం చేయాలో తెలియక బిక్కముఖాలు వేసుకు చూడసాగారు ఆ పిల్లలు. టీచర్లయితే అవాక్కయి నిలబడిపోయారు.

ఒకళ్ళిద్దరు, "ఎవరు... ఎవరు...?" అంటూ కీచు గొంతుకతో ప్రశ్నిస్తున్నా వాళ్ళనుండి సమాధానం రాలేదు.

ఒక గదిలో టీచరు పేపర్లు లాక్కుంటున్న అతడిని నిలవరించటానికి ప్రయత్నిస్తూ, "ఏమిటీ దౌర్జన్యం... లోపలకు వచ్చేముందు మా పర్మిషన్ తీసుకోనక్కరలేదా?" అని అరుస్తున్నట్లుగా అడిగాడు.

"నువ్వు గౌరవనీయమయిన ఉపాధ్యాయ వృత్తిలో వున్నావు... నీ కళ్ళెదుటే పిల్లలు పుస్తకాలు బహిరంగంగా పెట్టుకుని కాపీ కొడుతుంటే చూస్తూ నిల్చోవటానికి సిగ్గు వేయటంలేదా... మేం స్పెషల్ స్క్వాడ్‌మి... జిల్లాకేంద్రంనుండి వచ్చాం... ఐడెంటిటీ కార్డులు చూపించాలా... ముందు మీరు మాట్లాడకుండా ఓ మూల నిల్చుంటే మేం చేయాల్సిన పని చేసుకుని వెళ్ళిపోతాం!" ఆయనా కంఠం పెంచి అరుస్తున్నట్లుగా అన్నాడు.

ఆ మాటలకు కాపీ కొడుతున్న విద్యార్థులంతా భయంతో బిగుసుకు పోయారు.

పిల్లల దగ్గరున్న పుస్తకాలు పరీక్షలు జరుగుతున్న గదులముందు కుప్పగా విసిరివేయబడుతున్నాయి.

ఆ ప్రత్యేక బృందంలోని వారే అలా కాపీ కొడుతున్న పిల్లల్ని బయటకు తీసుకు వచ్చి రోజూ ప్రేయర్ జరిగే ఖాళీ స్థలంలో నిలబెడుతున్నారు.

జరుగుతున్న హడావుడి గదిలో కూర్చుని మాట్లాడుకుంటున్న హెడ్మాస్టర్‌కు, నాగరాజుకు అందటంతోనే పరుగెత్తుకుంటూ బయటకు వచ్చారు.

"ఏమైంది?... ఏమిటీ గోల?"

"ప్రధానోపాధ్యాయులు ఎవరు?" ఆ ప్రత్యేక బృందం పెద్ద అడిగాడు.

“నేనేనండి!” హెడ్మాస్టరు జారిపోతున్న ధోవతిని పైకి లాక్కుంటూ అడిగాడు. ఆయనకు అర్థమయిపోయింది వచ్చింది ఫ్లయింగ్ స్క్వాడ్ అని.

“స్కూల్లో ఇంతమంది పిల్లలు కాపీ కొడుతుంటే మీరు కదలకుండా గదిలో కూర్చున్నారంటే ఇదంతా మీకు తెలిసే జరుగుతున్నదన్నమాట!”

“అయ్యయ్యో అదేంలేదండీ... ఇప్పటిదాకా నేను అన్ని క్లాసులూ తిరిగివచ్చాను... ఎవరూ అంత దరిద్రపు పని చేస్తున్నట్లుగా నా దృష్టికే రాలేదు... ఏ మాత్రం అనుమానం వచ్చినా వదిలిపెట్టే వాడిని కాదు... ప్రశాంతంగా పరీక్షలు జరుగుతున్నయిగదా అని ఇప్పుడే ఐదు నిముషాలక్రితం నా గదిలోకి వచ్చి, కరస్పాండెంట్గారు వస్తే మాట్లాడుతున్నాను... ఈలోగా మీరు వచ్చారు!”

“ఐదునిముషాలల్లోనే క్రింద గదుల్లోనే పిల్లల దగ్గర బస్తాల కొద్దీ పుస్తకాలు ఎలా దొరుకుతయ్యండి మాకు... అట్లా ఒక్కసారి వరండాల్లోకి చూడండి ఎలా కుప్పలు కుప్పలుగా పడి వున్నయ్యో!”

“అలాగా... నేను పరీక్షల్లో చాలా కఠినంగా వుంటానండి... నాగరాజు గారు గూడా చాలా స్ట్రిక్ట్ మనిషి... స్కూలుకు చెడ్డ పేరు రావటాన్ని ఆయన అసలు సహించరు!” అన్నాడు వాళ్ళను చూస్తూ.

“పదండి... గదిలో కూర్చుని రిపోర్టు తయారు చేద్దురుగాని!”

అప్పుడే మేడమీద గదుల్లోనుంచి మరో బస్తాడు పుస్తకాలు క్రిందకు వచ్చినయి. పిల్లలు కొంతమంది ఏడుస్తూ మెట్లు దిగుతూ కనబడ్డారు. అల్లకల్లోలమయింది స్కూలంతా.

“ఇలాంటి అన్యాయాన్ని మేమూ సహించమండి... కాపీకొట్టి పాసయ్యే పిల్లలు మన దేశానికే అరిష్టమని నాకు తెలుసు... అప్పటికీ పరీక్షలముందు ఉపాధ్యాయుల్ని సమావేశపరిచి జాగ్రత్తగా మన స్కూలుకు చెడ్డపేరు రాకుండా నిర్వహించాలని గట్టిగా చెప్పానండి... అయినా వాళ్ళు అలా చేశారంటే నాకు చాలా సిగ్గుగా వున్నది.. ఏ ఏ

గదుల్లో మీకు కాపీలు దొరికినయ్యో చెప్పండి... ఇప్పుడే వాళ్ళను డిస్మిస్ చేస్తాను!" నాగరాజు ముందుకో అడుగు వేశాడు.

ఆ స్పెషల్ స్క్వాడ్ లీడరు పెద్దగా నవ్వాడు. "ఒక గదనేమున్నది. అన్ని గదుల్లోనూ! మీరు డిస్మిస్ చేయటం మొదలుపెడితే మీ స్కూల్లో ఇక టీచరే మిగలడు!"

"ఇన్విజిలేటర్లలో సగంమంది కూడా లేరండి మా స్కూలు వాళ్ళు... అంతా బయటవాళ్ళే!" నీళ్ళు నములుతూ అన్నాడు నాగరాజు.

"అవన్నీ మాకు అనవసరం, ఈనాటి ఈ స్థితి చూస్తుంటే ఇక ముందు మీ స్కూలు పదోతరగతి పరీక్షలకు కేంద్రంగా వుంటుందని నేననుకోను... పదండి రిపోర్టురాసి సంతకాలు పెడుదురుగాని... కాలయాపన అనవసరం... ఈరోజు మేం చెక్‌చేయాల్సిన బడులు చాలా వున్నయి!"

నాగరాజు ముఖం తెల్లగా పాలిపోయింది అతడి మాటలకు. పెదవులు వణకసాగినయి.

కాపీకొడుతూ రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుబడిన విద్యార్థులు అరవై నలుగురు. నాగరాజు లక్షల వ్యాపారం ఒక్కసారిగా కుప్పకూలిపోయింది!

* * *

విశ్వనాథంగారు కబురు చేయటంతో ఆదివారం ఉదయం పదకొండు గంటలప్పుడు పూర్ణచంద్రరావుగారు ముగ్గురినీ తీసుకుని గుంటూరు వెళ్ళారు.

చక్రవర్తి చాలా సంతోషంగా వున్నాడు తను సాయిరాంపురంలో కాలు పెట్టటంలోని ధ్యేయం నెరవేరినందుకు. విశ్వనాథం సలహాతో ప్రకాశరావు క్రితం రోజే తాతగారి ఇంటిని చక్రవర్తి తండ్రిపేరుమీద రిజిస్టర్ చేశాడు.

"నేను ఇప్పుడు కొన్ని విషయాలు చెప్పటానికే మిమ్మల్ని ప్రత్యేకంగా రమ్మనమన్నది... ఇవన్నీ చాలా రహస్యంగా ఉంచవలసిన విషయాలు... అయినా ఎందుకు చెప్పాలనుకున్నానంటే చాలా రోజులుగా సమస్యలతో సతమతమవుతున్న

మీ మనస్సుకు ప్రశాంతత చేకూర్చాలని!"

ఆయన ఏం చెబుతారా అన్నట్లుగా ఆసక్తిగా చూచారు.

"మనకు అన్నీ శుభపరిణామాలే!" ఆయన మరల తన మాటల్ని కొనసాగించాడు. "చక్రవర్తి కోరిక నెరవేరింది... ఆయన తాతగారిల్లు వారి కుటుంబానికి దక్కింది... దానికి వేసిన సీలును రెండు మూడు రోజుల్లో తీస్తారు... ప్రకాశరావు ఇచ్చిన ఎఫిడవిట్‌తో దానికి దారి సుగమమయింది... ఆయన్ను ఈ కేసులో ఇరుక్కోకుండా బయటకు తీసుకు రావాల్సిన బాధ్యత ఇక నామీద వున్నది... ఆయనకు వాళ్ళు ఆ ఇంటిని ఎందుకు తీసుకున్నది తెలియక ఇవ్వటం, అందునా అలా తీసుకున్నవారు ఆ ఊరి పెద్దలవ్వటం, తెలిసిన వెంటనే ఖాళీ చేయించటానికి ప్రయత్నిస్తే వాళ్ళు తనని బెదిరించటం లాంటివి ఆయనకు మేలు చేసే విషయాలే... పోలీసువారితో గూడా చర్చించాను... అందులో అతడి తప్పేమీ లేదని, వాళ్ళకు భయపడే ఇన్నాళ్ళూ ఫిర్యాదు చేయలేదని నచ్చజెప్పాను... ఇక ఆ ఇంటి సమస్య తీరిపోయినట్లే... వ్యభిచార గృహంపై కేసంటారా అది నడుస్తుంటుంది... దానితో మనకు సంబంధం లేదు!"

"చాలా చాలా థాంక్సండీ!" చక్రవర్తి తృప్తిగా అన్నాడు.

"ఆంజనేయులుగారి తోటలో రంజని శవం దొరకటం విషయంలో కూడా మనకు కావాల్సిన ముఖ్య సమాచారం దొరికింది... చనిపోయిన రంజని ఆంజనేయులకు బంధువవ్వటంతో కొంత తేలికయింది. ఆయన ప్రోద్బలంతో ఆమె తల్లిదండ్రులిచ్చిన ఆమె డైరీతో హత్యకు కారణాలను క్రోడీకరించగలిగాం... నాగరాజు ప్రతినెలా పూర్తి జీతమివ్వకుండా, రసీదు మాత్రం పూర్తి జీతానికి తీసుకుంటున్నాడు... అందుకు రంజని ఎదురు తిరగటమే కాకుండా తోటి ఉపాధ్యాయుల్ని కూడా రెచ్చగొడుతుండటాన్ని నాగరాజు సహించలేకపోయాడు... దెబ్బ తీయాలనుకున్నాడు... దాని వలన మిగతా టీచర్లుకూడా నోరెత్తకుండా పడివుండటానికి అది ఒక హెచ్చరికలా పనిచేస్తుందనేది అతడి ఆలోచన. హత్య జరిగిన రోజు ఆమె స్కూలు అవ్వగానే ఆంజనేయులు గారితో కలిసి వెళ్ళటం గమనించి దాన్ని తనకు అనుకూలంగా

మలుచుకున్నాడు నాగరాజు. ఆంజనేయులు కొద్ది దూరమే ఆమెతో వెళ్ళింది. తరువాత నాగరాజు తన మనుష్యుల చేత ఆమె బస్టాండుకు ఒంటరిగా వెళుతున్న సమయంలోనే కిడ్నాప్‌చేయించి, చంపి వీరి తోటలోనే కావాలని ఆ రాత్రి వ్రేలాడ తీయించాడు... అంటే ఒకే దెబ్బకు రెండు పిట్టల్ని కొట్టాలనుకున్నాడన్నమాట... స్కూల్లో ఆమె అడ్డంకి వదిలిపోవటమే కాకుండా, హత్య కేసులో ఆంజనేయులు జైలుపాలయితే ఆ తోటను పక్కనున్న తన తోటతో కలుపుకోవటం తేలికవుతుందని ఆశించాడు... కానీ రంజనీ తన డైరీలో ఆ స్కూల్లో నిబంధనలకు వ్యతిరేకంగా జరుగుతున్న చాలా విషయాల్ని రోజువారీ వ్రాసి పెట్టింది... దాని వలననే విజయవంతంగా స్క్వాడ్ చేత పరీక్షా కేంద్రం మీద రెయిడ్ చేయించగలిగాం. ఇప్పుడు చాలా మంది టీచర్లు– రంజనినే కాకుండా తమనూ ఎలా నాగరాజు వేధింపులకు గురి చేస్తున్నది కోర్టుకు వచ్చి చెప్పేటందుకు సిద్దంగా వున్నారు... మరికొంత సమాచారం కోసం సుభాష్ ఎదురుచూస్తున్నాడు... అది అందగానే అతగాడిని ఏ క్షణాననైనా అరెస్టు చేయవచ్చు... టీచర్లందరి చేత ఆ స్కూలును ప్రభుత్వం తీసుకునేలా వినతి పత్రం ఇప్పిస్తున్నాను... నాకు ఆత్మీయుడైన నా అసిస్టెంట్ రఘురాం ఈ విషయంలో తెరవెనుక కొంత వేగుపని చేసి ఆ ఊళ్ళో నాగరాజు బృందం చేసిన పెక్కు ఘోరాలను బయటకు లాగగలిగాడు... అందుకే పిల్లలు బందు చేసిన రోజున ఊళ్ళో ఏ గొడవా జరగకుండా సాయంత్రం దాకా వాళ్ళను తన అదుపులో అట్టిపెట్టుకున్నాడు సుభాష్!" నవ్వుతూ చెప్పాడు ఆయన.

కన్నార్పకుండా చూస్తూ ఆయన మాటలు వింటున్నారు ఆ నలుగురూ.

"ఇక భ్రమర సమస్య ఎలా తీర్చాలా అనే దానికి కొంత కష్టపడాల్సి వచ్చింది... ఎట్లాగైతేనేం చివరకు ఆమె తండ్రి హత్యకేసును తిరిగి తెరిపించేందుకు మార్గం సుగమం అయింది... అందుకు మనం ఆశించని, కొత్త మార్గం ఒకటి సాయంగా దొరికింది ఓ స్త్రీ రూపంలో... తన సంసారం నాశనమవ్వటానికి కారణమయిన వ్యక్తుల అంతు చూడటానికి నిర్ణయించుకున్న ఓ సామాన్య గృహిణి ఆమె!"

"ఎవరామె?" పూర్ణచంద్రరావు అడుగుతుంటే అందరూ ఆమె ఎవరో తెలుసుకోవాలన్నంత ఆత్రంగా ఒకేసారి ముందుకు వంగారు.

"చంద్రలేఖ!"

ఆమె ఎవరో పూర్ణచంద్రరావుగారికి తప్ప ఎవరికీ అర్థం కాలేదని వాళ్ళ ముఖాలే చెబుతున్నాయి.

"భుజంగం తాళిగట్టి పెళ్ళి చేసుకున్న భార్య... తన భర్త అంత దుర్మార్గుడు కాదని, ఆయన బలహీనతంతా ఒక్క మాణిక్యమేనని ఆమెకు తెలుసు... అక్కని అడ్డుపెట్టుకుని నాగరాజు చేసిన దుర్మార్గాలే తన భర్తను ఊళ్ళో ఓ దుర్మార్గుడిలా చిత్రీకరిస్తున్నయ్యని, భానుమూర్తిగారిని చంపింది స్వయంగా నాగరాజేననే విషయాన్ని కోర్టులో ధృవీకరించటానికి ఆమె అంగీకరించటమే ఈ కేసులో ఓ బలమైన మలుపు అవ్వబోతోంది! సుభాష్ ఎంతో చాకచక్యంగా, ముందుచూపుతో ఆమె మనస్సులోని విషయాలన్నీ రాతపూర్వకంగా ఇప్పటికే ఆమెనుండి, ఆమె భర్తకు తెలియకుండా పొందగలిగాడు... అంతేకాదు శిక్ష అనుభవించిన అమాయకుడైన వెంకటస్వామి ఆమె చెబితే కోర్టుకు రావటానికి కూడా తయారుగా వున్నాడు... ఇంతవరకూ భర్తకు తెలియకుండా ఆ బాధిత కుటుంబాన్ని ఆదుకున్నది ఆమేనని వాళ్ళకూ, ఆమెకూ తప్ప మరెవ్వరికీ తెలియదు!"

భ్రమర ఆనందంగా ఆయన వంక చూచింది.

"ఏ నేరంలోనూ భుజంగం హస్తం లేకపోయినా, నాగరాజు తెలివిగా ప్రతిదాంట్లోనూ అతడు ఇరుక్కునేలా చేశాడు... అదే అతనికున్న కళ! ఇక వీటన్నిటినీ బయటకు లాగటంలో తన తెలివినంతా ఉపయోగించి, సూత్రధారుడయింది ఇన్‌స్పెక్టర్ సుభాష్!"

కాఫీలు వచ్చినయి. అందరూ త్రాగారు.

"నేను చెప్పినమాట గుర్తున్నది కదా... ఇప్పుడు మీరు విన్న విషయాలన్నీ

కోర్టులో వెల్లడయ్యేంతవరకూ రహస్యంగానే ఉంచాలి!"

"తప్పకుండానండి!"

హాయిగా ఊపిరిపీలుస్తూ వెళ్ళటానికి అందరూ లేస్తుండగా. పూర్ణచంద్రరావుగారు అన్నారు. "నువ్వు నా స్నేహితుడివనే చనువుతో అడుగుతున్నాను... ఈ కేసుల విషయంలో నీ ఫీజెంతో చెబితే వీళ్ళంతా సంతోషంగా చెల్లించేటందుకు తయారుగా ఉన్నారు!"

"అసలు కేసులు ఇప్పుడేగదా మొదలవుతున్నది తొందరపడితే ఎలా... అవి పూర్తయి దోషులకు శిక్షలు పడాలంటే నెలలు పట్టవచ్చు, లేదా సంవత్సరాలే గడిచిపోవచ్చు... చూద్దాం, అంతా అయి విజయపతాకం ఎగరేసే సమయంలో ఫీజు సంగతి ఆలోచిద్దాం... నాకూ ఓ నిబద్ధత కలిగిన న్యాయవాదిగా సమాజంలో బాధితులనూ, పీడితులనూ ఆదుకోవలసిన బాధ్యత వున్నది!" ఆయన పకపకా నవ్వుతూ అన్నాడు. "ఆ విషయంలో సరైన సమయంలో సరైన నిర్ణయం తీసుకోవటమే సమంజసంగా వుంటుంది!"

నలుగురూ ఆ ఇంటి గేటు దాటింతరువాత, "విశ్వనాథంగారు మనకు చాలా సాయం చేశారు... ఫీజు ఎంతడిగినా ఇవ్వవచ్చు!" అన్నాడు ఆంజనేయులు తృప్తిగా. "దానికి తోడు అంతకుముందున్న మన కీచకుల పక్షపాతి ఇన్‌స్పెక్టర్ మారిపోవటం కూడా చాలా మేలు చేసింది!"

పూర్ణచంద్రరావుగారు అలవాటుగా పెద్దగా నవ్వుతూ,"భేష్! ఆంజనేయులుగారు అన్నది నిజమే... దానికి కారణం ఎవరో తెలుసా?" అడిగాడు.

"చెప్పండి!"

"అదీ విశ్వనాథంగారి ఆలోచనే!"

* * *

శ్రీరామనవమి ఏప్రియల్ పదహారో తారీఖు శనివారంనాడు అయింది.

సాయీరాంపురంలో ఆ వేడుకను మూడు రోజులు చేయాలని ముందే నిర్ణయించుకున్నారు. మొదటి రోజున చక్రవర్తి తల్లి పాటకచేరి, రెండో రోజు మంగళగిరి నుండి వచ్చే దాసుగారి చేత సీతారామకళ్యాణం హరికథ, మూడోరోజు మధ్యాహ్నం కళ్యాణం, తరువాత ఊరందరికీ అన్న ప్రసాద వితరణ, సాయింత్రం స్వామివారి ఊరేగింపు...

పూర్ణచంద్రరావుగారు, చక్రవర్తి, ఆంజనేయులు, భ్రమర విశ్వనాథాన్ని కలిసిన మూడోరోజున నాగరాజును అరెస్టు చేశారు. ఆ రాత్రే మాణిక్యం ఆ ఊరునుంచి అర్థరాత్రి సమయంలో పారిపోయింది.

చక్రవర్తి కుటుంబ సభ్యులంతా సాయీరాంపురం ఆ వేడుకను చూడటానికి ఒకరోజు ముందే వచ్చారు. అనంతపురంనుంచి అతడి అక్కయ్యకూడా వచ్చింది. అటు భ్రమర తల్లీ, చెల్లెళ్ళు, అన్నయ్యా వచ్చారు.

చక్రవర్తి తల్లికయితే చాలా ఉత్సాహంగా వున్నది. ఎన్నో సంవత్సరాల క్రితం, తన వివాహమయిన కొత్తల్లోనే ఇలాంటి శుభదినాన ఆమె ఆ గుడి వేదికమీద పాటలు పాడిన విషయం గుర్తుకు తెచ్చుకుంటూ మురిసిపోతున్నది.

ఆంజనేయులు హడావుడి చెప్పతరం కాకుండా వున్నది.

పదోతరగతి పరీక్షలయిన వెంటనే చక్రవర్తి, భ్రమర ఊళ్ళకు వెళ్ళకుండా కొనుక్కున్న తమ ఇంటి ప్రక్షాళన ప్రారంభించారు. ముందుగా ఓ పక్కకు మార్చిన దేవుడి గదిని పూర్వస్థానానికి మార్పించాడు. రంగులేయటం అవ్వగానే ఆవరణలో వివిధ రకాల పూలమొక్కలు తెచ్చి నాటించారు. అప్పటికే తాతగారు పెట్టిన సన్నజాజి తీగకు ఎండిపోయిన ఆకుల్ని తృంచివేసి, కొమ్మల్ని కత్తిరించి కుదురు బాగుచేయించారు. మామిడిమండల్ని దేవాలయంలోనూ ఇంటికీ కట్టించారు.

మొదటి రెండు రోజులూ అనుకున్న కార్యక్రమాలన్నీ విజయవంతంగా జరిగినయి. చక్రవర్తి తల్లికయితే గుడి వేదికమీదనుండి పాటలు పాడుతున్నప్పుడు ఆనందంతో కళ్లు పదేపదే చెమర్చినయి.

మూడో రోజున గుంటూరునుంచి విశ్వనాథం దంపతులు, రఘురాం దంపతులు వచ్చారు. అక్కడ జేరిన జనాన్ని చూస్తుంటే సాయీరాంపురమంతా శ్రీరామ కళ్యాణాన్ని తిలకించటానికి వచ్చిందా అనిపిస్తోంది.

సన్నాయి మేళం వీనుల విందుగా వినిపిస్తోంది ఆ పందిట్లో.

రామబ్రహ్మంగారింట్లో బావి పళ్ళెం పక్కగా వేసిన పందిరి క్రింద వంటలు చేస్తున్నారు.

పదకొండు గంటలకల్లా పూర్ణచంద్రరావుగారు భార్యా పిల్లలతో వచ్చి విశ్వనాథం కుటుంబం పక్కగా కూర్చున్నారు.

ఇన్‌స్పెక్టర్ సుభాష్ అక్కడ ఎలాంటి గొడవ జరక్కుండా చక్కని బందోబస్తు ఏర్పాటు చేశాడు.

ఈ సంవత్సరం కళ్యాణ పీటలమీద పూర్ణచంద్రరావుగారి దంపతులని కూర్చోబెట్టటం సమంజసంగా వుంటుందని అందరూ కలిసి నిర్ణయించారు. ఆయన మార్చి ముప్ఫయి ఒకటో తేదీన ప్రభుత్వ పాఠశాల ప్రధానోపాధ్యాయుడిగా పదవీ విరమణ చేశారు.

ఆ దేవాలయ పూజారిగారే ఆ పవిత్రకార్యాన్ని నిర్వహించారు. తలంబ్రాల తరువాత స్వామికి పూర్ణచంద్రరావుగారు పట్టువస్త్రాలు సమర్పిస్తే వచ్చినవారంతా ధనరూపేణా ఇవ్వటం జరిగింది. సరిగ్గా ఆ సమయంలోనే వేదిక దగ్గరకు భుజంగం భార్యతో వచ్చాడు. ఒక్కసారిగా నిశ్శబ్దమేర్పడింది ఆ ఆవరణంతా.

భుజంగం ఓ కవరును స్వామివారి పాదాలదగ్గర పెడుతుంటే, "అందులో ఎంత ఉన్నదో చెబితే మీ పేరున చదివిద్దాం!" అన్నారు పూర్ణచంద్రరావుగారు.

"అందులో డబ్బేమీ లేదండి... సర్పంచ్‌గా నా రాజీనామా పత్రాన్ని స్వామి వారి పాదాల దగ్గర పెడుతున్నాను... ఇంతవరకూ ఈ గ్రామంలో నాకు తెలిసి జరిగినా, తెలియక జరిగినా, చాలా తప్పులు జరిగినయి... వాటికి నన్ను మన్నించండి...

చట్టరీత్యా ఏ శిక్ష విధించినా నేను మనస్ఫూర్తిగా స్వీకరిస్తాను!"

పూర్ణచంద్రరావుగారు కన్నార్పకుండా ఆయన్నే చూస్తూ ఉండిపోయాడు కొద్దిక్షణాలపాటు.

మరుక్షణంలోనే చంద్రలేఖ వారి చేతిలో ఓ కవరు పెడుతూ, "ఈ పదివేలనూ స్వామి వారి కళ్యాణ సందర్భంలో మా వారి పేరుమీద కానుకగా సమర్పించండి!" అన్నది.

ఆ కార్యక్రమం పూర్తయ్యేటప్పటికి రెండు గంటలయింది. వెంటనే ఆ ఆవరణలోనే పందిళ్ళక్రింద వచ్చిన భక్తులందరికీ వేడివేడి భోజనాలను వివిధ వంటకాలతో వడ్డిస్తూ ఆంజనేయులు, భ్రమరా, చక్రవర్తి తృప్తి చెందారు.

భోజనాలయిం తరువాత ముఖ్యులంతా రామబ్రహ్మంగారి ఇంటి వరండాలో వేసివున్న పరుపుల మీద విశ్రాంతిగా కూర్చున్నారు.

"ఇక మనకు మిగిలింది చిరంజీవులయిన చక్రవర్తి భ్రమరల వివాహ కార్యక్రమం... అటుపెద్దలు, ఇటుపెద్దలు ఆ శుభకార్యాన్ని ఎప్పుడు జరిపేది నిర్ణయిస్తే దాన్నీ ఈ ఊళ్ళోని ఈ దేవాలయంలోనే జరిపేందుకు ఏర్పాట్లు చేద్దాం!" పూర్ణచంద్రరావుగారే చొరవతీసుకుంటూ అన్నారు.

"అదీ మీరే నిర్ణయించండి!" అన్నారు అటూ ఇటూ పెద్దలు.

"మరి కట్న కానుకల విషయంలో మీ అభిప్రాయాలు తెలుసుకోవాలిగదా!"

"మాకయితే అలాంటివేవీ లేవు... ఆనవాయితీ ప్రకారం అమ్మాయికి ఇవ్వవలసిన వస్త్రాలు మేం తెస్తాము... అబ్బాయికి ఇవ్వవలసినవి వారు తెస్తారు... మన ఊళ్ళోనే వివాహం జరుపుదామంటున్నారు కాబట్టి ఆరోజు జరిగే ఖర్చంతా మాదే!" చక్రవర్తి తండ్రి అన్నాడు.

"భేష్! చాలా ఉన్నతమైన ఆలోచన మీది!" పూర్ణచంద్రరావుగారు అన్నారు.

భ్రమర అన్నయ్య వెంటనే, "అలా ఎలా అవుతుంది... పెళ్ళి ఖర్చంతా ఆడపిల్లవారిదే అవ్వటం మన సంప్రదాయం... దాన్ని మేమే భరిస్తాం!" అన్నాడు.

"ఇది మరీ భేష్! శుభం... పూజారిగారిని పిలిచి మంచి రోజుచూసి లగ్నపత్రిక వ్రాయమనండి ఆంజనేయులుగారు... మీరు రాములవారి ప్రతినిథులు... ఈ కార్యక్రమమంతా మీ చేతులమీదగానే జరగాలి!"

"అయ్యా మాష్టారూ! ఇక్కడ నాదో అభ్యంతరం వున్నది!" విశ్వనాథం ముందుకు జరిగాడు.

"లాయరు పేచీ పెట్టబోకండి స్వామీ!" పూర్ణచంద్రరావుగారు చాలా చనువుగా అంటూ పకపకా నవ్వారు.

"పేచీ అంటే పేచీ, లేదనుకుంటే లేదు... నా సంగతి మీకు తెలిసిందే కదా!" ఆయన ఆగి అందరివంకా ఒక్కసారి చూచారు ఉత్కంఠ కలిగిస్తూ. ""మాష్టారూ! మా కుటుంబం సంగతి మీకు తెలుసు... నాకు ఒక్కడే కొడుకు... బాగా చదివించి అమెరికాపోయి సంపాదించుకోరా అనిపంపిస్తే అక్కడో దొరసానిని చేసుకుని మనదేశాన్నే కాదు, మమ్మల్నే మరిచిపోయాడు. మాకు వాడికి వివాహం చేసే అవకాశమే లేకుండాపోయింది... మా ఆవిడకయితే ఈ జీవితంలో కన్యాదానం చేయలేకపోతున్నామే అనే దిగులు ఒకటి వున్నది... దాన్ని ఆనందబరచటానికి భ్రమరను మా అమ్మాయిగా భావిస్తూ కన్యాదానం చేయాలని అనుకుంటున్నాను పెద్దలంతా అంగీకరిస్తే... ఆ మధ్య మీరడిగారు నే చేపట్టిన మీ కేసులకు ఫీజెంతో చెప్పమని... అలా ఆ అమ్మాయి పెళ్ళిని మా చేతులమీదగా చేయనీయటమే నా ఫీజుగా భావిస్తాను!"

పూర్ణచంద్రరావుగారే సంతోషంగా నవ్వుతూ, "భేష్! బాగుందయ్యా నీ ఆలోచన... భ్రమర తల్లికే అభ్యంతరమేమైనా ఉన్నదేమో కనుక్కోవాలి!" అన్నారు.

భ్రమర అన్నయ్యే నోరు విప్పారు. "మాకు ఎలాంటి అభ్యంతరమూ లేదండి... స్వాగతిస్తాం కూడా... నేను చేయాల్సిన కార్యక్రమాన్ని పెద్దవారు వారు

నిర్వహిస్తామంటుంటే అంతకు మించిన ఆనందం ఇంకేమున్నది... నాకు ఇద్దరు ఆడపిల్లలు ఉన్నారు ఆ ముచ్చట తీర్చేందుకు!"

"భేష్! భేష్!... శుభం... ఒక పనిచేద్దాం... ఇది మగ పెళ్ళివారిల్లయితే, మా ఇల్లే ఆడపిల్లపెళ్ళివారిల్లు అవుతుంది... పెళ్ళికూతురుకి పుట్టింటివారింట్లో చేయాల్సిన వేడుకలన్నీ మా ఇంట్లో చేద్దాం... ఆ పైన కళ్యాణ మండపం కోదండరామస్వామి వారి ఆలయమే! భేష్... అలాగే కానిచ్చేద్దాం!"

"మాస్టారూ! ఈ శుభసందర్భంలో నా మనసులోని మరో మాటకూడా మీముందుంచుతాను!" చక్రవర్తి అన్నాడు.

"చెప్పు! ఆలస్యం దేనికి?"

"ఈ ఇంట్లో మేం ఉండటమే కాకుండా దీన్ని 'రామబ్రహ్మం విద్యా కేంద్రం'గా చేసి రోజూ సాయంత్రం పూట ఆసక్తి వున్న విద్యార్థులకు నేను లెక్కలు, భ్రమర హిందీని ఉచితంగా బోధించాలనుకుంటున్నాం!"

"భేష్! బాగుందయ్యా నీ ఆలోచన... కాని ఈ ముసలివాణ్ణి అప్పుడే మర్చిపోతే ఎట్లా... రోజూ వచ్చి నేనూ ఇంగ్లీషు చెబుతాను!" అన్నారు సంతోషంగా పూర్ణచంద్రరావుగారు నోరంతా తెరిచి నవ్వుతూ.

**(సమాప్తం)**